# ఆదివాసుల జీవనము

ఆంధ్రప్రదేశ్ గిరిజన జాతుల సంక్షేమ సంఘ అధ్యక్షులు

'గిరిజన స్రవంతి' (మాస పత్రిక) సంపాదకులు

శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లు

వెలువరించిన



M/s.పూజా పబ్లికేషన్స్, గుంటూరు - 522 002.

# ఆదివాసుల జీవనం

సంకలనం :

**భూక్యా చినవెంకటేశ్వర్లు**

ఎడిటర్, "గిరిజనస్రవంతి"

ప్రచురణ :

**పూజా పబ్లికేషన్స్**

వల్లూరివారి తోట, డోర్ నెం. 7-16-68/1

గుంటూరు - 522 002

ఫోన్ : 235 692

ఆదివాసుల జీవనం

ప్రథమ ముద్రణ
నవంబరు - 1998
కాపీలు 4000

సంకలనం :
భూక్యా చినవెంకటేశ్వర్లు

మూల్యము :
55-00 రూపాయలు

ముద్రణ :
బాబు రిప్రోగ్రాఫిక్స్
లాలాపేట - గుంటూరు -3
ఫోన్ : 356048

డి.టి.పి.
రాఘవ కంప్యూటర్స్
అరండల్‌పేట, గుంటూరు -2
ఫోన్ : 352591

# ఈ పుస్తక రచయిత గురించి

మానవ జాతి పరిణామానికి చెందిన సింబల్స్ "దశావతారాలు" !

"దశావతారాలు" దేవుళ్ళగురించి, మూఢభక్తిని గురించి తెలియ జేస్తాయనే వాదన ఒట్టి బూటకం! నిజానికి అవతారాలు అనేవి పదికాదు. మానవ సంస్కృతి రాజకీయం కేవలం ఎనిమిదిగానే మనం గుర్తించాలి. ఈ పచ్చినిజం చాలామందికి పచ్చివెలక్కాయలా మింగుడుపడకపోవచ్చు. ఏదైనానిజాన్ని మనం చెప్పదలచినప్పుడు ఎవ్వరో ఏదో అంటారనే సంశయంతో చెప్పకుండా వుండటం మంచి రచయిత లక్షణంకాదు. మొదటి అవతారం మత్స్యావతారం (చేప) ఎవరో రాక్షసుడు నాలుగు వేదాల్ని తస్కరించి సముద్రంలో దాక్కుంటే మహావిష్ణువు చేప రూపంలో సముద్రంలోపల దాగిన రాక్షసుని చంపి అవేదాలను సృష్టికర్తకు ఇస్తాడు అంటే ఈ అవతారం సృష్టిలో జీవ అవిర్భావం గురించి చెబుతుంది. శాస్త్రవేత్తల అభిప్రాయం ప్రకారం సృష్టిలో మొదటి జీవి ఏకకణ జీవి. ఇది సముద్రములోని "పాచి" ద్వారా జన్మించింది. పరిణామక్రమంలో ఈ ఏకకణజీవి ద్వికణజీవిగా ఆ తర్వాత మత్స్యం ఇతర సముద్రజీవిగా రూపాంతరం చెందింది. ఆ తర్వాత కూర్మావతారం (తాబేలు), దేవదానవ సంఘర్షణలో సముద్రజలాన్ని మదించినప్పుడు పర్వతం సముద్రంలో మునిగిపోకుండా దానిని తనవీపుపై మోసి సముద్ర జలంలోనుండి పైకెత్తి అమృత మథనానికి తోడ్పడుతుంది. తాబేలు ద్విచరజీవి అంటే అటు జలంలోను, ఇటు భూమిపైనా తిరుగాడే ద్విచరం. మత్స్యం తర్వాత పరిణామ క్రమం చెందిన ప్రాణి తాబేలు నీటిలోను, భూమిపైనా తిరుగాడే ప్రాణి తాబేలు,

ఈ ద్విచరం తర్వాత అనంతకాల పరిణామక్రమంలో జనించిన భూచరం వరాహం. ఈ వరాహం తర్వాత దశావతారాల్లో నరసింహ స్వామిని చెబుతారు. ఈ నరసింహుడు ఆదిమానవునికి సంకేతం. ఈ అవతారాల తర్వాత వామనుడు. ఈ వామనడు భూసురుడు. రాజరిక వ్యవస్థ పై బ్రాహ్మణత్వం ఆధిపత్యం చెలాయించినందుకు ఇది 'సింబాలిక్'. రాజరిక వ్యవస్థపై బ్రాహ్మణాధిక్యత ఎన్నాళ్ళో నిలవలేదు. కార్త్య వీర్యార్జునుడనే రాజు బ్రాహ్మణాధిక్యతపై దండెత్తడంతో పశురురాముడు గండ్రగొడ్డలితో చేతికందిన రాజులను చాలా మందిని సంహరించి శ్రీరాముడుని కూడా ఎదిరించి భంగపడి శరణు అంటూ అతడిని అవతారపురుషుడుగా కీర్తిస్తాడు. రామావతారం తరువాత చెప్పదగ్గది శ్రీకృష్ణావతారము. ఈ కృష్ణుడు యౌధేయుడు. బలవంతులైన ద్రవిడ రాజరికంపై దండెత్తి శక్తియుక్తులతో వాళ్ళ రాజరికాన్ని పడగొట్టినందులకు గుర్తు మత్స్యావతారం నుండి కృష్ణావతారం వరకు మానవపరిమాణానికి చెందిన ఈ అవతారాలు చెరగని గుర్తులు!!

ఆదిమ సమాజంనుండి పరిణితి చెందిన మనిషి ఆటవిక సమాజంలోకి అడుగు పెట్టిన తరువాత జరిగిన అనేక జాతుల సంఘర్షణలో నాగరిక సమాజం నుండి దూరమై అనాది నుండి అడవులలోనే తన మనుగడ సాగిస్తూ అనేక వర్గాలుగా విడిపోయినా సాంప్రదాయ బద్ధమైన జీవితాన్ని గడుపుతూండటం జరుగుతుంది. ప్రపంచం మొత్తంమీద ముఖ్యంగా ఆఫ్రికా, దక్షిణాసియా ప్రాంతాలలోనూ భారతదేశంలోగల అనేక అరణ్య ప్రాంతాలలోను జీవిస్తున్న అనేక జాతుల ఆదివాసుల జీవన విధానాన్ని వారి మనుగడను కళ్ళకు కట్టినట్లు రాసిన శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లు ఇంకా అనేక మంది మేధో రచయితలు పడ్డ శ్రమ వర్ణనాతీతం.

"ఆదివాసి జీవితం" అనే ఈ పుస్తకం వెలకట్టలేని అమూల్య గ్రంథం. దీనిని వెలువరించడంలో శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లు పడ్డ శ్రమ, పరిశోధనలు వెలకట్టలేనివే! శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లు వ్రాసిన అనేక అమూల్య రచనలలో ఈ ఆదివాసి జీవితం వాణి 'హస్త కంకణం' అని చెప్పవచ్చు. ఇప్పుడు ఈ పుస్తకం మీ చేతుల్లో వున్నది. చదవండి.తప్పొప్పులను నిస్సంకోచంగా వ్రాయండి. సంకలన కర్త, రచయిత శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లు మలి ముద్రణలో వాటిని స్వీకరించగలడు.

ఈ పుస్తకాన్ని సంకలనం చేసిన రచయిత శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లుకు, గ్రంథ స్వీయకర్త శ్రీ రాఘవ రెడ్డి (యస్సీ కార్పోరేషన్) గార్లకు నా అభినందనలు !!

గుంటూరు

15-11-1998.

భవదీయుడు

**"తాడిశెట్టి"**

సీనియర్ జర్నలిస్టు

## ఈ పుస్తకం గురించి మీతో ....... ఒక్క క్షణం.

ప్రపంచంలో లక్ష్యలాది సంవత్సరాల క్రితం మానవుడు ఆవిర్భవించాడనేది నగ్న సత్యం !

డార్విన్ సిద్ధాంతం ప్రకారం కోతి నుండి మానవుడు పుట్టా (పరిణితి చెందా)డనేది ఒక నమ్మకం !

ఏమైన తొట్టతొలుత ఆదిమమానవుడు కళ్ళు తెరిచినపుడు ఈ ప్రపంచం ప్రకృతి పరిణామాలు సకల జీవ జంతుజాలము అంతా చిత్రంగా, విచిత్రంగా, అయోమయంగా కన్పించింది.

మాట్లాడని తెలియని ఆదిమ మానవుడు కొన్ని లక్షల సంవత్సరాల తరువాత సైగలు, ఆతరువాత ఒక అక్షరం' మా' ఆ తరువాత రెండు అక్షరాలతో "అమ్మ, అయ్య, అక్క, అన్న" లాంటి మాటలతరువాత చిన్న మాటలు మాట్లాడటంతో ఆదిమ మానవుని జీవితం ప్రారంభమైంది. కాలం గడిచిన కొద్ది ఆదిమ మానవుని జీవితం కొద్దికొద్దిగా పరిణితి చెంది ఆటవిక జీవితం వైపు పయనించింది. కాలగర్భంలో లక్ష సంవత్సరాలు అంటే సుదీర్ఘమైన కాలమేమి కాదు. అయితే నూరు సంవత్సరాల కాలం మానవుని జీవితంలో చాలా సుదీర్ఘమైన కాలమే!

కాలం గడిచే కొద్దీ మనిషి జ్ఞానాన్ని పెంచుకొన్నాడు. ఆదిమ మానవ జాతి సమాజంలో లేని వావి- వరసలు ఆటవిక దశలోని" మనిషి అమ్మ- నాన్న-అన్న - తమ్ముడు- అక్క- చెల్లెలు" వరుసలతో పాటుతమ జీవిత భాగస్వామిని "భార్య"గా పిలిచాడు. ఆ తరువాత మనిషి కాల ప్రవాహంలో నాగరిక ప్రపంచాన్ని ఎన్నుకొన్నాడు. నగరాలు, కోటలు, ,మిద్దెలు కట్టాడు. తనకంటే బలహీనుడైన సాటి మనిషిని బానిసగా చేసాడు. సుఖమైన జీవితానికి, ఆ జీవితం గడిపేందుకు తన సృష్టిచుకొన్న డబ్బును తానే కూడబెట్టటంతో పాటు దోపిడి విధానమూ నేర్చాడు. దీనితో పాటు తన అధికారాన్ని సుస్థిరం చేసుకోవడానికి యుద్ధాలు చేసాడు. తోటి మానవ రుధిరంతో స్నానంచేసాడు. ఈ రక్తపాతంలో చాలామంది అమాయకులు నగరానికి, నాగరికతకు దూరంగా, సుదూరంగా ఇంకా అక్కడక్కడ మిగిలియున్న ఆదిమ-ఆటవిక మానవ జాతి నివాసాల వైపు తలదాచుకొనేందుకు, ప్రాణాలు దక్కించుకునేందుకు పారిపోయారు.

వారే నాటి ఆటవిక జాతి అవశేషాలుగా నేడు అక్కడక్కడ అడవి తల్లి రక్షణలో కొండకోనల్లో మిగిలిపోయిన ఆదివాసులు లేక గిరిజనులు!!

భారతదేశంలో గల అనేక ప్రాంతాల్లో ఆదివాసులు నేటికిని తమ ఉనికిని,

సంప్రదాయాన్ని, ఆచార వ్యవహారాలను బహు జాగ్రత్తగా కాపాడుకొంటున్నారు. ఆదివాసుల సంక్షేమంకోసం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనేక ప్రణాళికలను సిద్ధం చేసాయి. అయితే ఈ ప్రణాళికలు ఏవీ వారికందుబాటులో లేవు. ఈ ప్రణాళికలు అందుకోసం ఖర్చుచేస్తున్న నిధులు మధ్యదళారిల పాలపడుతున్నందున లక్షలాది సంవత్సరాల క్రిందట వారి జీవితాలు ఎలా ఉన్నాయో నేటికి అలాగే వున్నాయి.

"ఆదివాసుల జీవనం" అనే ఈ సంకలనంలో ఎంతో మంది మేధో రచయితలు వారి సంక్షేమం గురించి ఆచార వ్యవహారాలు, భాష, సంస్కృతి గురించిన వ్రాసిన వ్యాసాలు పొందుపరచబడ్డాయి. ఆదివాసుల లేక గిరిజనుల జీవిన విధానంపై ఇది నా రెండవ రచన. మొదట "ట్రైబల్ లైఫ్" అనే పేరుతో ఒక పుస్తకం వెలువరించిన తరువాత ఆదివాసుల సమస్యలేమిటో నాగరిక ప్రపంచం గ్రహించేందుకు ఈ రెండవ పుస్తకం "ఆదివాసుల జీవనం" అనే పేరుతో వెలువరించడం జరిగింది.

ఈ పుస్తక రచనలో ప్రచురణలో నేను పడ్డ శ్రమ వెచ్చించిన కాలం రెండూ వెలకట్టలేనివి. అయినా నా శ్రమకు తగ్గ ఫలితం ఈ "ఆదివాసి జీవనం" పుస్తకం మీ అమూల్య కరముల కందించుటలో నేను ఎంతో విజయానందం పొందగలను. ఈ పుస్తకం మీ చేతుల్లో ఉన్నది కాబట్టి మీరు చదివి మీ అమూల్య అభిప్రాయాలను నిస్సంకోచంగా వ్రాయండి. మలి ముద్రణలో మేము వాటిని సరిదిద్దుకొంటాము.

నమస్కారములతో

భవదీయుడు

భూక్యా చినవెంకటేశ్వర్లు

గుంటూరు

15-12-98

# ముందు మాట

గిరిజనుల సంస్కృతిని పరిరక్షించటంతోపాటు వారిని ఆర్థికంగా బలోపేతం చేయటం ఎంతో అవసరం. వారి ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వం వివిధ పథకాలు చేపట్టటం ఆనందించదగినా ఈ పథకం అమలుపై కొంత వేదన కలుగక మానదు. వీటివలన గిరిజనులలో కొంత ఆత్మ విశ్వాసం ఏర్పడుచున్నా, గిరిజన సంస్కృతి మాత్రం నశించి పోతున్నట్టుగా కనబడుచున్నది.

అయితే గిరిజనాభివృద్ధి పథకాలు ఎంతవరకు సఫలమయ్యాయనేదే చర్చ. అంతేకాకుండా గిరిజనుల యొక్క సంస్కృతిని పరిరక్షిస్తూ వారిలో ఎంత మంది ఆర్థికంగా నిలబడగలిగారు అనేది గిరిజనులు, గిరిజనేతరులు ఆలోచించాలి.

గిరిజన స్రవంతి చీఫ్ ఎడిటర్ శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లు గిరిజనుల ఆర్థికాభివృద్ధికోసం , వారి సామాజిక వికాసం కోసం ఎంతో సేవ చేస్తున్నారు. ఈ పుస్తకాన్ని వారు ఎడిట్ చేసి తీసుకురావటం గిరిజనులపై వివిధ ప్రముఖుల అభిప్రాయాలను తెలుగు పాఠకలోకానికి, పరిశోధకులకు అందించటానికి చేసిన ప్రయత్నం మాత్రమే.

ఈ పుస్తకం మొత్తం 30 వ్యాసాల సంకలనం. ఈ వ్యాసాలు పరిశోధనాత్మక వ్యాసాలు. గిరిజన సమస్యలపై అవగాహన కలవారు, పరిశోధించినవారు రచించినవి. ఈ వ్యాసాలు గిరిజానాభివృద్ధి, వారి సాంస్కృతిక మానసిక వికాసాన్ని వారి జీవన విధానాన్ని పై పరిశోధించి వ్రాసినవి. ప్రముఖులైన శ్రీ యమ్.టి. ఫీన్; శ్రీ బి.యన్. సహాయ్, డా॥ బాలగోపాల్, డా॥ వి.వి.ఎన్. శర్మ మొదలగువారివే కాకుండా ఎడిటర్ శ్రీ భూక్యా గారు తన రచనలు కూడా పాఠకలోకానికి అందిస్తున్నారు.

ఈ పుస్తకం చదవటం వలన గిరిజనుల సామాజిక ఆర్థికవ్యవస్థపై సామాన్యులకు కూడా మరింత అవగాహన ఏర్పడును.

ఈ వ్యాస సంపుటిలో స్వాతంత్రం రాకముందు, వచ్చిన తరువాత గిరిజనులలో వచ్చిన మార్పులను వివరించారు శ్రీ యన్. సహాయ్ గారు. "గిరిజనులు-గిరిజనుల సంస్కృతి" అనే వ్యాసంలో గిరిజనులు నేటి సమాజంలో ఏ విధంగా దోచుకోబడుచున్నదీ వివరించారు రాష్ట్ర పౌరహక్కుల సంఘం ప్రధాన కార్యదర్శి డా॥ బాలగోపాల్‌గారు. "గిరిజనుల ఆచారాలు-అలవాట్లు" అనే వ్యాసంలో గిరిజనులు జరుపుకొనే పండుగలు ఉత్సవాల గురించి వివరించారు. శ్రీ రాజ్‌బబ్బర్‌గారు గిరిజనాభివృద్ధి పథకాల క్రిందకు రాని గిరిజనుల గురించి తన వ్యాసం "నాయకపోడు-ఒకపరిశీలన"లో వివరించారు. గిరిజనులపై జాలికాదు వారికివ్వాల్సింది ఇవ్వండి అంటూ ఖచ్చితంగా చెప్పారు శ్రీ జి.యన్. మూర్తిగారు. తమ వ్యాసం "గిరిజనాభివృద్ధి - ఒక పరిశీలనలో. ప్రస్తుత ప్రపంచం పర్యావరణ పరిరక్షణ కోసం ఎంత ఆక్రోశించుచున్నదనీ అయితే పర్యావరణాన్ని పరిరక్షించటంలో గిరిజనుల పాత్ర ఎంత ఉన్నదని డా॥ యమ్. విజయ కోటేశ్వరి వివరించగా, గిరిజన సాహిత్యాన్ని గురించి వివరించారు శ్రీమతి ఝాన్సిగారు. అదేవిధంగా అనేక కోణాల్లో గిరిజన సమస్యలపై తమ అభిప్రాయాలను వివరించారు రచయితలు.

ఈ పుస్తకం అందరికీ ఎంతో ఉపయోగపడగలదని నా విశ్వాసం. గిరిజనుల గురించి, వారి జీవన విధానాన్ని గురించి తెలుసుకోదలచిన వారు దీనిని తప్పక చదవాలి. ఇలాంటి పుస్తకాన్ని బయటకు వెలువరించటం అభినందించదగ్గది.

డా॥ యల్.యస్.యన్. ప్రసాద్‌రెడ్డి
సామాజిక శాస్త్రవేత్త
హిందూకాలేజి,
గుంటూరు.



# మానవతావాది శ్రీ ఆమరు రాఘవరెడ్డి

గుంటూరు జిల్లా షెడ్యూల్డు కులముల సేవా సహకార సంస్థ ఎగ్జిక్యూటివ్ డైరెక్టరుగా పనిచేయుచున్న శ్రీ అమరు రాఘవరెడ్డిగారు 1951 జులై ఒకటిన కడపజిల్లా సింహాద్రిపురం మండలం బాపనూర్ గ్రామంలో మల్లారెడ్డి, నరసమ్మ దంపతులకు జన్మించారు. చిన్నతనం నుండీ విద్యపై ఆసక్తి చూపిన రెడ్డిగారు కృషితో, పట్టుదలతో ఉన్నత విలువలు కల్గిన శ్రీ వేంకటేశ్వర విద్యాలయం తిరుపతి నుండి యం.ఏ., చేయడమే కాకుండా 'లా' చదివారు. సహకార శాఖయందు మరొక డిగ్రీ హెచ్.డి.సి., కూడా పొందారు.

శ్రీ ఎ. రాఘవరెడ్డిగారి ఉద్యోగ సోపానం మొదట 1978లో గ్రూపు 2 పాసై కో-ఆపరేటివ్ సబ్‌రిజిష్ట్రారుగా ప్రారంభించిన కాలంలో అదిలాబాద్ జిల్లాలో రైతులకు ఎనలేని సేవచేశారు. తర్వాత 1987లో గ్రూప్ -1 జిల్లా సంక్షేమ అధికారిగా ఎన్నిక కాబడ్డారు. తరువాత జాయింట్ డైరెక్టరుగా పదోన్నతిపై గుంటూరు జిల్లా షెడ్యూల్డు కులముల సహకార సంస్థ ఎగ్జిక్యూటివ్ డైరెక్టరుగా 1997 నుంచి పనిచేయుచున్నారు.

శ్రీ రెడ్డిగారు ఏ ఉద్యోగంలో వున్నా కడు సమర్ధవంతంగా చేయటం వీరి ప్రవృత్తి. చిత్తూరు జిల్లాలో బి.సి. కార్పోరేషన్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా వెనుకబడిన కులాలవారికి అనేక పథకాలు అమలు చేశారు. ఆ తరువాత కర్నూలు, ఆదిలాబాదు, నెల్లూరు జిల్లాలలో కూడా సమర్థవంతంగా పనిచేసారు.

వీరుచేసిన అభివృద్ధి కార్యక్రమాలలో ముఖ్యమైనవి. వెనుకబడిన విద్యార్థుల ఉపకార వేతనములు జారీచేయటం. వీరికాలంలో వెనుకబడిన విద్యార్థుల వసతిగృహాలలో 80 శాతం పైగా ఉత్తీర్ణత సాధించటం విశేషం. గుంటూరు జిల్లాలో 273 ఎకరాల భూమి దళితులకు కేటాయించి దానిని వ్యవసాయానికి అభివృద్ధి చేయటం, 71 పిల్లరు పాయింట్స్ వేయడం, 69 ఎకరాల భూమిలో రొయ్యల చెరువులు ఏర్పాటు చేయటం, 3 కోళ్ళ ఫారములు ఏర్పాటు చేయటమే కాకుండా 700 ఎకరాల భూమిని తీసుకొని దళితులకు పంచటం విశేషం.

చిత్తూరులో పనిచేయుచున్నపుడు ఉత్తమ అధికారిగా అవార్డునందుకోవటమే కాకుండా, చిత్తూరుజిల్లాలో అనేక ప్రజాహిత కార్యక్రమాలు అమలు చేసినందుకు మరొక అవార్డు, నెల్లూరులో పనిచేయుచున్నపుడు ఉత్తమ నోడల్ అధికారిగా అవార్డు అందుకొన్నారు.

ఎక్కడ పనిచేయుచున్నా క్రింది అధికారులు, సిబ్బందిపై సహృదయతతో ఉండటం వీరి ప్రత్యేకత. వారికి రవిప్రకాశ్‌రెడ్డి, రాజేష్ రెడ్డి అను ఇద్దరు కుమారులు, భార్గవి అనే కుమార్తె కలరు. సహధర్మచారిణి శ్రీమతి. జయప్రదగారు శ్రీరెడ్డిగారికి ఎల్లవేళలా తోడుగా ఉంటూ కుంటుంబాన్ని చూసుకుంటున్నారు.

ఎంతో ఉన్నత విలువలు, నీతి, నిజాయితీ, సద్గుణములు కల్గిన శ్రీ ఎ. రాఘవరెడ్డిగారు గుంటూరు జిల్లాలో వినుకొండ నియోజక వర్గమునందు జోనల్ అధికారిగా వుండి నియోజకవర్గంలోని బాగావెనుకబడిన ప్రాంతాలైన బొల్లాపల్లి, ఈపూరు, వినుకొండ, నూజెండ్ల, శ్యావల్యాపురం మండలాల్లో, జన్మభూమి కార్యక్రమాలతోపాటు, లింకురోడ్డు నిర్మాణములు లిఫ్టిరిగేషన్స్, రహదారులు, పక్కా గృహనిర్మాణము, అక్షరదీప్తి మొదలగు అభివృద్ధి కార్యక్రమాలను 1997 జులై నుండి ఎక్కువకాలము వినుకొండ నియోజకవర్గంలో దళిత, మైనారిటీ, వెనకబడిన, గిరిజనుల, మహిళల అభివృద్ధి కోసం అవిరళకృషి చేస్తున్నారు.

ప్రత్యేకంగా గత 20 సంవత్సరములుగా ఆయన వివిధ హోదాలలో పనిచేసిన జిల్లాలలో అటవీ ప్రాంతాలలో నివసించే అటవిక జాతులు, గిరిజనుల కోసం, వారిజీవన సరళికోసం, గిరిజనులను జనచైతన్యంలోనికి తీసుకురావటం కోసం ఎంతో శ్రమించారు.

రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ జాయింటు డైరెక్టరు క్యాడరు కల్గిన గౌ॥ శ్రీ ఎ. రాఘవరెడ్డి గార్కి శ్రీమతి జయప్రద గారు నిత్యం ఎన్నో సహాయ కార్యక్రమాలలో సహాయం చేయటం, శ్రీ రెడ్డి గారు ఈ రోజున ఎన్నో ఉన్నత పదవులను పొందుటకు పరోక్షంగా తోడ్పడ్డారు. నిత్యము శ్రీ రాఘవరెడ్డి దంపతులు దైవకార్యక్రమాలలో ఎక్కువ సమయం వెచ్చించటం జరుగుతుంది.

అందుకే శ్రీ ఎ.రాఘవ రెడ్డిగారికి ఆంధ్రుల ఇలవేల్పు, శ్రీ తిరుమల వేంకటేశ్వరుడు ఆయురారోగ్యములు, ప్రసాదించమని, నిత్యము పేదవారికి సహాయం చేయగలందులకు ఆశీస్సులు ప్రసాదించ గలందులకు ప్రార్థన.

ఇట్లు

భూక్యా చిన వెంకటేశ్వర్లు

అధ్యక్షులు

గుంటూరు ప్రెస్‌క్లబ్

గుంటూరు - 4

# ఆదివాసులకు - అడవికీ మధ్యనున్న హక్కులను కాలరాయడమే ప్రజావ్యతిరేక (ఫారెస్టు) బిల్లు

- భూక్యా చిన వెంకటేశ్వర్లు
[illegible]

*కేంద్ర ప్రభుత్వం, అడవులు జీవావరణాన్ని పరిరక్షించేందుకు ఇటీవల ఒక కొత్త చట్టాన్ని రూపొందించింది. ప్రకృతి, జీవావరణ వ్యవస్థను కూడా చట్టంలో పొందుపరచడం మూలంగా ఇది గతంలో వచ్చిన చట్టాలకంటే భిన్నమైందిగా తయారయ్యింది. ఈ బిల్లు ప్రత్యేకత ఏమిటంటే దీనిని బహుముఖ ప్రయోజనాలను ఆశించి చాలా జాగ్రత్తగా రూపొందించారు. అటు పర్యావరణ శాస్త్రవేత్తలను ఇటు కలప వ్యాపారులను, ఫారెస్టు అధికారులను గ్రామీణ సంఘ సేవకులనూ సంతృప్తి పరచే ప్రయత్నం చేశారు. అయితే అడవిలో నివసిస్తున్న ఆదివాసులను ఈ చట్టం పూర్తిగా మరచిపోయింది. ప్రకృతిపై ఆదివాసులకు గల సహజ సిద్ధమైన హక్కులను నిరాకరించిన విషయాన్ని వివరించడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం.*

భారత దేశంలో అటవీ చట్టాల చరిత్ర అంతా సహజ వనరుల నిర్వహణను కేంద్రీకరించే విధానానికి అనుకూలంగానే మలచబడింది. గతం రూపొందించిన అటవీ విధానాలన్నీ ఆదివాసుల ఉనికికి శాశ్విత పరిష్కారం చూపకుండా కేవలం న్యాయపరమైన రాజ్యాంగ బద్ధమైన పద్ధతులను మాత్రమే ప్రతిపాదించాయి. కాని ప్రస్తుత బిల్లులో ఆ అంశాలు కూడా క్రమంగా కుదించబడ్డాయి. ప్రభుత్వ పారిశ్రామిక లాబీల ప్రయోజనాలను పరిరక్షించడానికి తగు మార్పులు ఈ బిల్లులో పొందుపరిచారు. ఆదివాసుల ప్రయోజనాలను పరిగణలోకి తీసికోకుండా రెండో స్థానం లోకి నెట్టివేశారు. సహజ వనరులపై రాజ్యం తన పట్టును మరింత పటిష్టపరచి అధికారాలను కేంద్రీకృతం చేయడానికి ఈ బిల్లు ప్రాధాన్యత నిచ్చింది. వనరుల నిర్వహణలో స్థానికుల భాగస్వామ్యాన్ని పెంచాలన్న సూచనను పూర్తిగా పక్కకు నెట్టేసి అంతర్జాతీయ పెట్టుబడుల ప్రవాహాన్ని చట్టబద్ధం చేసేందుకు వీలుగా అనేక అంశాలు ఈ బిల్లులో పొందుపరచబడ్డాయి.

***ఫారెస్టు బిల్లులో ఈ క్రింది అంశాలు ప్రధానంగా చోటు చేసుకున్నాయి.***

1) అడవులను రిజర్వు చేసే ప్రక్రియను అవసరమైతే గ్రామీణ అడవులను కూడా రిజర్వు ఫారెస్టులుగా ప్రకటించే అధికారాన్ని పటిష్ట పరిచింది. ఇది 1927 భారత అడవి చట్టానికి ఆ తరువాత చట్టాలకు విరుద్ధమైనది. క్రొత్త చట్టంలోని ఈ నిబంధన ప్రకారం రిజర్వు ఫారెస్టులోని అంగుళం భూమిని కూడ సాగు చేసుకునే అవకాశం గిరిజన రైతాంగానికి వుండదు. అంతే

కాకుండా ఇకముందు ఏ అడవినైనా రిజర్వు ఫారెస్టుగా ప్రకటించే అధికారం ప్రభుత్వానికుంటుంది. అంటే ఈ చట్టం అమలులోకి వస్తే ప్రజలకు భవిష్యత్‌లో భూమి మీద ఎలాంటి అధికారం లేకుండా పోతుందన్నమాట. రామచంద్ర గుహ పేర్కొన్నట్లు 1927 అడవుల చట్టం కొత్త చట్టం కంటే ఎంతో మెరుగైంది. ఎందుకంటే పాత చట్టం ప్రకారం కనీసం గ్రామీణ అడవులను పెంచుకునే అవకాశం వుండేది. కొత్త చట్టం ఆ అవకాశాన్ని కూడా దూరం చేస్తోంది. అంటే ఇకముందు ప్రజలకుపయోగపడే రక్షిత అడవుల పెంపకం వీలుకాదు. ఇది ఖచ్చితంగా ప్రజావ్యతిరేఖ చర్య. ఎందుకంటే దేశ వ్యాప్తంగా గ్రామీణ లేదా రక్షిత అడవుల కంటే రిజర్వు ఫారెస్టుల విస్తీర్ణం ఎక్కువ. ఇటీవలి గణాంక వివరాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లోని రక్షిత అడవుల విస్తీర్ణం కంటే రిజర్వు అడవుల విస్తీర్ణం నాలుగు రెట్లు ఎక్కువ. కర్ణాటకలో ఈ విస్తీర్ణం పదింతలుగా వుండగా గుజరాత్‌లో గ్రామీణ అడవుల కంటే రిజర్వు అడవులు 13 రెట్లు ఎక్కువ. కొత్త చట్టం అమలులోకి వస్తే భవిష్యత్తులో అంగుళం భూమిని కూడా గ్రామీణులకు దక్కదు. కాగా గిరిజనేతర వ్యాపారులకు దళారులకు ఈ చట్టం వల్ల ఎక్కువ ప్రయోజనం చేకూరింది. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ పరిస్థితిని పరిశీలిస్తే వేలాది ఎకరాల భూములు కలప వ్యాపారులు, దళారుల (గిరిజనేతరులు) అదుపులోకి వచ్చాయి. ప్రభుత్వం ఈ అడవుల విధ్వంసకులకు పట్టాలిచ్చి ప్రోత్సహిస్తుంది. అంతేకాకుండా దళారులకు చట్టపరమైన రక్షణ కల్పిస్తోంది. ఒక్క తూర్పు గోదావరి జిల్లాలోనే 5,518 అవాస పట్టాలను దళారుల కివ్వడం ద్వారా 38 వేల ఎకరాల అటవీ భూమి వారి సొంతం అయ్యింది. ఈ రకంగా ఒక వైపు అడవుల మీద అధికారం వుండాల్సిన ఆదివాసుల ప్రయోజనాలను కాలరాస్తూ మరోవైపు ఈ చట్టం ఖచ్చితంగా గిరిజనేతర దళారులకు అడవిమీద అధికారాన్ని కల్పిస్తోంది.

2) ఈ బిల్లు అటవీశాఖ అధికారులకు విశేష అధికారాల నిచ్చింది. అడవికి గాని జీవావరణానికి గాని ఎవరు హాని తలపెట్టినా అటవీశాఖ అధికారులే అరెస్టు చేయవచ్చు.

3) ఈ చట్టం "క్యారీయింగ్ కెపాసిటీ" పేరుతో ఒక కొత్త క్లాజును ప్రవేశపెట్టింది. ఇది అటవీ సంవృద్ధిని క్షీణతను వివరిస్తుంది. ఈ క్లాజు ప్రకారం అడవి యొక్క సంవృద్ధి క్షీణించినట్లు ప్రభుత్వం భావిస్తే గిరిజనులు అడవిని వినియోగించుకోకుండా చర్యలు తీసికొనవచ్చు. అంటే అడవిని మరోరకంగా వాడుకోవడం నిషేధించవచ్చు.

4) ఈ చట్టం ప్రకారం నిస్సారమైన అటవీ భూములను నిరుపేదలకిచ్చే అధికారాలను రాష్ట్ర ప్రభుత్వాలకు లేకుండా చేస్తోంది. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వానిదే అంతిమ నిర్ణయం.

5) ఈ చట్టం వల్ల పోడు వ్యవసాయం చేసుకునే గిరిజనులు తమ హక్కులను కోల్పోవలసి వుంటుంది. పోడు వ్యవసాయాన్ని ప్రొత్సహించక పోగా 30 డిగ్రీల పైబడిన ఎత్తులో పోడును పూర్తిగా నిషేధించింది. అంటే కేవలం 30 డిగ్రీల ఎత్తులోపే పోడు అనుమతించ బడుతుంది. ఆపైన వ్యవసాయాన్ని నేరంగా పరిగణించబడుతుంది. నిజానికి ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజనులు 30 డిగ్రీల కంటె ఎత్తైన ప్రాంతాలపైనే పోడు వ్యవసాయం చేస్తారు. అంటే బిల్లులో పొందుపరచబడిన ఈ క్లాజు వల్ల రాష్ట్రంలోనే గాక దేశవ్యాప్తంగా పోడు చేసుకుని పొట్ట పోసుకునే గిరిజనులకు తీరని నష్టం జరుగుతుంది. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే దాదాపు 64 వేల ఆదివాసి కుటుంబాలు జీవనాధారం కోల్పోవలసి వస్తుంది.

6) కొత్త చట్టం అగ్రోఫారెస్టుకు సంబంధించిన ఒక క్లాజును పొందుపరచింది. ఈ క్లాజు ప్రకారం ఎవరు చెట్లను పెంచాలనుకున్నా ముందుగా ఫారెస్టు అధికారుల వద్ద నమోదు

చేసుకోవాలి చెట్లను పెంచాలనుకునే రైతులు తమ సొంతభూమిలో అయినా సరే అధికారుల అనుమతి తీసుకోవాలి. దీనివలన రైతులకు చెట్లు పెంచుకునే స్వేచ్ఛ కూడా లేకుండా పోవడమే గాక ఒకవేళ పెంచినా న్యాయ సంబంధమైన సమస్యలు ఎదురయ్యే అవకాశం వుంది. దీనికి తోడు పర్యావరణ మంత్రిత్వశాఖ క్యాపిటవ్ ప్లాంటేషన్ (Captive Plantation) పేరుతో ఒక క్రొత్త ప్రతిపాదన సిద్ధం చేసింది. దీనివలన ప్రైవేట్ వ్యక్తులకు కాంట్రాక్టరులకు ప్రయోజనం చేకూరగా, దేశ సహజ వనరులకు ప్రమాదం వాటిల్లనుంది. ఈ ప్రాజెక్టు ప్రకారం దాదాపు 30 లక్షల హెక్టారుల అడవి భూములకు కలప వ్యాపారులకు, ప్రైవేటు వ్యక్తులకు లీజు పేరుతో ధారాదత్తం చేయనున్నారు. ఇది ప్రజల ముఖంగా గిరిజనులవనరులను ప్రైవేటీకరించే ప్రయత్నం. ఈ మొత్తం ఆటలో ఆదివాసులు, రైతులే పావులై బలికానున్నారు.

ప్రభుత్వం ప్రతిపాదిస్తున్న కొత్త చట్టంలో స్థానిక రాజకీయ నాయకుల గురించి అడవి వినాశనానికి కారకులైన లీడర్ల గురించి ఎటువంటి ప్రస్తావన లేదు. నిజానికి ఈ విధ్వంసకాండ అంతా రాజకీయ నిర్వాహక అధికార స్థాయిలోనే జరుగుతుంది. దీనిని ఇంకా వివరంగా అర్థం చేసుకోవటానికి ఈ క్రింది అంశాలు తోడ్పడతాయి.

(ఎ) ప్రస్తుతం అమలులోవున్న చట్టాలు అడవి తరుగుదలను అరికడతాయా? లేదా? ఒకవేళ అరికట్టకపోతే బ్యూరోక్రాట్స్‌కు నిర్వహణ బాధ్యతను అప్పగించడం సమంజసమా? అడవిని విభజించి స్థానిక గిరిజన సముదాయాలకు దాని నిర్వహణ బాధ్యతను అప్పగించలేదూ?

(బి) భారత ప్రభుత్వం రూపొందిస్తున్న శాసనాలు ముఖ్యంగా సహజవనరుల నిర్వహణ కోసం చేస్తున్న చట్టాలు, ప్రజలు, గిరిజనులు పేదరైతాంగ ప్రయోజనాలకు మంత్రిత్వ శాఖ రూపొందించిన చట్టాలే ఇందుకు ఉదాహరణ.

(3)అడవులవంటి సహజ వనరులను ప్రైవేటీకరించే ప్రక్రియ వేగవంతమవుతున్న ప్రస్తుత తరుణంలో నిర్వాసితులయ్యే వారి సంఖ్య మరింత పెరిగే అవకాశం వుంది. ఇది దుర్భర పరిస్థితులకు దారి తీయనుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రస్తుతం ప్రతిపాదనలో వున్న ఈ కొత్త బిల్లు సాముదాయక వనరుల నియంత్రణ నుంచి ప్రజలను దూరం చేసే ప్రయత్నం తప్ప మరొకటి కాదు. పారిశ్రామిక వేత్తలు అధికారులు, కుమ్మక్కై ప్రజల వనరులను లూటి చేయడానికి వీలుగా ఈ విధానాలను రూపొందిస్తున్నారు. ఇవి ప్రజా వ్యతిరేక విధానాలుగా పరిణమిస్తున్నాయి. గిరిజన భూముల నియంత్రోణతోపాటు అడవి వనరులపై గ్రామ కమిటీలకు అధికారాలు ఇవ్వడం వంటి చర్యల ద్వారా మాత్రమే అడవుల క్షీణతను అరికట్టగలుగుతాం. ఈ రెండు చర్యలను శాసనబద్ధం చేసి రాజకీయంగా గౌరవించనట్టయితే కొత్త చట్టం కూడా నిర్వీర్యమై పోవడం తథ్యం.

ఈ పరిస్థితులలో వివిధ సందర్భాలలో మేధావులు, స్వచ్ఛంద సంస్థలు ప్రజా సంఘాలు చేసిన సూచనలను పరిగణలో ఇక తీసుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. వారి సూచనలు డిమాండ్లు యీ విధంగా వున్నాయి.

1) సబ్ ప్లాన్ ప్రాంతాలలో సబ్ షెడ్యూల్ ప్రాంతాలలో చెట్ల పెంపకానికి అనుమతి నిచ్చే 38 (ఇ) (1) క్లాజును తొలగించాలి.

ఈ క్లాజు అడవిని వ్యాపారీకరించే ప్రక్రియకు తోడ్పడుతుంది. ఇది జీవన వైవిధ్యాన్ని (Bis diversity) దారుణంగా దెబ్బతీస్తుంది. ఈ క్లాజు వల్ల పేద గిరిజనులకు సాగు చేసికోవడానికి అంగుళం భూమి కూడా అందకుండా పోతుంది.

గిరిజనుల ప్రయోజనాల కోసం రూపొందించి వున్న చట్టాలు కొత్త బిల్లు వల్ల పనికి రాకుండా పోతాయి.

క్లాజు సంపన్నులైన వలస భూస్వాములు షెడ్యూలు ప్రాంతాలకు వచ్చి స్థిరపడటానికి అవకాశం కల్పిస్తోంది. ఇది గిరిజన విధానాన్ని దెబ్బతీస్తుంది.

2) అండమాన్, లక్షదీవుల అడవి చట్టాలను కూడా కొత్త చట్టంలోని 34(ఎ) జాబితాలోకి చేర్చాలి. ఈ దీవులలోని నిర్జన అరణ్యాలలో అటవీ ఉత్పత్తులను సేకరించడం గానీ, అడవులను నరికి వేయడంగానీ పూర్తిగా నిషేధించాలి.

3) చట్టంలో సూచించిన భారసామర్థ్య భావన (Carrying) పూర్తిగా తొలగించి ప్రత్యామ్నాయ పదాన్ని వాడాలి ఎందుకంటే అడవి యొక్క సామర్థ్యం క్షీణించిందన్న నెపంతో పేద గిరిజనులకు వ్యతిరేకంగా చర్యలు చేపట్టే అవకాశాన్ని ఈ క్లాజు కల్పిస్తుంది. ప్రభుత్వం పేర్కొన్న జీవావరణ బాధ్యత అభినందించ దగిందే అయినప్పటికీ స్థానిక సముదాయాలను వారి సామాజిక ఆర్థిక స్థితిగతులను కూడా పరిగణలోకి తీసికోవాలి.

4) అన్ని రకాల అడవులపైన ప్రజల హక్కులను స్పష్టపరచాలి. అంటే గిరిజనులకు అడవి ప్రాంతాలలో నివసించే వారికి సంబంధించిన హక్కులను కూడా సవివరంగా పేర్కొనాలి.

5) ఈ చట్టంలోని సెక్షన్ 39 (డి) ప్రకారం రిజిస్టర్ చేసికొని వ్యవసాయ భూముల్లో చెట్లను పెంచినట్లయితే ఆ భూమికి భూగరిష్ట పరిమితి చట్టం నుంచి మినహాయింపు లభిస్తుంది. దీనివల్ల బడా భూస్వాములు భూపరిమితి చట్టం పరిధి నుండి తప్పించుకొనే అవకాశం వుంది. నిరుపేదలకు ప్రయోజనం చేకూర్చే భూపరిమితి చట్టం నీరుగారే ప్రమాదం వున్నందున ఈ క్లాజును తొలగించాలి.

6) గిరిజన ప్రాంతాల్లోకి గిరిజనేతరులు చొరబడే ప్రమాదం వున్నందున చెట్ల పెంపకం దారుల పథకం (Tree Grower's Scheme) నుంచి షెడ్యూల్డు ప్రాంతములకు మినహాయించాలి.

7) మారక, పోడు వ్యవసాయాన్ని చట్టం నిషేదిస్తున్నందు వలన ఇంత కాలం ఈ పద్ధతులపై ఆదారపడి జీవిస్తున్న గిరిజనులకు వ్యవసాయ యోగ్యమైన భూమిని ప్రత్యామ్నాయ ఏర్పాట్లను అన్ని రకాల వసతులను సమకూర్చాలి.

8) రిజర్వు ఫారెస్టు భూములను గ్రామీణ అడవులు బదలాయించడాన్ని కొత్త చట్టం ఆశ్రయానికి గొడ్డలి పెట్టు. 1927 చట్టం గ్రామీణ అడవుల పెంపకానికి విశేష ప్రాదాన్యతనిచ్చింది. ప్రజల అవసరాలకు ఉపయోగపడే గ్రామీణ అడవుల విషయంలో పాత నిబంధనలను కొనసాగించాలి.

9) ప్రస్తుతం ఉన్న అడవి గ్రామాలను, నివాసాలకు, ఇతర అవసరాలకు ఆదివాసులు వినియోగించుకుంటున్న భూములను సాముదాయక భూమిగా పరిగణించి అన్ని సౌకర్యాలు కల్పించి గిరిజనులకే బదిలీ చేయాలి. అదే విధంగా ఆదివాసులకు అడవికి మధ్యనున్న సాంప్రదాయ హక్కులను కాలరాయకూడదు.

10) బంజరు భూములు, రిజర్వు అడవులు, రక్షిత అడవులలోని బీడు భూములను అభివృద్ధి పరచాలి. ఇది అడవుల పెంపకానికి సంబంధించిన కార్యాచరణ పథకంలోని బాగంగానే జరగాలి. దీనిని ముసాయిదా బిల్లులో ఒక అంశంగా పొందుపరచాలి.

గిరిజన ప్రాంతాలలోని సామాజిక ఆర్థిక వికాస సంధి దశకు విశాల దృక్పథంతో అర్థం చేసికొని పైన పేర్కొన్న డిమాండ్లను పరిగణలోకి తీసికోనట్లయితే ఈ బిల్లు కూడా మరో ప్రజా వ్యతిరేక బిల్లుగా మిగిలిపోక తప్పదని తెలుస్తుంది. *

# గిరిజనాభివృద్ధి విధానం

- బి. ఎన్. సహాయ్

*(స్వతంత్రం వచ్చిన నాటి నుంచి గిరిజన సంక్షేమానికి నిరంతర కృషి కొనసాగుతోంది. కాని వ్యయ ప్రయాసలకు తగిన ఫలితం లభించ లేదు. గిరిజన పథకాలు విజయవంతం కావాలంటే వారి సమస్యలపై పండిట్ నెహ్రూ విధానమే వాటికి పునాది కావాలని బి.యన్. సహాయ్ అభిప్రాయం)*

శతాబ్దాలుగా గిరిజనులు మిగిలిన వారికీ దూరంగా తమ సంప్రదాయాల కనుగుణంగా జీవనం సాగిస్తూ వచ్చారు. వారు వుండే ప్రాంతాలలో జనసాంద్రత తక్కువ. పైగా శతాబ్దాల ఏకాంత జీవనంలో రూపుదిద్దుకున్న తమదైన స్వంత శాంతి భద్రతల వ్యవస్థ వారికుంది. స్వాతంత్ర్యానికి పూర్వం ఏకాంతవాసం వల్ల వారికి కలిగిన సమస్యల పరిష్కారానికి స్థానికంగాను, వ్యక్తిగత స్థాయిలోనే ప్రయత్నాలు సాగాయి.

ప్రధాన జీవన స్రవంతి నుండి గిరిజనులను విడిగా వుంచే విధానాన్నే బ్రిటిష్ వారు ఎంచుకున్నారు. ప్రధానంగా ఆ ప్రాంతాలలో శాంతిభద్రతలు పటిష్టమైన పాలనల కోసం వారు అలా చేశారే కాని, వారి ప్రగతి గురించి పెద్దగా పట్టించుకోలేదు. గిరిజనేతర జమీందార్లపై ఆవేశపరులైన పహారియాల తిరుగుబాటు ఫలితంగా రాజమహల్ కొండలలో (బీహార్, పశ్చిమ బెంగాలులలో) పరోక్ష పాలనా విధానం అమలులోనికి వచ్చింది. మొదట్లో బల ప్రయోగంతో వారిని అణచివేసిన నాటి కలెక్టర్ అగస్టన్ క్లీవ్‌లాండ్ ఈ కొత్త విధానాన్ని అవలంబించి లౌక్యంగా వ్యవహరిస్తూ వారి గ్రామ ప్రాంత నాయకులను అదుపు చేయగలిగాడు. వారికి భృతి (Pension) ఇచ్చి రెవెన్యూ వసూళ్ళపని అప్పగించాడు. పాలన న్యాయసంబంధమైన కొన్ని అధికారాలను కూడా ఇచ్చారు. ఇదే విధానాన్ని దేశ ఇతర ప్రాంతాలలోనూ అవలంభించారు. ఈ విధానం ప్రధాన లక్ష్యం గిరిజనులు సమస్యలు సృష్టించినంతకాలం వారి మానాన వారిని బతకనియ్యడం, బయటి జోక్యం లేకుండా యథాతథ పరిస్థితి కొనసాగించడమే.

కాని గిరిజనుల వెనుకబడిన తనం తెలిసున్న జాతీయ నాయకులు మాత్రం వారి సంక్షేమానికి చర్యలు చేపట్టాలనే ఆతృత కనబరిచారు. భారత ప్రభుత్వ చట్టం 1935 లో నిబంధనల మేరకు 1937లో బీహారు, మద్రాసు, ఒరిస్సా, బొంబాయిలలో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. అవి గిరిజనుల స్థితిగతులను కనుగొనేందుకు కమిటీలను నియమించాయి. కాని దేశ పాలకుల విధానం, రెండవ ప్రపంచ యుద్ధం వల్ల ప్రాదమ్యాలలో మార్పు కాంగ్రెసు ప్రభుత్వాల రాజీనామాలు వంటి కారణాల వల్ల కమిటీల వల్ల తృప్తికరమైన ఫలితం లభించలేదు.

స్వాతంత్ర్య పూర్వం వ్యక్తులు, సంస్థలు సాగించిన కృషిలో పేర్కొనదగినవి కొన్ని వున్నాయి.

1) ఆరోగ్యం, విద్య ఈ రెండు అంశాలపై ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ క్రైస్తవ మిషనరీలు గిరిజనుల అభివృద్ధి సంక్షేమాలకోసం ఎంతో సేవచేశారు. ఈ కృషి దేశమంతటా జరిగినా అస్సాం, బీహారు, మధ్య ప్రదేశ్ లలో వారెంతో ప్రగతి సాధించారు. మానవతా వాదంతో సాగించిన సేవలో వారి దీక్ష సాటిలేనిది అయితే వారు గిరిజనులకు క్రైస్తవ మతంలోకి ఆకర్షించే ప్రయత్నం చేశారు. 2) గిరిజన సంక్షేమానికి తగిన ప్రాధాన్యత నిచ్చిన మహాత్మాగాంధీ తన నిర్మాణాత్మక కార్యక్రమంలో దానినొక అంశంగా పేర్కొన్నారు. 3) ఇండియన్ సొసైటీకి చెందిన ప్రముఖ సంఘ సేవకుడు ఎ.వి. ఠక్కర్ మరికొందరు గిరిజన ప్రాంతాలలో మార్గదర్శకమైన కృషి చేశారు. 4) ఎఫ్. సి. రాయ్ అనే న్యాయవాది గిరిజనుల హక్కుల సంక్షేమానికి తోడ్పడ్డారు. బీహారులోని గిరిజనుల గురించి ప్రత్యేకించి వారి ఆచారాలు, సంప్రదాయాల గురించి, వాటి ప్రాముఖ్యత గురించి ఆయన ఎన్నో పరిశోధనా వ్యాసాలు రాశారు. 5) తొలుత మిషనరీగా వుండి మానవ శాస్త్రంలో నిపుణుడైన వి. ఎల్విన్, మరికొందరు నిపుణులు గిరిజన జీవనంలో పలుపార్శ్వాలపై వెలుగు ప్రసరింపచేశారు. 1931-35 మధ్య కాలంతో ఎల్విన్ మధ్యప్రదేశ్‌లోని పలు తెగల వారి నడుమ పనిచేస్తూ సంక్షేమ కార్యక్రమాలతోబాటు పరిశోధన కూడా చేపట్టారు. మధ్య ప్రదేశ్‌లోని కరంబియా, ఫాన్‌వచ్చాపూర్, పతంఘర్‌లలో ఆయన ఎన్నో పునరావాసవసతి వాడలు ఏర్పాటు చేశారు. ఆయన చేపట్టిన సంక్షేమ కార్యక్రమాలలో గద్దు వ్యాధుల చికిత్స, విద్య, వ్యవసాయం కార్యక్రమాలు, కోళ్ళ పెంపకం మొదలైనవి వున్నాయి. తెగల జాతి సంబంధమైన (Ethnographic) అంశాల గురించి కూడా ఆయన అధ్యయనం చేశారు. వివిద తెగల జీవనం సంస్కృతులతో సుదీర్ఘ సాన్నిహిత్యం విశేషానుభవంతో ఎల్విన్ తెగల స్వీయ ప్రతిభా పాటవాల కనుగుణంగానే గిరిజనుల అభివృద్ధి సాధ్యమనే దృఢ నిశ్చయానికి వచ్చారు. కాని దీనిపై పలువురు సంఘ సేవకులు, రాజకీయ నాయకులు విమర్శలు చేశారు. వారిలో గిరిజనులను భారత జీవన స్రవంతిలోనికి సంపూర్ణంగా కలిపి వెయ్యాలని వాదించిన సామాజిక శాస్త్రజ్ఞుడు ముర్వే ఒకరు. అయితే ఒక తీరు తెన్నూ లేనివిధంగా ఆసంస్కృతిక సంపర్కం కల్గించడం వల్ల అవాంఛనీయ పరిణామాలు ఏర్పడవచ్చుననే వారు పరిగణించలేదు. గిరిజన సంస్కృతిలో ప్రయోజనకరం తృప్తిదాయకమైన ఎన్నో అంశాలు వున్నాయని వాటిని పరిరక్షించాలనే అంశాన్ని వారు విస్మరించారు. కాబట్టే ఎల్విన్, ఇతర మానవ శాస్త్రజ్ఞులు ప్రగతి విరోధులు, వేర్పాటు వాదులు, చాందసులుగా పేరుబడ్డారు.

స్వతంత్రం వచ్చాక ఎల్విన్ విధానానికి గుర్తింపు లభించినట్లు గమనించవచ్చు. గిరిజనుల సంక్షేమానికి ప్రాథమిక అంశాలను ఏకరువు పెడుతున్నపుడు నెహ్రూ ఆ విధానాన్ని సమర్థించారు. క్రమంగా ఈ విధానంలో నియంత్రిత, ప్రణాళికాబద్ధ పరిమిత పద్ధతిలో గిరిజనులను సామాజిక జీవనంతో విలీనం చేయడం ముఖ్యమని గుర్తించారు. ఆ ప్రకారమే ప్రయోజనకరమైన సంప్రదాయిక వ్యవస్థలు, ఆచారాలు, పద్ధతులను కాపాడవలసిన అగత్యాన్ని, ఔచిత్యాన్ని గుర్తించారు.

## స్వాతంత్ర్యానంతరం గిరిజన సంక్షేమం

గిరిజనుల వెనుకబాటుతనం దృష్టిలో పెట్టుకొని రాజ్యాంగం, వారి ప్రయోజనాల

పరిరక్షణ, అభివృద్ధి సంక్షేమం కోసం అధికరణలు కేటాయించింది. ఫలితంగా పరిస్థితిలో గణాత్మకమైన మార్పు పొడచూపింది. ముఖ్యంగా 46, 275, 339వ అధికరణలను ఇక్కడ పేర్కొనవలసి వుంది. అధికరణం 46, "ప్రజలలో బలహీన వర్గాలు, ముఖ్యంగా షెడ్యూల్డు జాతులు, తెగల విద్య, ఆర్థిక పరమైన ప్రయోజనాలను కాపాడేందుకు ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకుని ప్రోత్సహించాలి. సామాజిక అన్యాయానికి, రకరకాల దోపిడీలకు గురవకుండా వారిని కాపాడాలి" అని పేర్కొంటుంది. అధికరణం 275, షెడ్యూల్డు తెగలసంక్షేమం కోసం చర్యలు తీసుకుని, వారికి మెరుగైన పరిపాలన అందించేందుకు కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలకు ప్రత్యేక నిధులు సమకూర్చాలని (గ్రాంటుగా) చెబుతుంది. అధికరణం 339 రాజ్యాంగం అమలులోనికి వచ్చిన పదేళ్ళకు లేదా అంతకు ముందే రాష్ట్రపతి షెడ్యూల్డు ప్రాంతాల ప్రత్యేక పాలన షెడ్యూల్డు తెగలకు సంబంధించిన పాలనా విషయాల్లో కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రాలకు ఆదేశాలిచ్చే అధికారం కలిగి వుంటుందని కూడా ఈ అధికరణం చెబుతోంది.

రాజ్యాంగ రక్షణల పుణ్యమా అని ప్రభుత్వం, ప్రభుత్వేతర సంస్థలు, (భారతీయ ఆదిమజాతి గ్రామోద్యోగ సంఘం, ఆదిమజాతి సేవామండల్, రామకృష్ణమిషన్, భారత్ సేవాశ్రమ్ సంఘ్, శ్రీమంత శంకర్ మిషన్ మొదలైనవి) షె. తెగల కోసం ఎన్నో సంక్షేమ, అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాయి.

**షెడ్యూల్డు తెగల జనాభా**

1991 జనాభా లెక్కల ప్రకారం భారతదేశ షె. తెగల జనాభా 6.80 కోట్లు మొత్తం దేశ జనాభాలో ఇది 8.08 శాతం ఇతర స్థానికులతో పోలిస్తే మిజోరం (95%), అరుణాచల ప్రదేశ్ (64%)లలో అధిక సంఖ్యాకులు షె. తెగలవారే పోతే మధ్యప్రదేశ్ (23%), ఒరిస్సా (22%), గుజరాత్ (15%), మహారాష్ట్ర (9%), బీహారు (8%)రాష్ట్రాలలో మొత్తం వారి సంఖ్యాబలం పేర్కొనదగింది. మొత్తం షె. తెగల జనాభాలో 250 కిపైగా విభిన్న తెగలువున్నాయి. (రాష్ట్రాలలో మొత్తం ప్రకారం 566) వీరిలో గోండులు, బిల్లులు సంతాల్‌లు, ఒరవలు, మినాలు, ముండాలు అధిక జనాభాగల తెగలు అక్షరాస్యత మొత్తం మీద 30%, స్త్రీలలో 18%గా వుంది. తెగలలో చాలా వరకు ఇతర జాతులకన్నా భిన్నమైన సంస్కృతిని, ఆర్థిక వ్యవస్థను, మతాన్ని భాషను, సామాజిక రాజకీయ వ్యవస్థను కలిగివున్నాయి.

కాని తిరిగి ఈ తెగల్లోనే ఈ అంచనాలకు సంబంధించి ఎన్నో ప్రాంతీయ భేదాలు కానవస్తాయి. దీనిని బట్టి చూస్తే కొన్ని ప్రాంతాలలో సాంద్రతను మినహాయిస్తే వీరి జనాభా దేశంలో వివిధ ప్రాంతాలలో చెల్లాచెదురుగా నివసిస్తూ అనేక భాషలు, మతాలలో వివిధ ఆర్థిక, సామాజిక, సాంఘికాభివృద్ధి స్థాయిలు కలిగి వున్నారని తెలుస్తుంది. అధిక సంఖ్యాకులు

దుర్గమ కొండ ప్రాంతాలలో, అడవుల్లో కనిష్ట సాంకేతిక అభివృద్ధి స్థాయితోనే జీవిస్తున్నారు.

గిరిజనులు ఆర్థికంగా వెనుకబడిన వారు దారిద్రంతో, అర్ధాకలితో అర్ధనగ్నంగా, నిరక్షరాస్యులుగా, సంక్లిష్టమైన సమస్యల వలయంలో చిక్కుకుని వున్నారు. ప్రభుత్వాలు వారి అభివృద్ధి కోసం ప్రత్యేక శ్రద్ధతో క్రియాశీలకమైన చర్యలు చేపట్టి వారిని భారత ప్రధాన జీవన స్రవంతిలో విలీనం చేసేందుకు కృషి చేస్తున్నారు.

స్వాతంత్ర్యానంతరం వారి అభివృద్ధి సంక్షేమాలకు పెద్దపీట వేసి ప్రణాళికాబద్ధంగా తీవ్రమైన కృషి ఆరంభమైంది. వరుసగా ఎనిమిది పంచవర్ష ప్రణాళికల్లోను ఇందుకోసం భారీగా నిధులు సమకూర్చారు. రెండవ ప్రణాళిక 43 ప్రత్యేక బహుళ ప్రయోజన గిరిజన బ్లాకు (SMPTB) లను నెలకొల్పింది. మూడవ ప్రణాళిక మరిన్ని నిధులు, వ్యవస్థీకృత విధానంతో గిరిజనాభి వృద్ధి బ్లాకుల (TD) ద్వారా అభివృద్ధి విధానాన్ని ఖరారు చేసింది. ఐదవ ప్రణాళిక కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ వనరుల నుంచి తగినన్ని నిధులతో అమలు చేసే గిరిజన ఉపప్రణాళికల (SubPlan) విధానాన్ని రూపొందించింది. సమీకృత గిరిజనాభివృద్ధి పథకాల (ITDP) ద్వారా ప్రణాళికల అమలులో కావలసిన వెసులు బాటును సమకూర్చారు. ఆరు, ఏడు, ఎనిమిదవ ప్రణాళికలు ఉపప్రణాళికల విధానాన్నే ఖరారు చేస్తూ పురాతన గిరిజన సమూహాల (Primitive Tribal Groups-PTC) అభివృద్ధికి కూడా ఎన్నో చర్యలు చేపట్టాయి. కాని ఈ ఎనిమిది పంచవర్ష ప్రణాళికల్లోను ఎంత తీవ్రంగా కృషి చేసినప్పటికి గిరిజనాభివృద్ధి కోసం చేపట్టిన చర్యలు వాటి వ్యయ ప్రయాసలకు తగిన ఫలితాలను అందించలేదు.

**సమస్యల వైవిధ్యత**

ముందుగానే చెప్పినట్లు ఆర్థిక, సామాజిక అభివృద్ధి స్థాయిల్లో అంతరం వల్ల వివిధ తెగల షెడ్యూల్డు ప్రాంతాల సమస్యలు వేరువేరుగా వుంటాయి. ఇంకా ఆహార సమీకరణ, వేటాడే దశలో (పిజిటి) వున్న తెగల సమస్యలు పోడు వ్యవసాయం చేసే తెగల సమస్యలకన్నా భిన్నమైనవి. పోడు వ్యవసాయం చేసే తెగల సమస్యలకు వ్యవసాయంలో స్థిరపడ్డవారి సమస్యలకు తేడా వుంటుంది. కాబట్టి వివిధ తెగల సమస్యలు వారి నేపథ్యాన్ననుసరించి వాటి పరిష్కారంలోను విభిన్నమైన ప్రణాళికలు అవసరమవుతాయి. ఆ అవగాహనతోనే అప్పటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిపాదించిన ఐదు ప్రాథమిక సూత్రాలు గిరిజన విధానానికి పునాదిగా నిలుస్తాయి. అవి:

1) ఏ ప్రజలైనా తమ సహజ వాతావరణంలో అభివృద్ధి చెందాలే తప్ప వారిపై బయట నుంచి ఏది రుద్దకూడదు. వారి వారి సాంప్రదాయిక కళలు సంస్కృతుల వికాసానికి మనం అన్ని విధాలా తోడ్పడాలి. 2) భూములు అడవులకు సంబంధించిన గిరిజనుల హక్కులను

గౌరవించాలి. 3) పాలన, అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు వారిలో నుంచే కొందరికి శిక్షణ నివ్వాలి. మొదట్లో బయట నుంచి వచ్చిన సాంకేతిక నిపుణుల అవసరం తప్పక వుంటుంది. కాని బయట వ్యక్తులు గిరిజన ప్రాంతాలకు రావడం అతి తక్కువగా వుండాలి. 4) అవసరానికి మించిన పథకాలు, పాలనావ్యవహారాలతో వారిని ఉక్కిరిబిక్కిరి చెయ్యకూడదు. వారి వారి సామాజిక, సాంస్కృతిక వ్యవస్థల ద్వారానేగాని వాటికి విరుద్ధంగా పనిచేయకూడదు. 5) గణాంకాలు, ఖర్చయిన మొత్తాలను బట్టిగాక, వ్యక్తుల జీవనంలో వ్యవహారాలతో అవి తెచ్చిన అభివృద్ధిని బట్టి ఫలితాలను బేరీజు వెయ్యాలి.

## గిరిజనుల జీవనం, సంస్కృతులు

పైన పేర్కొన్న దానిని బట్టి అవలంబించే గిరిజనుల అభివృద్ధి విధానం వెనుక వారి జీవనం, సంస్కృతుల పట్ల చక్కని అవగాహన వుండి తీరాలి. ఈ సందర్భంగా గుర్తుంచుకోవాల్సిన అంశాలు.

1) గిరిజనుల సర్వతోముఖాభివృద్ధిని కాంక్షించే గిరిజనాభివృద్ధి కార్యక్రమం ఒక ప్రణాళిక ప్రకారం గిరిజనుల జీవితాలలో ఆర్థిక పరమైన మార్పు తెచ్చే ప్రక్రియ, సహజంగానే మనం ఎవరికోసం కార్యక్రమాలు చేస్తున్నామో వారి ప్రస్తుత జీవన విధానం గురించి తెలిసివుండడం అవసరం. ఇది అందుబాటులో వున్న (గిరిజనుల గురించి) సమాచారం ద్వారా తెలుసుకోవచ్చు. లేదా వారి సామాజిక, ఆర్థిక, రాజకీయ, మత సంబంధమైన విధానాలు, విలువలు, ఐహి సంస్కృతుల గురించి ఎవరికి వారు ఒక క్రమపద్ధతిలో అద్యయనం చెయ్యడం ద్వారా తెలుసుకోవచ్చు. 2) సామాజిక పరివర్తన గురించి ఆధునిక సిద్ధాంతాలు కూడా తెలుసుకొని వుండాలి. ముఖ్యంగా ఒక క్రమ పద్ధతి లేకుండా సాంస్కృతిక సంపర్కం జరిగే పరిస్థితుల వల్ల ఏర్పడే ప్రతికూల పరిస్థితుల గురించి తెలిపే సిద్ధాంతాలను సామాజిక పరివర్తనకు సంబంధించిన మూడు ప్రధాన దశల గురించి తెలిసికోవాలి. అ) నవకల్పన (Innovation) ఆ) దానికి అనుకూల లేదా ప్రతికూల స్పందన కలిగితే ఆ సృజనాత్మక ప్రయోగాన్ని సామాజిక సాంస్కృతిక జీవనంతో సమన్వయం చేయడం ఇలా చేయడం వల్ల మనం సరయిన దోవలో పురోగమిస్తున్నది లేనిదీ తెలుస్తుంది. అలాగే మూడవ దశకు చేరుకునే ధోరణి ప్రజలలో వున్నదీ లేనిదీ కూడా తెలుస్తుంది. సామాజికమైన మార్పులకన్నా ఆర్థిక మార్పులు వేగంగా సంభవిస్తాయనేది తెలిస్తే నిరాశ, నిస్పృహలకు లోనయ్యే అవసరం రాదు. అయినా ఏ నాటికైనా రెండు రకాల మార్పులు జంటగా సాగాల్సిందేననేది స్పష్టం. సామాజిక మార్పులకు కాలబద్ధ ఏదీ లేదు. మెల్లిగా జరిగే ఈ మార్పులు ఆర్థిక మార్పులకు చాలా సన్నిహితమైనవి. 4)కొత్త ఆలోచనలు ప్రవేశపెట్టేటప్పుడు తొందరపడకుండా జాగ్రత్తగా వ్యవహరిస్తే సంస్కృతి పునాదులతో సంఘర్షణ తలెత్తె ప్రమాదం తప్పుతుంది. వివిధ తెగల మధ్య సంబంధాలు వారి దృక్కోణం నుంచి వారి అవసరాలు నమ్మకాలు పద్ధతులు మొదలైనవి అర్థం చేసుకోవడం, అభివృద్ధికి సంబంధించిన కొత్త ఆలోచనలను గిరజనుల సనాతన ఆధునిక ఆలోచనా సరళి,

విలువలు అనుభవాలతో ముడిపెట్టి చూడడం ద్వారా గిరిజనాభివృద్ధిలో ఫలితాలు మరింత విజయవంతంగా రాబట్టడం సాధ్యమవుతుంది. 5) సమాజం ఎన్నో అంశాల సమగ్ర స్వరూపం అనేది గుర్తుంచుకోవాలి. ఎందుకంటే ఒక ఆలోచన ఎన్నో ఇతర రంగాలు/ జీవితంలోని అంశాలపై ప్రభావం చూపుతుంది. కనుకనే సామాజిక ఆర్థిక సంబంధాలపై కొత్త ఆలోచనల ప్రభావం ఎలా వుండగలదనేది ఆలోచించుకోవాలి. ఇది ఆరోగ్యకరమైంది కాదని తోస్తే వాటిలో అవసరమైన సర్దుబాట్లు చేయనిదే కొత్త ఆలోచనలు ప్రవేశపెట్టడం మంచిది కాదు. 6) సంస్కృతికి సంబంధించిన పునాదుల విషయంలో ప్రజల పరిపూర్ణ విశ్వాసం చూరగొననిదే వాటిని స్పృశించకపోవడం మంచిది. మెల్లమెల్లగా ఫలితాలను చూపుతూ అందుకు ప్రయత్నించడం మంచిది. 7) కొత్త కార్యక్రమాలను అమలుచేసే ముందు వారితో (గిరిజనులు) స్నేహం పెంచుకోవడం ఉత్తమ విధానం (పెద్దన్నగారి మాదిరిగా ప్రవర్తించడం కాదు) ఏ సమాజం నడుమున వుంటూ వారికి సేవ చేస్తున్నామో వారిలో ఒకరుగా ఎంతో సహజంగా కలిసిపోవడం వల్ల వారికి ఆ సమాజం ఆదరణ లభిస్తుంది. 8) సామాజిక మార్పులు మెల్లగా జరుగుతాయనేది మరచిపోకూడదు. మూడు తరాలు పట్టే ప్రక్రియలో అతి తక్కువ సమయంలో ఎంతో సాధించామనుకోవడం అత్యాశే అవుతుంది. ఇదేమీ ఇంద్రజాలం కాదు. సమయం పడుతుంది. వేచి వుండడంలోనే వివేకం వుంటుంది అదే సమయంలో ప్రజలను వారి స్వంత ఆలోచన, శక్తులకు అనుగుణంగా అభివృద్ధి చేసేందుకు శ్రమించాలి. 9) సామాజిక మానవశాస్త్రం (Social Anthropology) దానిపద్ధతులు తెలిసి ఎలాగో సూచిస్తుంది. 10) గిరిజనాభివృద్ధి కార్యక్రమాలకు తోడ్పడే లేదా అడ్డుపడే సామాజిక సాంస్కృతిక అంశాలేవిటనేది ఆ రంగంలోని నిపుణులు అప్పుడప్పుడు చర్చిస్తూ వచ్చారు. ఈ అంశాలను సక్రమంగా అధ్యయనం చేసి విశ్లేషించి, గిరిజనాభివృద్ధి కార్యక్రమాలలో వినియోగించుకోలేకపోతే పాక్షికంగానే విజయం సిద్ధిస్తుంది. శాస్త్రీయమైన అవగాహనలను హేతుబద్ధంగా వినియోగించుకుంటే విజయానికి అవకాశాలు ఎక్కువ.

ఈ చర్చ సారాంశం సూచించేదేమంటే అధికారులు అనధికారులకు గ్రామాల్లో (నాయకులతో సహా) గిరిజనుల జీవన సంస్కృతుల గురించి తక్షణం శిక్షణ అవసరం గిరిజన సంక్షేమం అభివృద్ధి కృషిలో పెరుగుతున్న శిక్షణావసరాలను తీర్చేందుకు జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థ (ఎన్ ఐ ఆర్ డి) రాష్ట్ర గ్రామీణాభివృద్ధి సంస్థ (ఎస్ ఐ ఆర్ డి) గిరిజన పరిశోధన సంస్థ (టి ఆర్ ఐలు)ను తగినవిధంగా పటిష్టంచేయాలి. అంతకన్నా ముందు ఈ రంగంలోని నిపుణులు శిక్షణావసరాలను గుర్తించ వలసి వుంటుంది.

అన్నింటిని మించి గిరిజనాభివృద్ధికి నెహ్రూ సూచించిన ఐదు ప్రాథమిక సూత్రాలను మరోసారి నెమరేసుకుని పునస్సమీక్షించు కోవడం అమలు చెయ్యడం అత్యవసరం. నెహ్రూ సూచన మరోసారి గుర్తు చేసుకుందాం. ప్రణాళికలు వెయ్యడం వాటిని నిర్దేశించడం వ్యవస్థీకృతం చెయ్యడం సమన్వయ పరచడం అవసరమేకాని దిగువస్థాయి నుంచి అభివృద్ధి ప్రయత్నంగా సహజ సిద్ధంగా జరిగే పరిస్థితులు కల్పించడం మరింత అవసరం.

★

# ఆంధ్రలో దళిత జానపద నృత్యరీతులు

మాదివపెద్ది విజయలక్ష్మి

నృత్య కళ కొన్ని ప్రత్యేక తెగల వారిచే అభ్యసింపబడి, పాండితీప్రకర్షకు అనువైన కళగారూపొంది, ప్రతిభావంతులచే ప్రదర్శింపబడుటచే ఈ తరగతులకు చెందిన స్త్రీలు, పురుషులు తాము గూడ పండుగ పబ్బములందు అందరూ ఒక చోట జేరినపుడు వినోదముగా ప్రొద్దు బుచ్చుటకు కొన్ని నృత్యమలను నేర్పరచుకొనిరి. అవియే జానపద నృత్యములు. ఈ నృత్యములు ఎక్కువ కష్టముగా నుండక ప్రత్యేకముగా సాధన చేయనవసరము లేకుండనే అందరూ పాల్గొనుటకు వీలైన బహు సులభరీతిలో నుండును.

**తప్పెట గుండ్లు :-** గుండ్రముగా డబ్బారేకులతో చేయబడిన చిన్న చిన్న తప్పెటలను మెడలందు ధరించి, పాడుతూ, ఆ పాటననుసరించి తప్పెటలపై తాళ, లయగతుల ప్రదర్శించుచూ వలయాకారముగా తిరుగుచూ నృత్యమాడుదురు. పురుషులు మాత్రమే ఈ నృత్యమందు పాల్గొందురు. వీరు విశాఖ జిల్లాయందెక్కువగ నున్నారు.

**జోగాట :-** తెలంగాణా ప్రాంతంలో హరిజనుల తెగకు చెందిన వారిలో జోగు వారను నొక నర్తకుల శాఖ వారున్నారు. వారు డప్పుల వాద్యము నాధారముగా నృత్యమాడుదురు. ఈ జాతి వారిలో ఎవరైనా చనిపోయినప్పుడు శవమును స్మశాన వాటికకు గొనిపోవునప్పుడు జోగాట ఆడుచూ వెళ్ళుదురు.

**వీరనాట్యము :-** ఆంధ్రలో వీరశైవము వేరివిగా ప్రచారములో నున్నప్పుడు ఆలయములందు దేవదాసీల నృత్యారాధనయే గాక, శివభక్తులు తాండవ పద్ధతిని చెందిన వీరావేశము గల్గించునట్టి నాట్యములను జేసెడివారు. వీరు వీరరస ప్రధానమగు పాటలు 'ఖడ్గములు' పాడుతూ, నొక చేత ఖడ్గమును, ఇంకొక చేత డాలును ధరించి నృత్యమాడుదురు. దీనికి 'వీరనాట్య'మని పేరు.

**వీరుల కొలువు :-** పల్నాటి యుద్ధమందు పాల్గొని వీరస్వర్గము అలంకరించిన ఆంధ్రవీరుల సంస్మరణార్థము చేయబడే వీరుల కొలువునందు ప్రదర్శించునట్టి అరాధన నృత్యములు కూడా తాండవ పద్ధతికి జెందినట్టివే. కారంపూడి, మాచెర్ల, గురజాలలలో ఏటేటా ఇవి జరుగును.

**సేవ :-** ఇత్తడి రేకులతో వేసిన పెద్దపెద్ద తాళములను చేత ధరించి సింహాచల నృసింహస్వామిని కీర్తించుచూ, నెమలి కుంచెను చేతబట్టిన నాయకుడు 'నాయం' చెప్పుచుండగా అందరునూ కలసిపాడుచూ వలయాకారముగ తిరుగుచూ నృత్యము చేయుదురు.

**పాండవుల వారు: -** హైదరాబాద్ ప్రాంతములందు పాండవులు అనునొక తెగవారున్నారు. వీరి స్త్రీలు పచ్చబొట్లు పొడిచి ధనార్జన చేయుదురు. పురుషులు పాండురాజుకథను మాత్రం

గానం చేయుదురు.

**చిన్న మాదిగలు** :- వీరు పగటి వేళ భాగవతము గట్టుదురు. పంచములకు వినోదము [illegible].

***విప్రవినోదులు*** :- యక్షిణీ విద్యలను సాధించి తద్వారా ప్రజలకు వినోదము కల్గించి ద్రవ్యార్జన చేయునట్టి వారే విప్రవినోదులు, సాధనాశూరులు.

***గంటి భాగవతులు*** :- ఇతర భాగవతుల వలే వీరును భాగవతము నాడుదురు. గాని నర్తన సమయంలో ప్రతి ఒక్కరూ ఒక గరిటితో నూనె దీపం పెట్టుకొని చేతితో పట్టుకొని వత్తురు. వారు అభినయం ప్రదర్శించ వలసిన సమయంలో ఆ దీపం ముఖం వద్దకు తెచ్చి అభినయం ప్రదర్శింతురు.

***జంగం కథ*** :- పిచ్చుక మాట్లవారి కథాగానము. ఈ రెండు ఇంచుమించు ఒకటిగానే వుండును. తెగలు మాత్రం వేరు. వీరు కామమ్మ కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, ధర్మాంగద కథ, యిత్యాధియెన్నో గాథలను గానము చేయుదురు. వీరు ఎక్కువగా చదువుకున్నవారు గాకపోయిననూ, అ కథాగానమయు చేయునపుడు వివిధ రసముల నొప్పించుతీరు అత్యద్భుతము.

***జముకుల కథ*** :- కుంచెము ఆకారము కలిగి, అడుగుభాగము తోలుతో కప్పబడి లోపలి భాగమున దాని మధ్య నుండి ఒక నరమును బిగించి దాని చివరను ఒక కఱ్ఱ ముక్కను ముడివైచి, ఆ కఱ్ఱముక్కను ఒక చేతితో బిగించి పట్టుకొని శ్రుతి బద్ధముగా దానిని లాగుచూ, రెండవ చేతితో ఆ నరముపై తాళగతులను పలికించుచూ, వీరగాధలను పాడుచూ, కాలిమువ్వలను ముచ్చటగా కదిలించుచూ నవరసంబు లొలుకునట్లు నాట్యమాడు వారే జముకుల కథకులు, అట్టివారు వాయించెడి వాద్యమునకే 'జముకు'లని పేరు.

***కోలాట కోపులు*** :- కోలాటము వేయునపుడు అందు వివిధ రకములైన గతులకు చెందిన పాటలు పాడుతూ, ఆ పాటలకు తగిన విధముగా నృత్యమాడుటకు 'కోపు' అని పేరు. కోలాటము స్త్రీలు, పురుషులు గూడ వేయుదురు. ఈ విద్యయందు నిపుణులైనవారు కరీంనగర్ జిల్లాలో నున్నారు.

***కళయే జీవితమైన కోయలు*** :- ఇరువది మంది ఇరువది మద్దెలలు తీసికొని ఒక్కసారిగా తుపానులో మేఘ గర్జనులవలె పలికించెదరు. అందరిలోను ఏదో ఉద్రేకము, ఆవేశము పుట్టును. శరీరము కదిలించుచు, మద్దెలను మ్రోగించుచు, నృత్యము చేయుచు వెనుకకు వెళ్ళి, అతి తొందరగా అడుగులు వేయుచు, తలలను దగ్గరగా జేరి, కొమ్ములతో పాడుచుకొనునట్లు అభినయించుచు, గిరగిర తిరుగుచు తాళము తప్పక నృత్యము చేయుదురు. ఇది 'రామన్న , లక్ష్మన్న, మేము కోయదొరలమండీ, కోయరాజులం' అని మనతెలుగు జిల్లాలకు వచ్చెడి కోయరాజుల వృషభ నృత్యము. భద్రాచలం దగ్గర అడవులలో నివసించే కోయలు చేయుదురు.

నేటి ఆధునిక నృత్యరీతులకు ఆధారము ఈ జానపద నృత్యాలు, ముఖ్యంగా ఈ జానపదాలు గ్రామ ప్రాంతాలలో బహు ప్రాచుర్యం పొందినవి. ★

# పర్యావరణ పరిరక్షణలో గిరిజనుల భాగస్వామ్యం

డా॥ యం. విజయ కోటేశ్వరి

రాష్ట్ర జనాభాలో గిరిజనులు సుమారు 6 శాతం వున్నారు. శ్రీకాకుళం, విశాఖ పట్నం, తూర్పుగోదావరి, అదిలాబాద్‌లలో ఎక్కువగాను ఇంచుమించు అన్ని జిల్లాల్లోను ఉన్నారు. మారు మూల కొండలు, అడవుల మధ్యన అధికంగా వీరి జీవన విధానం కొనసాగుతున్నది. ఎక్కువగా వారు అటవీ ఉత్పత్తుల మీద, జంతువుల వేట మీద, పోడు వ్యవసాయం మీద ఆధారపడి వున్నారు.

గిరిజనులకి అడవులకీ మధ్యగల సంబంధం విడదీయలేనిది. తరతరాలుగా అడవులపై గిరిజనులు వారసత్వపు హక్కు అనుభవిస్తూ వస్తున్నారు.

మనకు అడవులు ఉండవలసినంత విస్తీర్ణంలో లేవు. మానవాళి మనుగడకు అడవులే జీవనాధారము, రోజు రోజుకూ ఎరుగుతున్న జనాభాకు సరిపడినంత ఆహారం ఉత్పత్తి చేయటానికి అడవులను నరికి వ్యవసాయ భూములుగా మార్చుతున్నారు. అలాగే నివాస స్థలాలుగా కూడా మార్చుతున్నారు. దానితో పాటే వాతావరణ కాలుష్యము పెరుగుతున్నది. దీనికి తోడు పెరుగుతున్న పరిశ్రమలు, రహదారి వాహనాలు మొదలయినవి కాలుష్యాన్ని మరింత పెంచుతున్నాయి. ప్రజాజీవన పద్ధతులు రోజు రోజుకూ మారుతున్నాయి. మారుతున్న సాంఘిక పరిస్థితుల ప్రభావం గిరిజన జీవన విధానంపై పడుతున్నది. వ్యవసాయ భూముల విస్తీర్ణం పెంచడం కోసం ఆడవులను కొట్టివేయడం జరుగుతున్నది. దీనితో వర్షాలు సకాలంలో పడక పర్యావరణ సమతూకం దెబ్బ తింటున్నది. దానితో అడవుల మీద ఆధారపడి ఉన్న గిరిజనులు వారి వారి వృత్తులను, సంప్రదాయాలను వదలి వేరే వృత్తుల మీద ఆధారపడుతున్నారు.

మొత్తం భూమి విస్తీర్ణంలో కనీసం 33% విస్తీర్ణం అడవులు ఉంటే పర్యావరణ సమతూకాన్ని నిలబెట్టవచ్చు. వృక్షాలు వాతావరణంలోని కార్బన్ డై ఆక్సైడ్‌ను గ్రహించి ఆహార పదార్థాలను స్వచ్ఛమైన ప్రాణవాయువును మనకు

అందిస్తాయి. కాలుష్య నివారణకు అడవులను పెంచడం, ప్రతి ప్రభుత్వం చేపట్టవలసిన తక్షణ కర్తవ్యం. ప్రతివారు చెట్లను పెంచడం తప్పని సరి. దానిని ప్రోత్సహించడానికి ఇప్పుడు ప్రభుత్వం అటవీశాఖద్వారా మొక్కలను ఉచితంగా పంపిణీ చేస్తున్నది.

గిరిజనుల జీవన సరళి, సంస్కృతి సంపద అడవుల మీదే ఆధారపడి ఉంది. వారికి సొంత ప్రదేశాలలోనే జీవనాధారం కల్పించవచ్చు. పర్యావరణ రక్షణలో వారు భాగస్వాములు కావచ్చు. ఎలాగంటే ప్రభుత్వం పంచుతున్న మొక్కలను వారి ద్వారా పంపిణీ చేయవచ్చు. నర్సరీలను పెంచి పోషించే బాధ్యత వారికి అప్పగించవచ్చు. అడవులను పరిరక్షించడానికి ఉమ్మడి అటవీ యాజమాన్య పథకాలను అమలు పరచవచ్చు . దానివలన వచ్చే ఫలసాయాన్ని వారు తీసుకొనేటట్లు ఏర్పాటు చేయవచ్చు.

వారి పరిస్థితులు మరింత అభివృద్ధి చేయవలసి ఉంది. పశుసంపద, గొర్రెల, మేకల పెంపకం, కోళ్ళు, తేనెటీగల పెంపకం మొదలయినవి కూడా చేపట్టవచ్చు. వాటితో ఆర్థికంగా బలపడవచ్చు. గిరిజనులు నివసిస్తున్న అటవీ ప్రాంతాలను , కొండ ప్రాంతాలను కలుపుతూ రహదారులు, ప్రయాణ సౌకర్యాలను అభివృద్ధి చేయాలి. వారి హస్తకళలను, నైపుణ్యాలను పరిరక్షించాలి. అక్షరాస్యత పెంచడానికి కృషి చేయాలి.

వీటి వల్ల వారు తృప్తిగా ఉండడమేకాక పర్యావరణ పరిరక్షణకు సహాయపడిన వారవుతారు. దానికొరకు ప్రతి ఒక్కరు కృషి చేయవలసి వుంది. అనుకున్న ప్రగతి సాధించడానికి ప్రతిఒక్కరు అంకిత భావంతో పనిచేయవలసి వుంది.

*

# దళిత సాహిత్యం

కొలిపాక ఝాన్సీ

ప్రాచీన కాలం నుండి సాహిత్యంలో రెండు విభిన్న మార్గాలు తమ మనుగడ సాగిస్తున్నాయి. అవి సాంప్రదాయ సాహిత్యం. జానపద సాహిత్యం. వీటిలో సాంప్రదాయ సాహిత్యం కంటే జానపద సాహిత్యం ఎంతో ప్రాచీనమైనది. అందువలన జానపద సాహిత్యం ముఖ్యంగా కవిత్వం యొక్క ప్రభావం తెలుగు సంప్రదాయ సాహిత్యంపై అమితంగా ప్రసరించిందని చెప్పవచ్చు, అయినా నాడు జానపద సాహిత్యం కవిపండితుల మెప్పును గానీ, రాజాదరణను కానీ పొందలేకపోయింది. జానపదులంటే శ్రమజీవులు. వారు తమ శ్రమ నివారణమార్గంగా ఆత్మానందం కలిగించే పదాలను అలవోకగా పాడుకునేవారు. దీనిని మౌఖిక సాహిత్యంగా పేర్కొనవచ్చును. వారి గీతాలలో నాటి సాంఘిక జీవన విధానం అద్దంలో చూపినట్లుగా మనకు అవగతమవుతున్నది. ఆ గీతాలలోని భావుకత, స్వచ్ఛత నేటికీ వాటిని సజీవంగా నిల్పుతున్నాయి. శ్రామికులు సృష్టించిన ఈ సాహిత్యం ఆనాడు ఆదరణకు నోచుకోలేదు. నేడు సాహితీ పరులు ఆ పదాలలోని, సాహితీ విలువలను గుర్తించారు. ఎందరో వాటిని పరిశోధనాంశంగా స్వీకరించి అందులోని విలువలను వెలుగులోనికి తెస్తున్నారు.

నాటి జానపద సాహిత్యం జన జీవన స్రవంతిలో పారంపర్యంగా కొనసాగుతూ వచ్చింది. కానీ నేటికీ సాహిత్యం దాదాపుగా అంతరించిపోయిందని చెప్పవచ్చును. కొన్ని జానపద కళారీతులు, పదాలు అవశేషాలుగా మిగిలుతున్నాయి. పాశ్చాత్య నాగరికతా ప్రభావం నగరాలకు వలస రావటం. దేశీయ కళలపై ప్రజలకు ఆసక్తి తగ్గటం. టి.వి., సినిమా, రేడియో మొ॥ అత్యాధునిక వినోద సాధనాలపై ఆసక్తి పెరగటం, కళాకారులకు భుక్తి గడవకపోవటం మొ॥ ఈ జానపద కళా స్వరూపాలు సాహిత్యం అంతరించి పోవటానికి కారణాలుగా చెప్పవచ్చు. ఆంగ్ల విద్యా ప్రభావం వలన మనదేశంలో ఎన్నో మార్పులు సంభవించాయి. ఆ మార్పులు రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలోనేకాక సాహిత్యంలో కూడా చోటుచేసుకున్నాయి. తెలుగు సాహిత్యంలో వినూత్నమైన సాహితీ రూపాలు, కవితా ఉద్యమాలు ప్రారంభమైనాయి. తెలుగు సాహిత్యంలో అభ్యుదయ కవిత్వం, భావకవిత్వం, విప్లవ కవిత్వం ఉద్భవించాయి. తదుపరి తెలుగు సాహిత్యంలో స్త్రీవాద సాహిత్యం, దళిత సాహిత్యం ఉద్భవించాయి.

ప్రాచీన తెలుగు సాహిత్యంలో శివకవుల కాలంలో దళితుల కథలున్నాయి. కానీ వారి దృష్టి దళితుల సముద్ధరణ కాదు. వారి దృష్టిలో భక్తి ప్రధానాంశం. యక్షగానాలలో దళితుల ప్రసక్తి ఉన్నది. కానీ అంత మాత్రాన అది దళిత సాహిత్యం కాదు. తెలుగు సాహిత్యంలో 1850 కంటే ముందు దళిత సాహిత్యం గురించి ఊహించలేము. తెలుగు సాహిత్యంలో మొదటగా ఈ స్పృహ కందుకూరి, ఉన్నవ, గురజాడ వారి రచనలలో కనిపిస్తున్నది. 'మనుజులందున ఎంచి చూడగ మంచి చెడ్డలు రెండేకులములు' మంచియన్నది మాల అయితే ఆ మాలనేనౌతా నని గురజాడ ఎలుగెత్తి చెప్పాడు. సమాజంలో ఆర్థికంగా, సామాజికంగా, అణగద్రొక్కబడినవారు దళితులు, అట్టి దళితులు ఆంగ్ల విద్యావిధానం వలన చదువరులై చైతన్యాన్ని పొందారు. భారత దేశానికి

స్వాతంత్ర్యం వచ్చాక భారత రాజ్యాంగం పౌరులందరికీ సమాన హక్కులను కల్పించింది. అందువలన దళితులలో సామాజికమైన చైతన్యం మరింత పెరిగింది. ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా దళితులను పైకి తేవాలనే భావనలు వ్యాప్తమైనాయి. ఈ విధంగా కలిగిన భావాలు సాహిత్యంలో ప్రతిఫలించి దళిత సాహిత్యం ప్రభవించింది.

ఈ దళిత సాహిత్యం మహారాష్ట్ర నుండి ప్రారంభమయినది. అందుకు కారణం, స్ఫూర్తి, డా॥ బి. ఆర్. అంబేద్కర్. ఆయన కలిగించిన చైతన్యం వలన రనడే, కూలే మొ॥వారు మరాఠీ భాషలో దళిత సాహిత్యానికి శ్రీకారం చుట్టారు. ఈ విధమైన సాహిత్యంలో దళిత సాహిత్యం ఒక ప్రముఖ శాఖగా రూపుదిద్దుకుంటున్నది. దళిత సాహిత్యం అంటే ఏమిటి? దళితులు వ్రాసిన సాహిత్యమా? లేక దళితుల కోసం వ్రాయబడిన సాహిత్యమా? అంటే రెండూ అని చెప్పవచ్చును. ప్రాచీన కాలంలో దళితులకు కవిత్వం చెప్పే అర్హత లేదు. రామాయణ రచయిత్రి అయిన మొల్ల కుమ్మరి కులంలో పుట్టినా అనంతమైన ప్రతిభాపాటవాలతో తెలుగు సాహిత్యంలో అఖండమైన కీర్తినార్జించింది. దళితులు లేదా దళితేతరులు దళితుల సముద్ధరణకోసం వ్రాసే సాహిత్యం ఈ ఆధునిక కాలంలోనే ప్రారంభమైనది. అట్టి కవులలో చిరస్మరణీయులు శ్రీ జాషువా. ఆయన కవిత్వం విని "భళా" అని మెచ్చిన వారే కులము పేరు వినగానే నిరసించటం ఆయనకు తీవ్రమనస్థాపం కలిగించింది. తన నిరాశా, నిస్పృహల నాయన "గబ్బిలం" అనే కావ్యంలో ప్రస్ఫుటంగా వివరించారు. దళితునిగా ఆయన పొందిన అవమానాలు, అనుభవాలను అద్దం పట్టినట్లుగా శ్రీ జాషువా ఇందులో చిత్రించారు. జాషువా వ్యక్తిత్వం. మానవతా భావన ఇందులో స్పష్టంగా అవగతమవుతున్నాయి. దళిత సాహిత్యంలో క్రమంగా పరిణామం చెంది నేటికి ఒక సాహిత్యోద్యమంగా వికాసాన్ని పొందింది.

తెలుగు సాహిత్యంలో బోయిభీమన్న, కొలకలూరి ఇనాక్, శివసాగర్, కత్తి పద్మారావు, జాన్సన్ మొ॥వారు దళిత సాహిత్యం సృష్టించి లబ్ద ప్రతిష్ఠులైనారు. అనేక కవితలు, గేయాలు, కథానికలు, దళితుల చైతన్యం కోసం రచించబడ్డాయి. ఈ దళిత సాహిత్యం వలన ఆశించే ప్రయోజనమేమిటని మనం ప్రశ్నించుకుంటే అందుకు అనేక సమాధానాలున్నాయి. అందులో మొదటిది సామాజిక స్పృహ. భారత రాజ్యాంగం దళితులకు సమాన హక్కులను గుర్తించినా నేటికీ వారు అభాగ్యులుగానే నిలిచిపోయారు. మానవతకు మాయని మచ్చలుగా పదిరికుప్పం, నీరుకొండ, చుండూరు సంఘటనలు నిలిచిపోయాయి. ఈ దళిత సాహిత్యానికి మూలం మొదటిది అస్పృశ్యత కాగా రెండవది పేదరికం. ఈ అస్పృశ్యులు అనాదిగా ఉన్నవారే. వీరివి ఊరమ్మడి బతుకులు. వీరు తరతరాలుగా దోపిడికి పీడనకు గురి అవుతున్నారే తప్ప దేనికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవు. శతాబ్దాల నుండి వారి శ్రమ శక్తికి విలువ లేకుండా పోయింది. వారు తరతరాలుగా ఏ మతంలో ఉన్నా ప్రత్యేక వర్గంగా వారిని చూస్తారని ఈ కవుల వాదన. భారతదేశ జనాభాలో నాల్గవ వంతు వీరిది. దేశ ఆర్థిక స్థితిని నిర్ణయిస్తున్న వీరు ఆర్థికంగా దుస్థితిలో ఉన్నారు. వీరు ప్రత్యేక హక్కులు కోరరు. కానీ అందరితో సమానమైన జీవన స్థితిగతులు ఈ రచయితల ఆశయం. పీడనకు అతీతంగా దళితుల జీవించాలనేదే వీరి కోరిక. తరతరాల అనైక్యతను నిరసించి, దానిని విచ్ఛిన్నం చేసే పద్ధతులను దళితకవులు తమ రచనలలో సూచించారు.

మానవ సేవే మాధవసేవ అనే సూక్తిని అక్షర బద్ధం చేసే ఈ దళిత సాహిత్యం తన ఆశయ సిద్ధిని పొందాలని ఆశించటం మనందరి కర్తవ్యం.

★

# పనీ - పాటా

సి.హెచ్. సుశీల

మానవ కోటిని, భాషను బట్టి, మతమును బట్టి, సంస్కృతిని బట్టి అనేక వర్గాలుగ విభజించడం జరుగుతుంది. శరీరం యొక్కబాహ్య లక్షణాలను ఆధారంగా చేసికొని మరియొక విభాగం చేయడం కలదు. ఈవిధంగా ఏర్పడిన విభాగానికి 'జాతి' అని పేరు. ఒకేధమైన బాహ్య లక్షణాలు గల వారందరు ఒక జాతికి చెందిన వారు. ఈ లక్షణాలలో ప్రధానమైనవి - దేహం యొక్క ఒడ్డు, పొడుగు, దేహచ్ఛాయ, కండ్లరంగు, వెంట్రుకల స్వభావము, ముక్కు యొక్క ఆకారం, తల యొక్క ఆకారం - ఇవి కొంతవరకు స్థిరత్వం కలవియై, జన్మతః ఒక తరం నుండి ఇంకొక తరానికి సంక్రమించు లక్షణాలని భావింపబడుతున్నాయి, పై లక్షణాలలో కనిపించు కొన్ని తరతమ భేదాలను బట్టి ఒక్కొక్క జాతిని ఉపజాతులుగ కూడ విభాగం చేసియున్నారు.

సంస్కృతి యొక్క పురోభివృద్ధికి వివిధ జాతుల కలయికయే ప్రధాన హేతువు.

ప్రతి దేశంలోను, ప్రతిజాతిలోను లిపి, సాహిత్యం ఏర్పడక పూర్వం 'జానపదగేయాలు' ఉండేవి. నాగరకత, సాహిత్యం అభివృద్ధి చెందిన తర్వాత ఈ జానపద గేయాలు పట్టణవాసులకి దూరమై, పల్లెల్లో నివసించే జానపదులకు, అడవుల్లో నివసించే గిరిజనులకు పరిమితమైపోయాయి. వీరు తమ శారీరక శ్రమ, కష్టం తెలియకుండా ఉండటానికి పని చేసుకునేటప్పుడు పాటలు పాడుతూ ఉంటారు. భిక్షాటనే వృత్తిగా గల కొన్ని గిరిజన తెగల్లో పాటలే ఆకర్షణ.

మౌఖిక సాహిత్యం అంటే ముఖాముఖి నేర్చుకున్న పాటలు పాడుతూ, తమ తండ్రినుండి స్వీకరించిన బిక్షాటననీ, గేయాల్ని తమ సంతతికీ ఇస్తారు. కనుకనే ఈ అపూర్వమైన పాటలు ఇంకా మిగిలి ఉన్నాయి. అయితే వీరు పనులు చెయ్యక కేవలం పాటలు పాడుతూ, భిక్షమెత్తుతూ తిరుగుతుండటం, వల్ల నిరుద్యోగాన్ని పెంచిపోషిస్తున్నారన్న అపవాదు ఉన్నా జానపద గేయాల్ని బ్రతికించిన కీర్తి వీరికే దక్కుతుంది.

ఈ జానపద గేయక భిక్షుకులెన్నో తెగల వారు కలరు. పిచ్చుకగుంటలు, శారద కాండ్రు, వీరముష్టులు, జంగములు, దాసరులు, భాగవతులు, బీరన్నల వారు. సుద్దుల గొల్లలు, గంగిరెద్దుల వారు, బాల సంతు వారు, బుడబుక్కల వారు, చిందు

మాదుగులు, సాతానులు, బోగుల వారు, బవడీలు, జక్కులవారు, వాట్కరులు, కొమ్మువారు, జక్కలివారు, బొమ్మలాటగాండ్రు మున్నగు భిక్షుకులు ఆంధ్రదేశమున నున్న జానపద గాయకులు.

వీరు సాధారణంగా దేశద్రిమ్మరులు. ఏ కొద్ది మందికో తప్ప తక్కినవారికి ఇల్లువాకిలి అన్నవి ఉండవు. వూరూరూ తిరుగుతూ పొట్ట నింపుకొనుటే వీరి ప్రధాన వృత్తి. వీరిలో మారుమనువు అనేది సర్వ సాధారణం. ఏ తగాదాలొచ్చినా కోర్టులకెక్కరు. కులపెద్దలే కుల పంచాయితిలు జరిపి పరిష్కరిస్తారు.

వీరు తలదాచుకునే ఇళ్లు, వారి సంసారం, వస్తు వాహనాలు కూడ సంచార యోగ్యముగనే ఉండును. కుండలు, చట్టులు, చిప్పలు, పాటకి ఉపకరించే వాద్యములు, స్వామి భక్తిగల ఒక కుక్క, పగలల్లా తిరగడం, సాయంత్రం పొట్టనిండిన తర్వాత పాటలు పాడుతూ చెట్లక్రిందే గాఢనిద్ర. మూఢాచారాలు, అనాగరికత వీరి అభివృద్ధికి ఆటంకాలుగా నిలిచాయి. అయితే వారికి విద్య, వాగరకత, జీవితంపట్ల అవగాహన కలిగించే ఆఫీసర్లు గానీ, ప్రజా సంఘాలుగానీ, స్వచ్ఛంద సంఘాలు గానీ, నాయకులు గానీ అరుదు. చాల కొద్దిమంది మాత్రం తమ హోదాను , సుఖాలను వదిలివేసి, గిరిజనులతో కలిసిమెలిసి ఉండి వారి పురోభివృద్ధికి పాటుపడినవారూ ఉన్నారు.

రామాయణ భారత భాగవతాలకి సంబంధించిన రకరకాల సంఘటనల్ని , పల్నాటి వీరచరిత్ర, వీర శివాజి, పాపారాయుడు వంటి చారిత్రక సంఘటనల్ని రకరకాల రాగాల్లో తాళాల్లో, పాడుతుంటారు. ముఖ్యంగా లంబాడీలు అందంగా నాట్యం చేస్తూ పాటలు పాడటం చూడముచ్చటగా ఉంటుంది. ఆడవారి గజ్జెల చప్పుడుతో, మగవారి తప్పెట్లు డప్పులు కలిసి మంచి లయాత్మకంగా ఉంటుంది.

భావం కంటే లయ ప్రధానంగా ఉంటుంది. కథ అందరికీ తెలిసిందే. కాని ఆపాడే విధానం మనసుకు హత్తుకునేలా ఉంటుంది. తెలుగు యూనివర్సిటీలో ఒకసారి ఈ జానపద గేయాల్ని ఒక గిరిజన స్త్రీ పాడగా వినడం జరిగింది. అందరం మంత్రముగ్ధులమై పోయాము.

శ్రీ బి. రామరాజుగారు, నాయని కృష్ణకుమారి, జయసలోమి, బి. వెంకటేశ్వర్లు లాంటివారు కొన్ని వేల జానపదగేయాల్ని సేకరించారు. జానపదుల ముఖస్థమై ఉన్న ఈ అమూల్యమైన జానపద సాహితీ సంపదనంతటిని ఉద్ధరించి భద్రపరచుకొనుట శ్రేయస్కరము.

*

# ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన నృత్యాలు

గొట్టిపాటి సుజాత

ఆంధ్రప్రదేశ్‌లోని పలు జిల్లాలలో గిరిజనులు విస్తరించి వున్నారు. ముఖ్యంగా అదిలాబాద్, విశాఖ, భద్రాచలం తదితర ప్రాంతాలలో అనేక గిరిజన తెగల ప్రజలు నివసిస్తున్నారు. వీరిలో కొండదొరలు, గోండులు, లంబాడాలు, తోటీలు, కోలాంలు, ప్రధాన్‌లు, నాయిక్ పోడులు ప్రధాన గిరిజనులు.

కొండదొరల 'మయూర' నృత్యం

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన నృత్యాలకు ఇతర చోట్ల నృత్యాలకు ఎంతో వైవిధ్యం వుంది. మారుతున్న రుతువులు, వ్యవసాయిక కార్యకలాపాలు, అడవుల మార్పులు, సామాజిక సంబరాలు మొదలైన వాటికి గిరిజనులు నృత్యాలతో స్వాగతం చెప్తారు. విశాఖ జిల్లాలోని కొండదొరలు చేసే 'మయూర' నృత్యం కూడా అటువంటిదే. పాట, అందుకు తగిన ఆట, వాటికి తగ్గట్టుగా సంగీతం వుండి ఎంతో కనువిందు చేస్తుంది.

'మయూర' నృత్యాన్ని పురుషులే చేస్తారు. ఈ నృత్యం వెనుక ఒక కథవుంది. కొండ దొరల తెగకు చెందిన గిరిజన స్త్రీ ప్రసవసమయంలో బిడ్డనుకని మరణించగా, అడవిలో ఒంటరిగా వున్న ఆ పసికందును ఒక నెమలి కాపాడి, పెంచి పెద్దచేసిందట. ఆ నెమలి జ్ఞాపకార్థం కొండదొరలు ఈ నృత్యాన్ని చేస్తారు.

ఈ నృత్యం చేసే పురుషులు తమ నడుముకు నెమలి ఈకలను కట్టుకుని, తలపై నెమలి ఈకలను ధరించి నెమలి మాదిరిగా కనపడేలా అలంకరించుకుంటారు. కాళ్లకు గజ్జెలు కట్టుకుంటారు. వేషధారణ, అలంకరణ, శరీర కదలికలు, అరుపులు వీటన్నింటిలో నర్తకులు నెమలిని అనుకరిస్తారు. నెమలి ఈకలతో అలంకరించిన 'వేణువు' ఒక్కటే ఈ నృత్యానికి ఏకైక సంగీత సాధనం. వేణువు సంగీతానికి లయబద్ధమైన కాళ్లగజ్జెల సవ్వడి తోడవుతుంది. పదిలేక ఇరవైమంది ఈనృత్యం చేస్తారు. దాదాపు మూడు అడుగులు పొడవుండే వెదురు వేణువులను ఇద్దరు వాయిస్తూ వుండగా, నృత్యం ప్రారంభమవుతుంది.

భూమాతను, ఆకాశ దేవుళ్లను స్తుతించటం నృత్యంలో తొలిభాగం. ఈ సమయంలో నర్తకులు వలయాకారంలో కూర్చుంటారు. తరువాత మునివేళ్లపై కూర్చుని, ఒక్కసారిగా పైకి ఎగురుతూ, నెమలివలే అరుస్తూ నృత్యం ప్రారంభిస్తారు. నర్తకులు రెండు వరుసల్లో నిలబడతారు. పాటలు పాడటంలో నైపుణ్యంగల వ్యక్తి పాటను ప్రారంభిస్తాడు. మిగిలినవారు

వంత పాడతారు. కొండదొరలు వివాహసందర్భంగా తమ నృత్యాల్లో వివాహాన్ని, వైవాహిక జీవితాన్ని, ఆఖరికి విడాకులను కూడా ప్రదర్శిస్తారు. వివాహ సంప్రదింపుల ఘట్టాన్ని ప్రదర్శించేటప్పుడు నర్తకులు రెండు బృందాలుగు విడిపోతారు. సాధారణంగా ఈ నృత్యంలో ఈ కింది దశలు వుంటాయి.

* వరుడి బృందంవారు వధువు తరపువారిని పాటద్వారా వధువు నివ్వమని అభ్యర్థిస్తారు.

*ఆ వధువు తరుపు బృందం ఈ విజ్ఞప్తిని పాట ద్వారానే తిరస్కరింస్తుంది. తమ తిరస్కరణకు వరుడు అందంగా లేడనే కారణం చెబుతుంది.

* ఇందుకు వరుడిగా నటిస్తున్న వ్యక్తి తలను బాధతో నేలకేసి కొట్టుకుంటున్నట్లు నటిస్తాడు. వధువుపై తనకున్న ప్రేమను ప్రకటిస్తాడు.

* వరుడి బాధకు సానుభూతితో స్పందించినట్లు వధువుగా వ్యవహరిస్తున్న నర్తకుడు నటిస్తూ, వరుడి పాదాలకు తాకటం ద్వారా వివాహానికి తన సమ్మతిని తెలియజేస్తాడు.

* అప్పుడు రెండు బృందాలు ఒకటై పోయి, ఆనందంతో నృత్యం చేస్తాయి. వరుడి ఇంటివద్ద పెళ్లిజరిగినట్లు అభినయిస్తూ, నృత్యం చేస్తారు.

* అత్తగారింట్లో వధువు వ్యవహరించవలసిన తీరును, ప్రవర్తనను, వివిధ ఆచారాలను బోధిస్తూ కూడా ఒక బృందం నృత్యం చేస్తుంది.

* నృత్యంలో ఆఖరి భాగం విడాకులు. ఆ స్త్రీ తన భర్తకు విడాకులు ఇచ్చేసి, వేరే వ్యక్తితో వెళ్లిపోవడాన్ని అభినయిస్తారు. ఈసమయంలో నర్తకులు ప్రతిఒక్కరు చేతిలో కర్ర పట్టుకుని, వలయాకారంలో నృత్యం చేస్తారు. ఒకడుగు ముందుకువేసి, నేలను కర్రతో కొడుతూ వలయాకారంలో తిరుగుతారు. చివరికి మాజీ భర్త పెద్దలను తోడుతీసుకుని ఆ స్త్రీ కొత్త భర్త ఇంటికి వెళ్ళి విడాకుల వ్యవహారాన్ని ముగించటంతో నృత్యం ముగుస్తుంది. ఇందుకు కొత్త భర్త కొంత మొత్తాన్ని పాత భర్తకివ్వాలి. ఒక వేళ ఆ మొత్తం ఇవ్వని పక్షంలో అతన్ని కర్రలతో కొడుతున్నట్టు అభినయిస్తారు. ప్రతి పండగకు, పెళ్లికి కొండదొరలు 'మయూర' నృత్యం చేస్తారు.

**గోండులు**

ఆంధ్రప్రదేశలోని గిరిజనుల్లో గోండులు ఒక ప్రధానమైన తెగ, వీరు ఆదిలాబాద్ జిల్లాలో కేంద్రీకృతమై వున్నారు. వీరితోపాటు కోలాంలు, ప్రధాన్‌లు, తోటీలు, నాయిక్ పోడులు, లంబాడీలు మొదలైన గిరిజన తెగలవారు కూడా ఈ జిల్లాలో ఎక్కువగానే వున్నారు. అదిలాబాద్ జిల్లాలోని మొత్తం గిరిజనుల సంఖ్య 2.73 లక్షలకు పైగానే

వుంటుంది. జిల్లా మొత్తంజనాభాలో వీరిది 16.64 శాతం. మిగిలిన ఇతర తెగలకంటే గోండులు ఈ జిల్లాలో ఎక్కువగా వున్నారు. వీరికి ఉన్నతమైన సాంస్కృతిక వారసత్వం వుంది. మొగలులు, మరాఠాలు దండెత్తక ముందు ఈ ప్రాంతంలో వీరే పాలకులు. ఇతర గిరిజనులవలె గోండులకు కూడా ఆచారాలు, పండగలు ఎక్కువ. ఏడాది పొడవునా ఏవేవో పండగలు చేస్తుంటారు. ప్రతి పండగకు, పెళ్లికి వీరి 'దండారి', 'ధింసా' అనే నృత్యాలు చేస్తారు. ఇవెంతో లయబద్ధంగాసాగుతాయి.

**'దండారి' నృత్యం :** 'దండారి' నృత్యాన్ని గోండు తెగలోని పురుషులే చేస్తారు. ఆషాఢమాసం (జూన్-జులై) లో వచ్చే పౌర్ణమిరోజున ఈ నృత్యం చేస్తారు. శుభప్రదంగా భావించే ఈ రోజున గ్రామంలోని పశువులన్నింటినీ 'రాజుల్‌పెన్' అనే అడవి దేవత గుడికి తీసుకెళతారు. గుడిముందు పసుపు పొడితో పులిబొమ్మను గీస్తారు. పులినోటివద్ద నుంచి పసుపు పొడితోనే ఒక పెద్దగీత (సుమారు 100 అడుగులు) గీస్తారు. అడవి దేవతను సంతృప్తి పరచడానికి ఒక కోడిని కాని, మేకను కాని అక్కడ బలిచ్చిన తరువాత, పశువులన్నిటినీ ఆ గీత దాటిస్తారు. దీనివల్ల, అడవి జంతువులనుంచి దేవత తమ పశువులను కాపాడుతుందని వారి నమ్మకం. ఈ తతంగం పూర్తయిన తరువాత వారంతా గ్రామానికి తిరిగివచ్చి 'అఖడిపెన్' అనే గ్రామ దేవతను పూజిస్తారు. అదే రోజు సాయంత్రం గ్రామస్తులంతా గ్రామ కూడలి వద్ద సమావేశమై సంగీత పరికరాలన్నిటినీ ఒక మంచంపై వుంచుతారు. తరువాత సంగీతపరికరాలపై ఆధిపత్యం వహించే 'అఖడిపెన్' అనే దేవతను పూజిస్తారు.

'దండారి' నృత్యం ప్రారంబించేముందు కోళ్లను బలిచ్చి, 'అఖడిపెన్' ను పూజించి, నృత్యం ప్రారంభించడానికి దేవత అనుమతి సంపాదిస్తారు. లయబద్ధంగా మోగే డప్పుల మోతకు, ఇతర సంగీత వాయిద్య పరికరాలకు అనుగుణంగా నృత్యం ప్రారంభిస్తారు. ఈ నృత్యసందర్భంగా వాడే సంగీత పరికరాలన్నిటినీ పవిత్రమైనవిగా పరిగణిస్తారు. నృత్యం తరువాత వీటిని తమ తెగ జనులందరికీ పెద్ద అయిన వ్యక్తి ఇంట్లో లేదాకమ్యూనిటీ హాలులో వుంచుతారు.

'దండారి' నర్తకులు కేవలం ఒక ముతక వస్త్రాన్ని మాత్రమే ధరించి శరీరం మొత్తం బూడిద, తెల్లసున్నం రాసుకుంటారు. తరువాత శరీరాన్ని ఎరుపు, నలుపు చుక్కలతో అలంకరించు కుంటారు. తలను పొడవాటి నెమలి ఈకలు, అద్దాలు, రంగురంగుల గాజు ముక్కలు, మేకలు, గొర్రెల కొమ్ములతో అలంకరించుకుంటారు. భుజాలకు, నడుముకు, కాళ్లకు గజ్జెలు కట్టుకుంటారు. వివిధ రకాల విత్తనాలతో చేసిన ఆభరణాలను మెడకు పెట్టుకుంటారు. ప్రతిఒక్క నర్తకుడు చేతిలో రోకలి పట్టుకుని లయబద్ధంగా సంగీతానికి అనుగుణంగా నృత్యం చేస్తాడు.

ఈనృత్యం చేస్తున్న సమయంలో వారికి అద్భుత శక్తులు వశమవుతాయని గోండుల నమ్మకం. అందువల్ల నృత్యకుల చేతిలోని రోకలితో ఎవరైనా రోగిని తాకితే చాలు, ఆవ్యక్తి కోలుకుంటాడని వారు భావిస్తారు.

దీపావళి పండగ వరకు ప్రతి పండగకు సంబరానికి వీరు 'దండారి' నృత్యం చేస్తారు. గోండులకు దీపావళి పండగ చాలా ముఖ్యమైనది. ఈ ప్రాంతంలో మొక్కజొన్న, జొన్న, సజ్జలు, మొదలైన ధాన్యాలన్నీ దీపావళికి ముందే చేతికందుతాయి. అందువల్ల దీపావళికి సమృద్ధమైన పంటలతో నిండుగా వుంటారు వీరు.

'ధింసా' నృత్యం: ఈ నృత్యాన్ని గోండు తెగలోని స్త్రీలు, పురుషులు కలిసిచేస్తారు. కొన్నిసార్లు యువకులు స్త్రీల మాదిరిగా అలంకరించుకుని నృత్యం చేస్తారు. పండగకు, పెళ్ళిళ్ళు వచ్చినప్పుడు స్త్రీలు, పురుషులు ఈ నృత్యం చేస్తారు.

పెళ్లిపందిరి ముందు పసుపు, కుంకమతో వేసిన పవిత్రమైన ముగ్గు చుట్టూ స్త్రీలు వలయాకారంలో నిలబడి ఈ నృత్యం చేస్తారు.

'పెర్యాపెన్' (ఆది దేవత) గౌరవార్థం వైశాఖ మాసం (ఏప్రిల్-మే)లో జరిగే పండుగ ముగింపురోజున పురుషులు 'కటోడా' (తెగపూజారి) ఇంటిముందు 'ధింసా' నృత్యం చేస్తారు. చైత్ర (మార్చి-ఏప్రిల్) మాసంలో 'చెంచి భీమన్న' (పంటలను కాపాడే దేవుడు) వివాహ మహోత్సవం సందర్భంగా గ్రామ పూజారి ఇంటి ముందు పురుషులు 'ధింసా' నృత్యం చేస్తారు.

ఈ విధంగా పండుగలు, పబ్బాలు, పెళ్ళిళ్లు జరిగే సమయాల్లో గోండుగ్రామాలు నూతన చైతన్యంతో వెల్లివిరుస్తాయి. ఎక్కడ ఏ మూల చూసినా వీనుల విందుగా పాటలు, సంగీతం వినపడుతుంటాయి. లయబద్ధమైన నృత్యాలు కనపడుతుంటాయి.

*

# లంభాడా గిరిజనుల వస్త్రాభరణములు

- అట్లూరి శివప్రసాద్ M.A. M.Phill,(PhD)

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యంగా తెలంగాణా జిల్లాలలో లంబాడీ గిరిజన తెగ ఎక్కువగా జీవిస్తున్నారు. వరంగల్, నల్గొండ జిల్లాలలో వీరి సంస్కృతి ఇప్పటికీ చెదిరిపోకుండావుంది. వీరి నివాసప్రాంతాలను తండాలు అని పిలుస్తారు. వీరి వస్త్రాభరణములు చూడగానే ఆకట్టుకునే విధంగా వుంటాయి. మైదానప్రాంతాల వారికంటే, మిగతా గిరిజనుల కంటే వీరి సంస్కృతి ఇంత భిన్నంగా వుండడానికి కారణమేమిటి? అసలు భారత దేశ ఉత్తర వాయువ్య ప్రాంతాలనుండి వీరు వలసరావడానికి కారణాలేమిటి అనే విషయాలు వారికి ఆశ్రితులుగా హక్కుదారులుగా జీవించే భాట్‌లు, దాడీలు శ్రావ్యంగా కథాగానం చేస్తారు. నల్గొండ జిల్లా దేవరకొండ మండలంలోను, వరంగల్ జిల్లా జనగామ మండలంలోనూ విషయ సేకరణ జరుపగా క్రింది విధంగా తెలియ జేసారు.

“మహ్మద్ ఘోరీ అనే ముస్లిం దండ యాత్రికుడు క్రీ.శ. 1191లో రాజపుత్ర రాజైన పృద్వీరాజుపై దండెత్తినాడు. పృద్వీరాజు సువిశాలమైన ఢిల్లీ, అజ్మీర్ రాజ్యాల పరిపాలకుడు. మొదటిసారి తరైన్ అనే ప్రాంతంలో జరిగిన యుద్ధంలో పృద్వీరాజు సోదరుడు మహ్మద్ ఘోరీతో తలపడినాడు ఈ యుద్ధంలో రెండు లక్షల మంది రాజపుత్ర వీరులు మూడు వేల గజబలం పాల్గొన్నాయని ఆనాటి ముస్లిం చరిత్రకారుడు “ఫెరిస్టా” పేర్కొన్నాడు. మహ్మద్ ఘోరీ పృద్వీరాజు సోదరుడైన గోవిందరాయ్ మూతిమీద గాయపరిచి దంతాలు పెరికి వేయగా, వెంటనే గోవిందరాయ్ బలంగా తిరుగుదాడి చేసి మహ్మద్ ఘోరీ కుడిచేయికి లోతైన గాయం చేసాడు. మహ్మద్ ఘోరీ తన అశ్వంమీద నుండి క్రింద పడిపోగా ఘోరీ అనుచరులు అతన్ని యుద్ధభూమి నుండి తప్పించారు. ఈ విధంగా ఈ యుద్ధం ముగిసింది.

తిరిగి రెండవసారి క్రీ.శ. 1192లో మహ్మద్‌ఘోరీ ఒక లక్షా ఇరవైవేల కాల్బలము 12000 అశ్విక దళంతో తిరిగి దాడిజరిపాడు. నూట యాభైమంది రాజపుత్రరాజులు పృధ్వీరాజు నాయకత్వంలో సమైక్యంగాఈ దాడిని ఎదుర్కొన్నారు. కాని పృధీరాజుపై ద్వేషంతో కనోజ్ రాజపుత్రరాజు జయచంద్రుడు మహ్మద్ ఘోరీకి సహకారం అందించాడు. ఈ యుద్ధంలో అనేకమంది రాజపుత్ర వీరులు, పృధ్వీరాజు సోదరులు మరణించారు. పృధీరాజు పట్టుబడ్డాడు. పృద్వీరాజు ఆస్థానకవి చాంద్‌బర్‌దాయ్ లేదా చాంద్‌భట్టు ఎలాగైన తన రాజును విడిపించుకోవాలనే కోరికతో మహ్మద్‌ఘోరీ దగ్గిరకు వెళ్లి “పృధ్వీరాజుకు

శబ్దభేధి అనే విలువిద్య తెలుసునని అతని విలువిద్యా ప్రదర్శన ఏర్పాటు చేయమని కోరుతాడు. అప్పటికే పృధ్వీరాజును గుడ్డివానిగా చేసినందువల్ల, తన శత్రువు శక్తిసామర్థ్యాలు ఏపాటివో చూద్దామన్న ఉబలాటంతో ఒప్పుకుంటాడు. రాజప్రాంగణంలో ఒక వైపు గంట వేలాడదీయబడుతుంది. మహ్మద్‌ఘోరీ ఒక ఎత్తైన రాజప్రాసాద గవాక్షంలో కూర్చుని వుంటాడు. పృధ్వీరాజును తీసుకు వచ్చి అతని చేతికి రెండు బాణములు మాత్రమే ఇస్తారు. చుట్టూ మహ్మద్ ఘోరీ సైనికులు అనుచరులు వుంటారు. చాంధ్‌భట్టు పృధ్వీరాజుకు ఎదురుగా వుంటాడు. మొదటిసారి గంట మ్రోగగానే పృధ్వీరాజు బాణం ఎక్కుపెట్టి లక్ష్యాన్ని చేదిస్తాడు. వెంటనే మహ్మద్‌ఘోరీ శభాష్ శభాష్ అంటూ చప్పట్లు చరుస్తాడు. చాంద్‌భట్టు పృధ్వీరాజును కీర్తిస్తున్నట్టు ఒక పద్యం చదువుతాడు. కాని, ఆపద్యంలో మర్మంగా మహ్మద్ ఘోరీ ఏవైపున ఎన్ని అడుగుల ఎత్తున వున్నదీ తెలుపుతాడు. వెంటనే పృధ్వీరాజు తన చేతిలో వున్న రెండవబాణాన్ని మహ్మద్ ఘోరీ వైపు వదిలి చంపివేస్తాడు. వెంటనే చాంద్‌భట్టు పృధ్వీరాజు ఒకరినొకరు తమ పిడిబాకులతో పొడుచుకుని వీరమరణం చెందుతారు. మహ్మద్ ఘోరీ సైనికులు పిచ్చెత్తినట్లు కనిపించిన ప్రజలనెల్ల చంపుతుంటారు. అనేకమంది రసపుత్ర కుటుంబాలు అడవుల్లోకి పారిపోవలసి వస్తుంది. తమను వెన్నాడుతున్న ముస్లిం సైనికుల నుండి తప్పించుకోవడానికి వీరు అడవుల్లోని ఎర్రమట్టి బట్టలకు పులుముకుంటారు. వాళ్ళ ఆడవాళ్ళు అప్పుడే అడవుల్లో పూచిన మోదుగుపూలను చిదిమి వాటి రంగును తమ బట్టలకు అద్దుకుంటారు. ఈ విధంగా వీరు తమ పూర్వపు రాచరికపు ఛాయలు పోగొట్టుకోకుండా బంగారు ఆభరణాల స్థానంలో వెండి ఆభరణాలు ధరిస్తూ రంగు రంగుల బట్టలు ధరిస్తూ జీవిస్తున్నారు. ఈ ఆభరణాలు వీరికి ఆభరణాలుగానే కాకుండా అడవుల్లో క్రూరమృగాలనుండి రక్షణకు, ముళ్ళపొదలు మొదలైన వాటినుండి రక్షణకు పనికి వస్తాయి. ఈ ఆభరణాలు వివిధ పేర్లతో క్రింది విధంగా కనిపిస్తాయి.

టొప్లి, గుగ్రి అనే వెంట్రుకలకు ధరించే ఆభరణము; భురియా, పూలే అనబడే ముక్కుపుడకలు; వాంకి, హర్, ఛీడ్, హసల్ అనేకంఠాభరణములు; ఛుడో, మొటేరేభళియా అనే గాజులు; వింటే, పూలే అనే వ్రేలి ఉంగరములు; చాస్, గోఢ్, వాంక్‌డే, వుండలి అనబడే ముంజేతి కడియాలు మొదలైనవి ధరిస్తారు.

ఈ ఆభరణాలు చూడ్డంతోనే ఈ స్త్రీ పెళ్ళయ్యిందా, లేదా, ఎంతమంది సంతానం, కొడుకులు ఎంతమంది, భర్తచనిపోయాడా మొదలయిన అనేక వివరాలు వెంటనే తెలిపే విధంగా వుంటుంది. పెళ్లయిన లంబాడా యువతి దేవి, భురియా, హర్,

అన్నాలీ, పుళియా, బాజూబంద్, కసోటియా, పూలా, మాట్లీ, బలియా (ప్రత్యేకమైన పెళ్లిగాజులు), చుడేరాభరియా (చేతిగాజులు), కాసె (కడియాలు), ఛక్తి (మట్టెలు), ఫేటియా (లంగా), కాంచ్‌లీ (జాకెట్టు), టుక్రీ (మొఖం మీదకప్పుకునే ముసుగు) సాంక్‌వాలోహర్ (ఒకబిల్లవంటి పతకము కలిగిన హారము), లాల్‌డీదోహర్ (కంఠముచుట్టూ అమరివుండే హారములు) మొదలైనవి ధరిస్తారు. ఇవే కాకుండా అంగతళ, గురి, ఛూడో, వాంకిడి, దేవి, భురియా మొదలైనవి పెళ్ళయిన లంబాడా స్త్రీలు మాత్రమే ధరిస్తారు. భర్తచనిపోయిన స్త్రీలు పెళ్లినాటి ఆభరణాలు తీసివేసే సాంప్రదాయంకూడ వుంది. చేతి మణికట్టు దగ్గిర నుండి భుజాలవరకు ధరించే కడియాలు ఒక దానికంటే మరొకటి కాస్త పెద్దగా వుండి క్రింది గాజుపై ఆదారపడి వుంటాయి. భుజం వద్ద వున్న చివరి గాజు పదహారు లేదా పద్దెనిమిది సెంటీ మీటర్ల కొలత కలిగి వుంటుంది. వివాహం కాని యువతులు చిన్న నల్లని దారం కంఠానికి ధరిస్తారు. వివాహం ముందు దీన్ని తీసివేస్తారు. గుగ్రీలు పెళ్ళయిన స్త్రీలు మాత్రమే ధరిస్తారు.

పురుషులు దుస్తులు తెల్ల ధోవతి, తెల్ల లాల్చి, తలకు ఎర్రరంగు రుమాలు, వుంటాయి. ధోతి లాల్చీలు ముతక మిల్లు బట్టలు. రుమాలు మాత్రం ఎరుపు రంగు, జేగురు రంగు లేదా ఎరుపు రంగు అంచువుండే విధంగాను వుంటాయి. ఎరుపు రంగును శుభసూచకంగా భావిస్తారు. పెళ్ళి సమయంలో వరుడు తెల్లని కొత్తధోతి, పఛెహదోయ్ అనే అంచున్న అంగీ ధరిస్తాడు. వరుడు ధరించే వస్త్రాలలో పాక్‌డి అనే ఎరుపురంగు రుమాలు, జగ్లా అనే అంగీ, కండ్వా అనే భుజాలపై కప్పుకునే తువ్వాలు, కండోరో అనే మొలతాడు, దోతి, ముర్కి, వీరోలి, భాలీ (చెవి రింగులు వెండిలేదా బంగారపుది), చాకడి అనే మరోరకమైన చెవి ఆభరణము, కోలా (ముంజేతి కంకణము), ధోడా (చేతి దండకడియము) ధరిస్తారు. లంబాడా స్త్రీలు ఓణి, చోలి, ఫేటియా (లంగా), కాంచ్‌లి (జాకెట్టు), టుక్రీ (మొఖంమీద కప్పుకునే ముసుగు) మొదలైన వస్త్రాలు ధరిస్తారు. ఈ వస్త్రాలు, వాటిపై నగీషీకి ఉపయోగించిన అద్దాలు, వెండినగలు వీరికి వారి ద్రిమ్మరి జీవితంలో అడవులలోని క్రూరమృగాల నుండిరక్షణకు, ముల్లపొదలనుండి రక్షణకు ఉపయోగపడతాయి. ఈ వస్త్రాలు రంగురంగుల గుడ్డపేలికలను వివిధ డిజైన్లలో అతికించి వాటికి పూసలు, వెండి పూసలు, అద్దాలు మొదలైన వాటిని పొదిగి రంగురంగుల దారాలతో అతికించి ఎంబ్రాయిడరీ చేస్తారు.

ప్రస్తుత కాలంలో లంబాడా స్త్రీలు ఈ వస్త్రాలు ధరించడానికి ఇష్టపడటం లేదు. ఇటీవల జరిపిన సర్వేలో ఈ క్రింది ఫలితాలు లభించాయి.

పట్టిక 1 - వస్త్రధారణ

| క్రమసం. | వివరములు | శాతం | సంఖ్య |
|---|---|---|---|
| 1. | సాంప్రదాయక వస్త్రాలు ధరించడానికి ఇష్టపడుతున్నవారు | 89% | 579 |
| 2. | సాంప్రదాయక వస్త్రాలు ధరించడం ఇష్టం చూపనివారు | 11% | 71 |
| | మొత్తం | 100% | 650 |

(సర్వే నిర్వహించినవారు భట్టు రమేష్, లెక్చరర్, జానపదగిరిజన విజ్ఞానపీఠం, వరంగల్)

క్రమక్రమంగా ఇష్టం చూపని వారిసంఖ్య పెరుగుతూ వస్తున్నది. దీనికి ప్రధాన కారణాలు రెండు. మొదటిది సాంప్రదాయక వస్త్రధారణను వ్యతిరేకిస్తున్న పదకొండుశాతం చదువుకున్నవారో లేదా చదువుకున్న కుటుంబాలకు చెందిన వారో, లేదా మైదాన ప్రాంత జీవాన విధానానికి బాగా అలవాటు పడినవారో కాగా, ఈ పదకొండు శాతం లెక్కలలో లేనివారు నేటి కమర్షియలైజేషన్, గ్లోబల్ వ్యాపార దృక్పధానికి మోసపోతున్నవారిగా గుర్తించడం జరిగింది. నేను నల్గొండ జిల్లాలోని లంబాడా తండాలలో తిరిగినపుడు అమెరికాకు ఎగుమతి చేసే ఎంతోమంది బ్రోకర్లు ప్రతి తండాలోనూ తటస్థించారు.

లంబాడా గిరిజనుల సంస్కృతికి సంబంధించిన ప్రతివస్తువును చౌక ధరకు కొనుగోలు చేయడం అమెరికాకు పంపించడం వారిపని. ఒక్క బొల్లి గుట్టతండా నుండే కనీసం రోజుకి నాలుగు బియ్యంబస్తాల సైజులో వీరి వస్త్రాలు కొత్తగాచేసినవి, వాడుకుంటున్నవి తమకు ఎదురుపడిన దేన్ని వదలకుండా బేరంచేసి ఎగుమతి చేయడం జరుగుతున్నవి. నేను రెండవసారి అదే తండాకు వెళ్ళినపుడు తండాపెద్ద, బిడ్డపెళ్ళి జరుగుతున్నది. ఈ పెళ్ళి బ్రాహ్మణ సాంప్రదాయ పద్ధతిలో జరుగుతుండగా మరోవైపు లంబాడీ గిరిజనుల సాంప్రదాయ వివాహంలో ముఖ్యమైనవిగా భావించే స్నానం చేయించే పీటలు, కసోటియా మొదలైనవి, బేరం కుదుర్చుకున్న బ్రోకర్లు తీసుకుపోవడం చూసాను. ఈవిధంగా సంస్కృతి విచ్ఛిన్నత ఎంత వేగంగా జరుగుతున్నదీ అంటే మరో నాలుగైదు సంవత్సరాలలో మనం ఈ లంబాడా సంస్కృతిని చూడలేకపోవచ్చు. ఒక ప్రత్యేకమైన జాతి లక్షణాలు కలిగిన ఈ సంస్కృతి తన సాంస్కృతికి ప్రత్యేకతను ఉనికిని కోల్పోతుండడం సమంజసమేనా అనేది గిరిజన మేధావులు ఆలోచించాలి. అదే విధంగా ఈ వస్త్రాలు, చాలా బరువుగా వుండడం, వస్త్రాలు కుట్టుకోవడానికి నెల రోజులు వ్యవధిపట్టడం, ఒక్కో డ్రెస్‌కు ఖర్చులు పెరిగిపోవడం కూడ ఒక కారణంగా పేర్కొనవచ్చు. కాని, ఇక్కడ నేను గమనించిన విషయమేమిటంటే ఈ తండా స్త్రీలు రోజూ ఈ వస్త్రాలను కుట్టడంలో తీరికలేకుండా వుంటారు. కాని అవి తాము ధరించడానికి కాదు. అమెరికన్ బ్రోకర్లకు అమ్మడానికి, తాము మాత్రం సాదా చీరలు ధరిస్తారు. ఇంకొన్నాళ్ళుపోతే వీటిన్నింటి డిజైనింగ్ పైనా ఏ ప్రముఖ అమెరికన్ డిజైనరో పేటెంటు హక్కు పొందినా ఆశ్చర్యం లేదు.

*

# గిరిజన విద్య - నాడు, నేడు, రేపు

డా॥ యం.పి. రాజ్‌మహ్మద్

విదేశీయుల పాలన పోయి మనం చూస్తుండగానే 50 సంవత్సరాలు గడిచి పోయాయి. పరాయి పాలనవల్ల మనదేశం అభివృద్ధి కాదనిప్రజలకు నష్టం వాటిల్లుతుందని ఎందరో త్యాగ మూర్తులు స్వపరిపాలన కోసం తమ ప్రాణాలను అర్పించారు. అట్టడుగున ఉన్న పీడిత, తాడిత, వెనుకబడిన సమాజాన్ని అభివృద్ధి చేయుటకు ప్రపంచంలోని అన్ని రాజ్యాంగాలను క్షుణ్ణంగా చదివి అతిపెద్ద రాజ్యాంగాన్ని నిర్మించుకున్నారు. డా॥ బి.ఆర్. అంబేద్కర్ గారు అప్పటికే నిమ్నజాతుల ఉద్ధరణ. సామాజికన్యాయంపట్ల అనేకసార్లు ఆక్షేపిస్తూనేఉన్నారు. మనం స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు ఘనంగా జరుపుకుంటున్నాం. ఈ సందర్భంగా స్వాతంత్ర్యానంతరం జరిగిన అభివృద్దిని మననం చేసుకోవలసిన అవసరం ఉంది. స్వాతంత్ర్యానంతరం జరిగిన అభివృద్ధిని నెమరువేసుకుంటే కంప్యూటర్‌లాంటి ఆధునిక పరికరాలను తయారు చేసుకున్నాం అని గర్వంగా చెప్పుకోవచ్చు.

అయితే సమాజానికి దూరంగా ఉన్న గిరిజనులను పరికిస్తే వారు పురోగమనంలో ఉన్నారో? తిరోగమనంలో ఉన్నారో? అందరం ఆలోచించవలసిన ఆవశ్యకత ఉంది.

నేటి సమాజాభివృద్ధికి ప్రధానమైన విద్య అని, విద్య నేర్చుకోవడానికి ప్రభుత్వం అనేక పథకాలు తయారు చేస్తుంది. ప్రతిజిల్లాకు అక్షర దీపిక, అక్షర దీప్తి మొదలగు పేర్లతో ప్రత్యేక కార్యకర్తలను నియమించి సంపూర్ణ అక్షరాస్యతకు ప్రయత్నం చేస్తుంది. ఇల్లాలి చదువు ఇంటికి వెలుగు లాంటి నినాదాలున్నాయి. ఈ మధ్యనే DPEP లాంటి పథకాలు వచ్చాయి.

ఈ నేపథ్యంలో గిరిజన విద్య నాడు, నేడు ఎలా ఉంది? రేపు ఎలా ఉండాలి? దీని గురించి చర్చించడం ఈ వ్యాసం యొక్క ప్రధానోద్దేశ్యం

గిరిజన సమాజం అభివృద్ధి కావాలంటే విద్య అవసరం అని 'ఈస్ట్ ఇండియా కంపెని' 1850 సంవత్సరంలో బ్రిటిష్ ప్రభుత్వానికి సిఫార్సు చేసింది. ఈస్ట్ఇండియాకంపెని కనుక గిరిజన విద్య బోధన కోసం పాఠశాలలు నిర్మాణం గురించి తెలుపక పోతే గిరిజన పరిస్థితి అంతతొందరగా ప్రభుత్వం దృష్టికి వచ్చేదికాదు. 1855-56లో ప్రభుత్వ విద్యాశాఖ కొండాలు, గంజాం గిరిజన ప్రాంతాల్లో, నెల్లూరు శ్రీహరికోటకు చెందిన యానాదులు, నీలగిరికి చెందిన తోడాలు, బోడశీలకు పాఠశాలలు నెలకొల్పినారు.

1888-89 సంవత్సరంలో విద్యా శాఖ డైరెక్టర్ ప్రిన్సిపాల్ అసిస్టెంట్ కలెక్టర్ డి.

పాట్రిడ్జ్ గారు గిరిజనుల కోసం నిర్మించిన పాఠశాలలు గిరిజన ప్రాంతాల్లో స్థిరపడిన హిందువులకు ఉపయోగపడినాయని, గిరిజనుల పరిస్థితి ఏమాత్రం సంతృప్తికరంగా లేదని ప్రభుత్వానికి నివేదిక సమర్పించినారు. దానికి ప్రధాన కారణాలు (1) అక్కడి సమాజంలోని పరిస్థితులు, వాటి అవసరానికి తగిన విధంగా విద్యాబోధన ఉండాలి. (2) అక్కడి ప్రజల స్థానిక భాషలో విద్యా బోధన జరుగాలి. (3) ఈ విద్యవల్ల తమకు నూతనమైన ఆశయాలు, కోర్కెలు నెరవేరగలవన్న అభిప్రాయం వారిలో కలిగే విధంగా విద్యాబోధన ఉండాలని గుర్తించారు.

1872లో సర్‌జార్జి కాంప్‌బెల్ ఆటవికులైన గిరిజనుల పరిస్థితులకు అనుగుణ్యమైన రీతిలో వారికి ప్రయోజనం కలిగించే విధంగా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలంటే విద్యారంగంలోనే ఎక్కువ శ్రద్ధచూపాలి. ఈ గిరిజన ప్రాంతాలకు ప్రత్యేకమైన విద్యావ్యవస్థ ఉండాలి. కొన్ని సంవత్సరాలు అవగాహన చేసుకునేందుకు మౌఖిక విద్యాబోధన అవసరం. విద్య నేర్చుకున్న వారికి బహుమతులు, ఇతర ప్రోత్సాహక చర్యలను అవలంబిస్తే విద్య నేర్చుకోవచ్చు అని అభిప్రాయపడినారు.

గిడుగు రామ్మూర్తి పంతులు గారు పర్లాకిమిడి జమీందారి హైస్కూల్‌లో ఉపాధ్యాయులుగా పనిచేస్తూ, సవరభాషపై పరిశోధన చేసినారు. సవరల విద్యా పరిస్థితిని, విద్యాబోధన విషయంలో ప్రభుత్వం ఎదుర్కొంటున్న ఇబ్బందులను పేర్కొంటూ, ఎలాంటి అదనపు వ్యయం లేకుండా ఉత్తమ ఫలితాలను సాధించడానికి 1894లో 'ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషన్' లో ఒక ప్రణాళికను సూచించారు. స్వాతంత్ర్యానంతరం 1950లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వం గిరిజనాభివృద్ధికి నడుంకట్టుకొంది.

తెలంగాణా ప్రాంతం ఆదిలాబాద్‌లో గిరిజనులపై జరుగుతున్న అన్యాయాన్ని సహించలేక 1940లో గోండు తెగకు చెందిన 'కొమురంభీము' నాయకత్వాన అప్పటి నిజాం ప్రభువుపై తిరుగుబాటు జరిగింది. నిజాం ప్రభుత్వం గిరిజనుల తిరుగుబాటు ఎందుకు జరిగింది? వారి సమస్యలు వాటి పరిష్కారాలకోసం ప్రొఫెసర్ హేమండార్ఫ్‌ను నియమించినారు. హేమండార్ఫ్ గారు గిరిజన అభివృద్ధి కొరకు గిరిజన చైతన్యానికి, విద్యాభివృద్ధికి పునాదులు రూపొందించి 1942 లోనే సమీకృత గిరిజన సంక్షేమ పథకం ఏర్పాటు చేశారు. అదే సమయంలో గిరిజన సంక్షేమ, విద్యావికాస కేంద్రాలు ఏర్పాటు చేసినారు. గిరిజనులకు విద్య నేర్పడానికి ఆశ్రమ పాఠశాలలు ఏర్పాటుచేసినా, విద్యాభివృద్ధి కాలేదు. విద్య నేర్చుకోవడానికి ఎందుకు ముందుకు రావడంలేదని ఆదిలాబాద్ జిల్లాలో ఉట్నూరులో ఐ.టి.డి.ఏ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా నియమితులైన M.V.P.C. శాస్త్రిగారు గిరిజన పెద్దలను పిలిపించి ఆత్రం భీమ్‌రావుపటేల్‌తో విచారించారు. గిరిజన పెద్దలు ఆత్రం భీమ్‌రావు గారు గిరిజనులకు దూరంగా ఆశ్రమ పాఠశాలలుండడం, గిరిజనేతరులు

అయినా ఉపాధ్యాయుల నియామకం ఇటు ఉపాధ్యాయులుండకపోవడం మూలంగా విద్య కుంటుపడుతుంది. అందుకుగాను మాగిరిజన ప్రాంతానికి చెందిన 10వతరగతి ఉత్తీర్ణత పొందినా, పొందకపోయినా కుర్రాడిని చదువు చెప్పమంటే చెబుతాడు. ఇలాంటి బడిలో రెండేళ్ళు చదివితే చదువు అంటే ఏమిటో తెలుస్తుంది. పెద్ద పెద్ద డిగ్రీలు గలవారు ఈ ప్రాంతానికిరారు. వస్తే ఉండరు. అందుకే అదే కులానికి ప్రాంతానికి చెందిన వారితో విద్య నేర్పిస్తే బాగుంటుందని సలహా ఇస్తారు. ఆత్రం భీమ్‌రావు సలహామేరకు మేటిగూడ, బాళ్లిగూడ గ్రామాల్లో I.T.D.A. స్థానిక కుర్రాళ్లను నియమిస్తే ఫలితాలు నమ్మశక్యంగా కన్పించాయి. పిల్లలు చదువడానికి ముందుకువచ్చినారు. ఆవిధంగా I.T.D.A ద్వారా మునుపటికంటే గిరిజనుల విద్యాభివృద్ధి కొంతమెరుగైంది.

1986 సంవత్సరంలో రాష్ట్రప్రభుత్వం 302,275 నెంబర్‌గల ప్రభుత్వ ఉత్తర్వును జారీ చేసింది. గిరిజనులకోసం వేయి పాఠశాలలను మంజూరు చేస్తూ, ఏజెన్సీ గ్రామాలలో వాటిని స్థాపించి, స్థానికంగా 10వ తరగతి ఉత్తీర్ణత పొందినా, పొందక పోయినా 5వ షెడ్యూల్డులో జు ఆఫ్ । పేరాను ఉటంకిస్తూ అప్పటి గవర్నర్ నోటిఫికేషన్ తేది 5-11-1986లో 275 ప్రభుత్వ ఉత్తర్వును జారీచేసినారు. ఈ విధంగా ఆయాప్రాంతాల్లో నివసిస్తున్న గిరిజన యువకులకు ఉద్యోగ భృతి, గిరిజన విద్యాభివృద్ధి కోసం కొంత ప్రయత్నం జరిగింది. అయినా గిరిజన విద్యాభివృద్ధి చాలా తక్కువగా జరిగింది. అందులో స్త్రీ విద్యాభివృద్ధి అసలే జరుగలేదు. దానికి కారణాలు అనేకం.

1. విద్య గురించి విద్య అవసరాన్ని గుర్తింపజేయడానికి కృషి జరుగలేదు.
2. విద్య నేర్చుకున్న యువకులు గిరిజన సమాజానికి దూరంగా ఉండడం.
3. విద్య నేర్చుకోవడానికి పరిసర ప్రభావం అనుగుణంగా లేకపోవడం.
4. ప్రధానంగా ఆర్థికకారణం.
5. రెక్కాడితే డొక్కాడని గిరిజనులకు బ్రతకడంకోసం కూలినాలి చేసి బ్రతకడం కోసం పిల్లలనుపయోగిస్తారు తప్ప బడికి పంపరు.
6. ప్రస్తుత విద్యా విధానంలో 18 సంవత్సరాల వరకు గడిస్తే తప్ప కుటుంబానికి ఫలితం లభించదు.
7. చదువుకున్న యువకులకు ఉద్యోగంరాక అటుకూలి చేయలేక తల్లిదండ్రులకు భారంగా ఉండడము.
8. తల్లిదండ్రులకు పిల్లల భవిష్యత్తుపై ఆలోచనలేకపోవడం.
9. అంతో, ఇంతో చదువుకొని ఉద్యోగస్తులైన యువకులు, స్థానిక ఉపాధ్యాయులు ఆధునిక సమాజాన్ని అందుకోవడానికి స్థానికంగా ఉండక నాగరిక ప్రపంచానికి అందుబాటులో ఉండడమువల్ల గిరిజనుల అభివృద్ధి కుంటుబడుతుంది.

10. స్థానికంగా ఉంటే రాజకీయ ప్రభావంపడి దూరంగా వెళ్ళడం అభివృద్ధి చేస్తామనుకున్న వారిని రాజకీయ నాయకులు దూరంచేయడం.

11. తమ గిరిజన తెగ విద్యాభివృద్ధి కోసం దృఢమైన సంకల్పంతో పనిచేయకపోవడం విద్యాభివృద్ధికి ఆటంకాలు.

12. పాఠశాలల కొరత, అందుబాటులో లేక దూరంగా ఉండడం. ఉన్న పాఠశాలలకు భవనాలు, కొన్ని చోట్ల తగిన ఉపాధ్యాయులు లేకపోవడం విద్యాభివృద్ధికి లోటు.

13. ప్రభుత్వం పథకాలు చేసి వదిలిపెట్టడం, సరియైన పర్యవేక్షణ లేకపోవడం, కేవలం విద్య నామమాత్రంగానే మిగిలిపోయింది.

1850 సంవత్సరం నుండిగిరిజనుల కోసం ప్రత్యేక విద్య కావాలని అనేక మంది సూచించారు. అయితే ప్రభుత్వం ఏ విధమైన విద్య ఉండాలో ప్రత్యేకమైన శ్రద్ధచూపలేదు. ఆధునిక సమాజానికి సంబంధించిన విద్యనే గిరిజనులపై రుద్దడం జరిగింది. ఆదిశోచనీయం.

గిరిజనులు ప్రాంతాల వారీగాచూస్తే మూడురకాలుగా కొండపై ప్రాంతాల్లో, దట్టమైన అడవీ ప్రాంతాల్లో, మైదానప్రాంతాల్లో నివసిస్తున్నారు. భాషావైవిధ్యాన్ని బట్టిచూస్తే తెలుగు భాష మాతృభాష కలిగినవారు, ఇతర కోయి, లంబాడి, గోండు, కోలా, సవర మొదలగు భాష మాతృభాష కలిగినవారున్నారు. వీటి ప్రాధాన్యతను ప్రభుత్వం గుర్తించలేదు. ప్రాంతాలవారిగా మూడురకాల గిరిజనులున్నారు. ఇందులో మైదాన ప్రాంతాల్లో నివసిస్తున్న గిరిజనులు గిరిజనేతరుల సహచర్యంతో ప్రభుత్వ పథకాలు ఉపయోగించుకోవడంలో ముందున్నారు. భాషావైవిధ్యాన్ని దృష్టిలో పెట్టుకొని, ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని పాఠ్యాంశాలను కొత్తగా తయారుచేసి విద్యా విధానాన్ని మార్చవలసిన అవసరం ఉంది.

ఈ నేపథ్యంలో బ్రిటిష్ ప్రభుత్వం నుండి స్వర్ణోత్సవాలు జరుపుకుంటున్న ఇప్పటి వరకు విద్యకు సంబంధించిన అంశాలను దృష్టిలో పెట్టుకొని రేపటి విద్య ఏవిధంగా ఉండాలో పరిశీలనాత్మకంగా, గిరిజన విద్యాభివృద్ధి దృష్ట్యా నా అభిప్రాయాలను తెలియజేస్తున్నాను. మీరు అభిప్రాయాన్ని క్రోడీకరించవలసిందని వ్రాస్తున్నాను.

1. గిరిజనులకు ప్రత్యేకచట్టాన్నితీసుకొని వచ్చి నిర్బంధ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టాలి.
2. ఆధునిక విద్యావిధానంలో రిజర్వేషన్ పెట్టడం కాకుండా వీరికే ఉన్నతస్థాయివరకు విధ్యా విధానాన్ని ప్రవేశపెట్టాలి.
3. గిరిజన సమాజంలో ప్రాంతాన్ని బట్టి రిజర్వేషన్లను అమలుపరచాలి.
4. ప్రాథమిక స్థాయిలో ఆయాపరిసరాలకు సంబంధించిన అంశాలను చేర్చాలి.
5. ఆర్థికంగా కుటుంబానికి లోటును పూడ్చేవిధంగా విద్యావిధానం ఏర్పాటు చేయాలి.
6. ఆయాప్రాంతానికి చెందిన ఆయాభాష తెలిసిన గిరిజనులనే ఉపాధ్యాయులుగా నియమించాలి.

7. ఉపాధ్యాయనియామకానికి ముందు నేను ఈ ప్రాంతంలోనే గిరిజనులకే విద్య నేర్పడానికి పనిచేస్తాననే కండీషన్‌తో నియామకం చెయ్యాలి.
8. గిరిజనులకు విద్య నేర్పడానికి ప్రత్యేక శిక్షణా తరగతులు ఏర్పాటు చేయాలి.
9. గ్రామస్థాయి విద్యాకమిటీని 10. మహిళ సంఘాలను, 11. యువక సంఘాలను
12. గిరిజన ఉద్యోగ సంఘాలను, మొ॥ ఏర్పాట్లు చేసి వీరందరికీ విద్య కోసం శిక్షణా తరగతులను ఏర్పాటు చేసి సలహా సహకారంతో విద్యనేర్పాలి.
13. గిరిజనులకు నేర్పే విద్యా నిష్పత్తిని దృష్టిలో పెట్టుకొని Promotions, Awards ను ఉపాద్యాయులకు ప్రోత్సాహకంగా ఇవ్వాలి.
14. విద్య నేర్చుకున్న వారికి ప్రభుత్వం ఇస్తున్న సంక్షేమపథకాలు సబ్సిడీలు వెంటనే అందేట్టుగాచూడాలి.
15. విద్య అమలు ఏవిధంగా ఉంది? ఇపుడు ఏమి కావాలి? ఎంతవరకు వచ్చింది? దీనిపై ప్రత్యేక కమిటీని ఏర్పాటుచేసి ఎప్పటికప్పుడు తగుచర్య నిమిత్తం ప్రణాళికలు తయారు చేయాలి.
16. దేనికి లొంగని, నిష్పక్షపాతులను పర్యవేక్షకులుగా నియమించాలి.
17. ఎప్పటికప్పుడు పరిస్థితిని ప్రభుత్వానికి తెలియజేయాలి.
18. స్వచ్ఛంధసంస్థలు, స్వచ్ఛంధకార్యకర్తలు గిరిజనుల విద్య కోసం ముందుకు రావాలి.
19. గిరిజన సంఘాలు చిత్తశుద్ధితో గిరిజన అభివృద్ధికి, విద్య, సంక్షేమ పథకాల అమలు గురించిన విషయాలు తెలుపడం బాధ్యతగా స్వీకరించాలి.
20. అన్నిరకాల రాజకీయ నాయకులు, చిత్తశుద్ధితో గిరిజనాభివృద్ధి, విద్యకోసం పర్యవేక్షణ చేస్తు తగు శ్రద్ధతీసుకొని, ప్రత్యేక Seminor మొదలగునవి ఏర్పాటు చేయాలి.

ఈ విధంగా ప్రభుత్వం, అధికారులు, అనధికారులు, రాజకీయనాయకులు, స్వచ్ఛంధ సంస్థలు, కార్యకర్తలు, ముందుకు వచ్చి గిరిజనాభివృద్ధికి తోడ్పడవలసిన అవసరం ఉంది.

గిరిజన సంఘాలు తమ ప్రాధాన్యతను గుర్తించి, తమ సంఘాభివృద్ధికి కృషి చేస్తేనే గిరిజనులకు విద్య, విద్య ద్వారా సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ పరిణామాలు మొదలగునవన్ని అవగాహనచేసుకోగలరు. అందుకే గిరిజన విద్య ఆవశ్యకతను గుర్తించి, గిరిజనులు తమకు తాముగా తమ కర్తవ్యంగా భావించి, అభివృద్ధికావలసిన అవసరం ఎంతైనా గలదు.

*

# ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూలు కులాల సంక్షేమం - తీరుతెన్నులు

- కైతే అనయ్య

భారత దేశ అభివృద్ధి పథంలో ఆంధ్రప్రదేశ్ ఐదవ స్థానంలో వుంది. ముఖ్యంగా బలహీన వర్గాల వారిలో షెడ్యూల్డు కులాల వారి అభివృద్ధికి గల నలభై సంవత్సరాలలో ఎంతగానో కృషి జరిగింది. షెడ్యూల్డు కులాల విద్య వసతి హక్కుల పరిరక్షణ రిజర్వేషన్లను వివిధశాఖలలో అమలు చేయడంలో ఆంధ్రప్రదేశ్ మిగతా రాష్ట్రాలకంటే ముందంజలో వుందని ఖచ్చితంగా చెప్పవచ్చును. షెడ్యూల్డు కులాల సంక్షేమం కోసం అనాధలు, వితంతువులు, జోగినులు, నిరుపేద వృద్ధులు భూమిలేని వ్యవసాయ కూలీలు తదితర బలహీన వర్గాలకు సాంఘిక భద్రతా పథకాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అమలు చేస్తోంది.

1991 జనాభా లెక్కల ప్రకారం 6.65 కోట్ల ఆంధ్రప్రదేశ్ జనాభాలో 106 లక్షల మంది షెడ్యూలు కులాల వారున్నారు. రాష్ట్ర జనాభాలో వీరి శాతం 15.93 వీరిలో అధికంగా గ్రామాలలో శ్రామిక వృత్తులలో కాయకష్టం చేసుకొని పొట్టపోసుకొనే కుటుంబాలే అధికం.

షెడ్యూల్డు కులాల కుటుంబాలు సమాజంలో ఆర్థికంగా సాంస్కృతికంగా సత్వరాభివృద్ధి సాధించాలంటే వారి కుటుంబాలలో అందరూ అక్షరాస్యులై వుండాలి. ఈ మౌలిక సత్యాన్ని గుర్తించి రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వ సహాయంతో సంపూర్ణ అక్షరాస్యత కార్యక్రమాన్ని పటిష్టంగా అమలు చేస్తోంది.

షెడ్యూల్డు కులాలవారికి రాజ్యాంగంలో పొందుపరచిన 16 శాతం రిజర్వేషన్‌లను రాజకీయంగా అన్ని రాష్ట్రాలలో అమలు చేస్తున్నారు. కాని అదే రిజర్వేషన్‌లను విద్యా ఉద్యోగ కల్పన సంబంధిత రంగాలలో అంతగా అమలు చేయటంలేదనే విమర్శవుంది. ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డు కులాలకు విద్యావకాశాలను కల్పించడంలో అగ్రస్థానంలో వుంది. మరే ఇతర రాష్ట్రంలోను ఇక్కడివలె షెడ్యూల్డు కులాలవారికి వృత్తిపరమైన ఇంజనీరింగ్, వ్యవసాయ, వైద్య కళాశాలలోను, విశ్వవిద్యాలయాలు, కాలేజీలలోను వీరికొరకు ప్రత్యేకించిన సీట్లు పూర్తిగా భర్తీచేయడం జరగడం లేదని చెప్పడం సత్యదూరం కాదు.

విద్యా, ఉద్యోగ కల్పన విషయంలో దేశంలోని అన్ని విశ్వవిద్యాలయాలలో కంటే ఆంధ్రావిశ్వవిద్యాలయం షెడ్యూల్డు కులాలవారి రిజర్వేషన్ల తూ. చ తప్పకుండ అమలు చేయడంలో అగ్రస్థానంలో వుంది. ఆ సేవానిరీతి మన ఆంధ్రప్రదేశ్ పాలకులదేనని చెప్పవచ్చును. అంతే గాకుండ ప్రజాపంపిణి వ్యవస్థను ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే ప్రప్రథమంగా ప్రారంభించింది. మాజీ ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు కాలంలో ప్రజాపంపిణీ విధానం బలహీన వర్గాలకు ముఖ్యంగా షెడ్యూల్డు కులాల వారికి ఎక్కువగా లాభించింది. షెడ్యూల్డు కులాల కొరకు పనిచేస్తున్న హాస్టళ్ళను, విద్యాలయాలను గురుకుల విద్యాలయాలుగా మార్చి మంచి ఫలితాలను

సౌకర్యాలను విరివిగా పెంచండానికి ప్రభుత్వం శ్రద్ధ వహిస్తోంది. గురుకుల జూనియర్ కాలేజీలలోను షెడ్యూల్డు కులాల విద్యార్థుల సమున్నతికి కృషి సల్పుతోంది. వీరికోసం దాదాపు 92 రెసిడెన్షియల్ పాఠశాలలు పనిచేస్తున్నాయి. ప్రభుత్వ హాస్టళ్ళకు, రెసిడెన్షియల్ పాఠశాలలు పనిచేస్తున్నాయి. ప్రభుత్వ హాస్టళ్ళకు, రెసిడెన్షియల్ పాఠశాలలకు శాశ్వత భవన సముదాయాల నిర్మాణానికి రూ. 13.50కోట్లు కేటాయించారు. 1994-95 బడ్జెట్‌లో 1,25,000 మంది షెడ్యూల్డు కులాల విద్యార్థులకు పోస్టుమెట్రిక్ స్కాలర్ షిప్‌లకు రూ. 31 కోట్లు కేటాయించారు. ఐదు లక్షల మంది 1, 2 తరగతులు చదువుతున్న షెడ్యూల్డు కులాల బాలబాలికలు పాఠశాలకు హాజరుకావటం కోసం ప్రోత్సాహక స్కాలర్‌షిప్‌లు, పాఠ్యపుస్తకాలు, నోట్ పుస్తకాలు ఉచితంగా అందజేస్తుంది. వీరికి ఉచితంగా యూనిఫారంలు మధ్యాహ్న భోజన పథకం కూడా అమలు చేస్తోంది.

ప్రభుత్వ హాస్టళ్ళలో 638 మందికి పైగా విద్యార్థిని విద్యార్థులకు వసతి కల్పిస్తున్నారు. 9,10 తరగతి షెడ్యూల్డు కులాల విద్యార్థులకు ప్రత్యేక వసతి కల్పించి వారి ఉత్తీర్ణతకు ప్రభుత్వం ఎంతగానో కృషి చేస్తోంది. విద్యా రంగంలో విద్యార్థులను ప్రోత్సహించడానికి ఒక్కొక్కరు రూ 100 విలువ గల 92 మెరిట్ స్కాలర్ షిప్‌లను (46 షె.కు 46 ఇతరులకు) సంక్షేమ శాఖ ఇస్తుంది. అంతేకాక వృత్తి విద్యా కోర్సులలో చదువుచున్న షెడ్యుల్డు కులాల విద్యార్థులకు బుక్ బ్యాంకులను ఏర్పాటుచేసి వారికి కావలసిన పుస్తకాలను అరువు పద్ధతిమీద సరఫరా చేస్తుంది. పరిశోధనకు, విదేశాలు వెళ్ళే విద్యార్థులకు 1989 నుండి స్కాలర్ షిప్పులను అందచేస్తోంది.

ఆంధ్రప్రదేశ్ స్టడీ సర్కిల్ ఆధ్వర్యంలో సర్వీసు కమీషన్ వారి సివిల్ సర్వీసెస్ పరీక్షలకు హాజరయ్యే అభ్యర్థులకు ప్రత్యేక శిక్షణ నిస్తున్నారు. 1979 నుండి సివిల్ సర్వీసులకు షెడ్యూల్డు కులాల నుండి ఎంపికయ్యే అభ్యర్థుల సంఖ్య పెరిగింది. 1990 లో 76మంది 1991లో 91 మంది 1992లో 80 మంది ప్రయోజనం పొందారు. షెడ్యూల్డు కులాలకు చెంది. లా గ్రాడ్యుయేట్లకు మూడు సంవత్సరాలపాటు స్టయిఫండ్ ఇచ్చి న్యాయపాలనలో శిక్షణ గడపడం జరుగుతుంది. ఎంసెట్ , ఇ సెట్, గేట్, జి ఆర్ ఇ మొదలైన కీలక పరీక్షలలో అభ్యర్థులకు పరీక్షలకు ముందు శిక్షణ ఇచ్చేందుకు జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం అనేక కార్యక్రమాలు అమలు చేస్తోంది. సాంఘిక సంక్షేమ శాఖ వసతి గృహాలలో స్కౌటింగ్, గైడింగ్ పథకాన్ని విస్తృతం చేస్తారు. 1 నుండి 5వ తరగతుల వరకు నిర్బంధ ప్రాథమిక విద్యావిధానం కింద బాలికల హాజరు పెంచేందుకు ప్రభుత్వం ప్రత్యేక ప్రోత్సాహ విధానాలను అమలు చేస్తోంది. అంతేగాక ఆంధ్రరాష్ట్రంలో ఓపెన్ స్కూలు విధానం మధ్యలో చదువు మానిన విద్యార్థులకు అవకాశం కల్పిస్తుంది. ఈ అవకాశాలను సద్వినియోగం చేసుకోవటం ద్వారా వీరిలో నిరక్షరాస్యతను రూపుమాపడానికి అస్కారం వుంది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1970-71లో రూ 5 నుండి 10 కోట్లు షెడ్యూల్డు కులాల వారిపై ఖర్చు చేయగా 1994-95 లలో వీరి సమగ్ర సంక్షేమానికి, సమగ్రాభివృద్ధికి రూ 330 కోట్లు ఖర్చు చేసింది. వీరి ప్రత్యేక కార్యక్రమాలకు ప్రత్యేక సంక్షేమ ప్రణాళిక కింద దాదాపు రూ. 290 కోట్లు

ఖర్చు చేసింది. 1994-95లో రెండు లక్షల మందికి పైగా షెడ్యూల్డు కులాల వారి కుటుంబాలు దారిద్ర్యరేఖను అధిగమించడానికి రూ 210 కోట్లు ఖర్చుచేసింది. షెడ్యూల్డు కులాల ఆర్థికాభ్యున్నతికి వారి జీవితంలో ఆత్మ విశ్వాసంతో ముందడుగు వేయడానికి షెడ్యూల్డు కులాల ఆర్థిక సంస్థ ముఖ్య పాత్ర వహిస్తుంది. వీరికి మార్జిన్‌మనీ కేటాయిస్తుంది. తద్వారా వారు జీవనోపాధికి లోటులేకుండ అవకాశాలు పొందగలరు. ఈ సంస్థ వివిధ పథకాలకింద ఆర్థిక సహాయం అందిస్తూ 1992 వరకు దాదాపు రూ. 850.40 కోట్లు వ్యయం చేసింది.

షెడ్యూల్డుకులాల వారికి 1991 వరకు 1,63,356 ఎకరాల విస్తీర్ణంలో 27,78,972 కుటుంబాలకు ఇళ్ళ స్థలాలను కేటాయించారు. 1994 వరకు 4,25,000 గృహాలను నిర్మించాలని లక్ష్యంగా పథకం అమలు చేస్తున్నారు. 1992-93లో 3.75 లక్షల మంది షెడ్యూల్డు కులాల వారికి ప్రభుత్వం ఆర్థిక సహాయం అందించింది.

షెడ్యూల్డు కులాల రైతులకు కేటాయించిన భూములలో తగిన సేద్యపు నీటి వసతులు కొరవడినందున ఆర్థికంగా అట్టడుగునున్న వారికి ఆ భూములను సద్వినియోగం చేయడానికి సాంఘిక సంక్షేమశాఖ సంయుక్తంగా వీరి భూములకు సేద్యపు నీటివసతిని కల్పిస్తున్నాయి. సామూహిక బావులు త్రవ్వడం వీటిని విద్యుద్దీకరించడానికి కార్యచరణ ప్రణాళికలో అత్యంత ప్రాధాన్యాన్నిస్తూ 1894-95 లో 17,000 సామూహిక బావులు తవ్వించి 30,000 బావులను విద్యుద్దీకరించారు.

అస్పృశ్యతా నివారణ కార్యక్రమం కింద దేశంలోకెల్లా ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా వుంది. మహాత్మాగాంధీ సవర్ణులతో కూడిన అఖిల భారత హరిజన సేవాసంఘం స్థాపించారు. దాని శాఖకు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు అధ్యక్షుడు, అల్లూరు బాపినీడు కార్యదర్శిగా పనిచేశారు. మహాత్ముడు నాగేశ్వరరావు పంతుల స్వగ్రామం యలకుర్రు వచ్చి ఆయన కట్టించిన హరిజనపల్లెను సందర్శించి మెచ్చుకున్నారు. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య , యం మాధవాచార్యులు, అయ్యదేవర కాళేశ్వరరావులు అస్పృశ్యతా నిర్మూలన కొరకు కృషి చేశారు. 1946-47 లలో ప్రకాశం పంతులు తమ మంత్రివర్గంలో గ్రామోద్ధరణ శాఖను షెడ్యూల్డు కులానికి చెందిన వేముల కూర్మయ్యకు ఇచ్చి ఫిర్కా అభివృద్ధి పథకం అమలు చేయించారు. ఆనాటి నుండి నేటివరకు ఎంతోమంది మన ఆంధ్రప్రదేశ్ మంత్రిపదవుల నలంకరించారు.

1960 జూలైలో దామోదరం సంజీవయ్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి మొదటి షెడ్యూల్డు కులాలకు చెందిన ముఖ్యమంత్రి అయ్యారు. ఈ నాటికి రాజ్యాంగ బద్దంగా ఏర్పడిన రాజకీయ రిజర్వేషన్లు అమలు అవుతున్నాయి. లోక్‌సభలో ఆరు స్థానాలు షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు కేటాయించారు. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో షెడ్యుల్డు కులాలకు 39 స్థానాలు జనాభా ప్రాతిపదికన కేటాయించారు. ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్ర మంత్రివర్గం ఏర్పాటు చేసేటప్పుడు సంప్రదాయ బద్ధంగా అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం కల్పించినపుడు షెడ్యూలు కులాల వారిని 4-6 మందిని మంత్రులుగా చేర్చుకొనే ఆనవాయితీ వుంది. ప్రస్తుతం మంత్రివర్గంలో నలుగురు షెడ్యూల్డు కులాల మంత్రులున్నారు. షెడ్యూల్డు కులాలపై అత్యాచారాలను అరికట్టడానికి 1989లో ఒక చట్టం

వచ్చింది. దాన్ని అమలు చేయడానికి కేసులు విచారించి శిక్షించడానికి మూడు ప్రత్యేక సెషన్సు కోర్టులను చిత్తూరు, గుంటూరు, మహబూబ్ నగర్‌లలో ప్రారంభించారు. 22 జిల్లాల్లోని సెషన్సు కోర్టులను డిజిగ్నేటు కోర్టులుగా ప్రకటించింది. 22 సంచార న్యాయస్థానాలను ఏర్పాటు చేశారు. షెడ్యూల్డు కులాలకు కేటాయించిన హక్కులను తప్పుడు సర్టిఫికెట్లతో ఇతరులు హరించకుండా వుండడానికి విధానసభలో శాసనం చేశారు. సాంఘిక సమైక్యతను ప్రోత్సహించేందుకు కులాంతర మతాంతర వివాహాలను ప్రోత్సహిస్తున్నారు.

షెడ్యూల్డు కులాల వారిలో కొంతమంది అపరిశుభ్ర వృత్తులకు చెందిన వారిప్రయోజనం కోసం ఒక దీర్ఘకాలిక ప్రణాళికా కార్యక్రమాన్ని చేపట్టారు. వారికి గౌరవప్రదమైన వృత్తులలో శిక్షణగొలిపి పునరావాసం కల్పించేందుకు 1992-93 నుండి జాతీయపథకాన్ని రాష్ట్రంలో అమలుచేస్తున్నారు. దానికి రూ. 1.75కోట్లు కేటాయించారు 1994-95లో 7453 మంది పారిశుధ్య పనివారి విముక్తి పునరావాసం కోసం రూ 4.55 కోట్లు మంజూరు చేశారు. చర్మకారుల బహుముఖాభివృద్ధికి కూడా రూ 78 కోట్లు ఖర్చుచేసారు

## శ్రమదాన ఉద్యమం

ఆంధ్రప్రదేశ్‌లో జనవరి 1, 1996 నుండి శ్రమదాన మహోద్యమం ప్రారంభమైంది గ్రామాల అభివృద్ధికి ఎన్నుకున్న ఉద్యమంలో ప్రజాప్రతినిధులు, విద్యార్థులు, అధ్యాపకులు ఉద్యోగులు, మహిళా, యువజన సంఘాలు శ్రమదాన ఉద్యమం ద్వారా గ్రామలలోనున్న సమస్యల పరిష్కారానికి కృషిచేస్తున్నారు. శ్రమదాన కార్యక్రమాల ద్వారా షెడ్యూల్డు కులాల బస్తీలోనున్న సమస్యలు ముఖ్యరోడ్లు పరిశుభ్రత కార్యక్రమాలు చాలావరకు తీరుతున్నాయి. ఆ సందర్భంగా వచ్చిన వీరికి సంబంధించినవి చాలావరకు నోడల్ అదికారుల ద్వారా అక్కడక్కడే పరిష్కార మవుతున్నాయి. స్వయంకృషికి మించిన సహాయంలేదని శ్రమదానం కార్యక్రమం నిరూపించింది.

రాష్ట్రంలో షెడ్యూల్డు కులాలవారికి కమ్యూనిటీ హాళ్ళు నిర్మాణం కొరకు 1994-95 రూ 1.50 కోట్లు మంజూరు చేశారు. అదేవిధంగా 930 అంబేద్కర్ భవనాల నిర్మాణాన్ని మంజూరు చేయగా వాటిలో చాలావరకు పూర్తికావచ్చాయి. వృద్ధాప్య ఫించన్లు 2, 75,000 మంది షెడ్యూల్డు కులాల వారికి కేటాయించారు. 66,000 వితంతు ఫించన్లు కూడా మంజూరు చేస్తున్నారు.

ఈ విధంగా షెడ్యూల్డు కులాల అభివృద్ధి కొరకు ఆంధ్రప్రదేశ్‌లో అనేక కార్యక్రమాలు అమలు చేస్తున్నారు. వీరిలో అక్షరాస్యత తక్కువగా వుండడం వలన ప్రభుత్వం అందిస్తున్న సేవలను అందుకోలేకపోతున్నారు. కనుక వీరిలో విద్యా ప్రమాణాలను పెంచాలి. ముఖ్యంగా మహిళలను విద్యావంతులుగా చేయవలసిన అవశ్యకత ఎంతైనా వుంది. ఇంకా సుదూరు ప్రాంతాలలోనున్న గ్రామాలకు రాష్ట్ర సంక్షేమ పథకాలు ప్రచారం చేయడంలేదు. అందుకు రాష్ట్ర ప్రభుత్వ అధికారులు, నాయకులు, స్వచ్ఛంద సంస్థలు శ్రద్ధ వహించి షెడ్యూల్డు కులాలకు చెందిన వారి బ్రతుకుల్లో కాంతిరేఖను ప్రసరింప చేయవలసిన ఆవశ్యకత ఎంతోవుంది. అందుకు కొన్ని సంస్థలు, వ్యక్తులు నిర్విరామకృషి సల్పుతున్నారు. వీరి కృషి ఫలిస్తుందని ఆశిద్దాం. ★

# గిరిజనులకు విద్య మిధ్యేనా?

-డాక్టర్ కె. రామానుజరావు

(విదేశీ దాస్య శృంఖలాల నుండి విముక్తి పొంది చూస్తుండగానే యా వసంతాలు ఇట్టే గడచిపోయాయి. పరాయి పాలనలో అభివృద్ధి అసాధ్యమని స్వపరిపాలన మనదైన శైలిలో అభివృద్ధి సాధిద్దామని ఎందరో త్యాగమూర్తులు తమ ప్రాణాల తృణప్రాయంగా అర్పించారు. అట్టడగు, పీడిత, తాడిత, వెనుకబడిన ప్రజానీకం కోస ప్రపంచంలోని అతి పెద్ద లిఖిత రాజ్యాంగాన్ని రాసుకున్నాం. సమాజంలో ఉన్న నిమ్న జాతులను ఉద్ధరించటమే ధ్యేయంగా అంబేద్కర్ సామాజిక న్యాయం కోసం అనేకసా పలవరించాడు. ఈ నేపథ్యంలో బాగా వెనుకబడిన వారుగా గుర్తించబడిన గిరిజ సమాజాల వికాసం ఎంతవరకు జరిగింది. ప్రత్యేకంగా విద్యా విషయకంగా మన సాధించిన ప్రగతి ఏమిటని ప్రశ్నించుకున్నప్పుడు ద్యోతకమయ్యే విషయాల చర్చించుకుందాం.)

ఇతర సామాజిక, ఆర్థిక అంశాల వలెనే గిరిజనులు విద్యారంగంలో వివి దశలలో ఉన్నారు. మొత్తం మీద గిరిజనుల జీవితాలపై విద్యారంగం ప్రభావం అంతం మాత్రమే. ప్రభుత్వం గతంలో అనుసరించిన విధానాల వల్ల గిరిజన ప్రాంతాల్లో విద్యపై ఏ మాత్రం కృషి జరుగలేదు. 1950కి ముందు గిరిజనులను విద్యావంతులను చేయటాని ఏ మాత్రం కృషి జరుగలేదు. అంతకుముందుకూడా గిరిజనులను విద్యావంతులన చేయటానికి ప్రత్యేక పథకమంటూ ఏమి లేదు. రాజ్యాంగాన్ని అమలు చేయడం ప్రారంభించిన తరువాత షెడ్యూల్డు తెగలను విద్యావంతులుగా చేయడం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రధాన బాధ్యతగా మారింది.

జనాభా లెక్కల సేకరణ ద్వారా లభ్యమైన సమాచారాన్ని బట్టి గిరిజనుల్లో విద్యావ్యాప్తి ఎంత దయనీయంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. 1931 జనాభా లెక్కల ప్రకారం దేశంలోని గిరిజనుల్లో 0.7 శాతం అది 11 శాతానికి పెరిగింది. దేశంలో సగటు అక్షరాస్యత 1981 నాటికి 36 శాతం కాగా అది 1991 నాటికి 524 శాతానికి పెరిగింది. కాని గిరిజన అక్షరాస్యత శాతంలో మార్పులేదు. గిరిజన మహిళల్లో అక్షరాస్యుల సంఖ్య మరీ తక్కువని వేరే చెప్పనవసరం లేదు. కొన్ని రాష్ట్రాలలోని గ్రామాల్లో 100 శాతం నిరక్షరాస్యత నేటికి కొనసాగుతోంది. మొత్తం మీద గిరిజనుల్లో విద్యావాప్తి చాలా దయనీయంగా ఉంది. ఈశాన్య ప్రాంతంలోని కాసి, గారో వంటి గిరిజన తెగల్లో మాత్రం విద్యావ్యాప్తి సంతృప్తికరంగా ఉంది. క్రైస్తవ మత ప్రచార సంస్థలవల్ల ఈ తెగల వారు లబ్ధిపొందారు. గిరిజనుల్లో ఈ కాస్త

అక్షరాన్యత శాతానికి కారణం ఈశాన్య రాష్ట్రాలే. అవకాశాలు సమానంగా వినియోగించుకోవడం విద్య ద్వారానే సాధ్యం. విద్యారంగంలో గిరిజనులు వెనుకబడి ఉండడం వల్ల వారు అవకాశాలను సద్వినియోగం చేసుకోలేకపోతున్నారు. ఈ పరిస్థితికి గల కారణాలను పరిశీలించాల్సి ఉంది.

**సాంఘిక కారణాలు** : అధికంగా ఆర్థిక వనరులు కేటాయించినంత మాత్రాన కొత్తగా పాఠశాలలు తెరచినంత మాత్రాన గిరిజనులు విద్యావంతులు కాలేరు. ఈ విషయంలో సాంఘిక కారణాలు ప్రగాఢమైన ప్రభావాన్ని చూపుతాయి. తమ సామాజిక బాధ్యతలు నిర్వహించడానికి గిరిజనులకు విద్య లేకపోవడం అడ్డుకాదు. అందుచేత వారి చేత విద్య అవసరాన్ని గుర్తింప చేయడానికి వారిని మూఢ విశ్వాసాల నుంచి తప్పించడానికి ప్రత్యేక కృషి జరగాలి. ఈశాన్య భారతంలోని గిరిజన తెగల్లో తప్ప మిగిలిన తెగల్లో ఇప్పటికి చదువుకుంటే తమ మగపిల్లలు ఎదురు తిరుగు తారని, ఆడపిల్లలు ఆధునికంగా తయారై చెడిపోతారన్న అభిప్రాయం ఉంది. విద్యావంతులైన కొంతమంది గిరిజన యువకులు ఉద్యోగాలు రాగానే తమ తెగల వారిని వదలి వెళ్ళిపోవడం, తల్లిదండ్రులకు దూరం కావడం గిరిజనులకు నచ్చడం లేదు. అందువల్ల కొన్ని గిరిజన తెగలు తమ పిల్లలు విద్యావంతులు కావడానికి ఇష్టపడడం లేదు. విద్య ప్రారంభించిన తర్వాత మధ్యలోనే విద్య ఆగిపోవడం వలన వారు గిరిజన సమాజంలో తల్లిదండ్రులకు భారంగా తయారవుతున్నారు. గిరిజనుల్లో మూఢ విశ్వాసాలు ఆచారాలు కూడా విద్యవ్యాప్తికి ఆటంకంగా ఉన్నాయి. దూర ప్రాంతాల పాఠశాలలకు తమ పిల్లలను పంపిస్తే తమ దేవతలకు ఆగ్రహం వస్తుందని గిరిజనుల విశ్వాసం.

**పాఠశాలల కొరత** : ఇళ్ళు దూరదూరంగా ఉండటం, స్కూలు అందుబాటులో లేకపోవడం, పాఠశాల భవనాలు లేకపోవడం, సగం కూలిపోయి పైకప్పు లేని భవనాలు గిరిజన పాఠశాలలుగా చలామణి చేస్తున్నందువల్ల చదువుకోవడానికి విద్యార్థులు ముందుకు రావడంలేదు.

**ఆర్థిక కారణాలు** : గిరిజనులు విద్యపట్ల ఆసక్తి ప్రదర్శించకపోవడానిక పలు ఆర్థిక కారణాలు కూడా ఉన్నాయి. చాలామంది గిరిజనులకు రెక్కాడితేగాని డొక్కాడదు. అందువల్ల తమ సంతానాన్ని వారు పాఠశాలలకు పంపించలేరు. అలా పంపించి జీవన పోరాటానికి వినియోగించుకునే రెండు ఆరోగ్యకరమైన హస్తాలను వదలుకోవడం వారికి ఇష్టం ఉండదు. గిరిజనుల్లో వయసు వచ్చిన బాలుణ్ణిగాని , బాలికనుగాని పాఠశాలకు పంపించడం అనేది ఆర్థికపరమైన నిర్ణయం. సంప్రదాయంగా వస్తున్న శ్రమ విభజన దెబ్బతీయడ వవల్ల చాలామంది గిరిజనులు తమ పిల్లలను పాఠశాలకు పంపించే పరిస్థితుల్లో లేరు అని వెరియర్ ఎల్విన్ 1963లోనే ఎంతో చక్కగా వివరించారు.

గిరిజనుల్లో విద్యావ్యాప్తి గురించి అధ్యయనం చేసిన ఎల్. ఆర్.ఎన్. శ్రీవాస్తవ (1968) సైతం గిరిజనుల పేదరికం విద్యావ్యాప్తికి పెద్ద అవరోధంగా ఉన్నట్లు పేర్కొన్నాడు. గిరిజనుల వద్ద సంవత్సరానికంతకూ సరిపడే ఆహారం ఉండదు. ఆహారాన్ని సేకరించిన, వేటాడుతున్న , పోడు వ్యవసాయం చేస్తున్న, స్థిర వ్యవసాయం చేస్తున్న వారి దృష్టిలో విద్య అనేది విలాసం. పాఠశాలకు వెళ్ళే వయసులో ఉన్న పిల్లలు తమ ఆహార అవసరాలు తీర్చుకోవడమే కాకుండా కుటుంబ అవసరాలు తీరుస్తారు. పిల్లలను బడికి పంపినట్లయితే ఆ కుటుంబానికి అందించే సహాయం లేకుండా పోవడమే కాకుండా తల్లిదండ్రులు వారి ఆలనాపాలనా ఆహార అవసరాలు కూడాతీర్చవలసి ఉంటుంది. ఇది గిరిజనుల కుటుంబంపై పడే అపారమైన భారం. ప్రస్తుత, విద్యావిధానం వల్ల పది, పదిహేను సంవత్సరాలు గడిస్తే తప్ప విద్య వల్ల కుటుంబానికి ఫలితాలు లభించవు. ఈ విద్యా సమయం మొత్తానికి ఆర్థికంగా కుటుంబానికి జరిగే లోటు కొంతమేరకు వివిధ పథకాల ద్వారా పూడేటట్లు ప్రభుత్వాలు వివిధ చర్యలు తీసుకోవాలి. విద్యనేర్పడం వల్ల వెంటనే ప్రయోజనం ఉంటే గిరిజములను ఒప్పించడం సాధ్యమవుతుంది. అందుకోసం విద్యాస్థాయి ననుసరించి వివిధ ఉపాధి అవకాశాలు విరివిగా లభించేటట్లు చూడాలి.

**పాఠశాల విద్యపట్ల అనాసక్తి :** బి.డి. శర్మ ప్లానింగ్ ఫర్ ఎడ్యుకేషన్ డెవలప్‌మెంట్ ఇన్ ట్రైబల్ ఏరియాస్ (1977) లో పేర్కొన్నట్లు పట్టణ పారిశ్రామికి అవసరాలు తీర్చు ప్రస్తుత విద్యా విధానం మొత్తం జాతి మీద రుద్దబడింది. విద్యారంగంలోని నిర్మాణ క్రమం పాఠ్యాంశాలు మధ్య తరగతికి మాత్రమే అనుకూలంగా ఉన్నాయి. మిగతా ప్రజలు నేర్చుకునే విద్యనే గిరిజనులపై రుద్దడం వల్ల భిన్న సంస్కృతి నుండి వచ్చిన గిరిజనులకు ఈ అంశాలు వారిలో ఆసక్తిని రేకెత్తించవు. శాస్త్ర సాంకేతిక ప్రగతి, అధునిక రథసారథులు, చరిత్ర, భూగోళం మొదలైన అంశాలు దాదాపు అన్ని పాఠ్యాంశాలలోను ఉండవలసిందే. అయితే గిరిజన అవసరాలకు తగిని విధంగా వారి జనాభా వివరాలు, వారి చరిత్ర, పరిసరాలు ఇరుగు, పొరుగు వారి రాష్ట్రం గురించి బోధిస్తే సబబుగా ఉంటుంది. జాతీయ చైతన్యం బయట నుండి రుద్దడం తగిన పద్ధతి కాదు. అయితే ఈ చైతన్యాన్ని క్రమబద్ధంగా వారిలో కలిగించాలి. ఎల్.ఆర్.ఎన్. శ్రీవాస్తవ (1968) మాటల్లో చెప్పాలంటే ఆధునిక నాగరికతకు దూరంగా నివసించే బాలలకు భూగోళం, దేశ చరిత్ర వివరిస్తే వారు దానిని సరిగా జీర్ణించుకోలేరు. పారిశ్రామిక, సాంకేతిక అభివృద్ధి గురించి కాలం చెల్లిన ప్రముఖుల గురించి సమాచారం అందచేస్తే వారు దానిపట్ల ఆసక్తిని ప్రదర్శించకపోవచ్చు. అందువల్ల గిరిజన బాలలకు ఇరుగుపొరుగు తెగల గురించి అతని గ్రామ జీవితం గురించి, సామాజిక వ్యవస్థల, కర్మకాండ, విశ్వాసాల గురించి తెలియచేయాలి. ఈ తరువాత క్రమంగా జాతీయరంగం భారతదేశం గురించి తెలియచేయాలి. అప్పుడే గిరిజన బాలలకు తమ గ్రామంలో, రాష్ట్రంలో, దేశంలో, ప్రపంచంలో ఏం జరుగుతుందో అవగతమవుతుంది.

భారతదేశంలో విద్యారంగం భవిష్యత్ అవసరాలు దృష్టిలో పెట్టుకోకుండా గజిబిజిగా అభివృద్ధి చెందిందన్న అభిప్రాయంతో దాదాపు అందరు ఏకీభవిస్తారు. గిరిజన విద్యకూడా ఇదే పరిస్థితిని ఎదుర్కొంటోంది. పాఠశాల విద్య పట్ల గిరిజనుల నిర్లిప్తత అనాసక్తి ప్రదర్శించడం వల్ల గిరిజనులలో విద్యా వ్యాప్తికి జరిగిన ప్రయత్నాలు ఘోరంగా విఫలమయ్యాయి. ఎస్.ఎన్.రథ్ (1981) ఒక పథకాన్ని సూచించారు.

1. సంప్రదాయ గిరిజన వ్యవస్థలో బాలుడు ఆత్మవిశ్వాసంతో పెద్దవాడవుతాడు. తన పరిసరాల గురించి క్షుణ్ణంగా అతనికి తెలుసు. ఇల్లు కట్టుకోవటం, పొలాన్ని సాగు చేయడం, వస్త్రాలు నేయడం మొదలయినవి అతనికి తెలుసు. అంటే తన సంస్కృతి ప్రకారం సుఖంగా జీవించడం తెలుసు. అందుచేత స్థానిక అవసరాలు తీర్చే పాఠ్యాంశాలు బోధించాలి.

2. పాఠశాలల్లో గిరిజనుల కార్యకలాపాలైన వ్యవసాయం, నృత్యం, వేట, గిరిజన క్రీడలు, బాణాలు వేయడం వంటి కార్యకలాపాలకు పూర్తి ప్రోత్సాహం కల్పించాలి.

3. పాఠశాల ఉపాధ్యాయుడిని, గిరిజన బాలల తల్లిదండ్రులను, గిరిజన కార్యకలాపాలను అనుసంధానం చేసే పథకాలు ఉండాలి.

4. పాఠశాల గిరిజన సమాజానికి చిన్న చిన్న సాంకేతిక పరిజ్ఞానాలను అందచేసే కేంద్రంగా రూపొందించాలి. గిరిజన పాఠశాలలు కేవలం చదవటం, రాయటం నేర్పే కేంద్రాలు కారాదు. అవి సామాజిక మార్పుకు ప్రేరణ శక్తులుగా పనిచేయాలి. అధ్యాపకునికి, తల్లిదండ్రులకు మధ్య నిరంతరం అనుసంధానం ఉండటం వల్ల గిరిజన విద్యార్థులకు అవసరమైన విద్యను బోధించే సరైన వాతావరణం ఏర్పడుతుంది. ఆ విధంగా విద్యార్థులకు, రాజకీయ, ఆర్థిక, సామాజిక నేపథ్యాన్ని అవగాహన చేసుకునే శక్తి కల్పించవచ్చు.

5. ఇటువంటి ఆదర్శ విద్యావిధానం అమలు చేయటానికి నిబద్ధత అంకిత భావం కలిగి సరైన శిక్షణ పొందిన అధ్యాపకులు అవసరం అని వేరే చెప్పనక్కరలేదు.

పాఠశాలలను ఆయా పరిసర ప్రాంతాలలో దొరికే కలపతో గిరిజనులే నిర్మించేటట్లు చేసి వారికి ఉపాధి కల్పించాలి. బాగా తక్కువ అక్షరాస్యత కలిగిన గ్రామాలను గుర్తించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. అదే విధంగా గ్రామస్థులు విద్యాలయాన్ని తరచుగా సందర్శించటానికి చిన్న చిన్న సాంస్కృతిక కార్యక్రమాలు జరపాలి. విద్యను ప్రత్యేక అంశంగా అభివృద్ధి చేయలేము. అందుకని మిగతా అంశాలలో కూడా అభివృద్ధి సాధించాలి.

సంక్షేమ కార్యక్రమాలను, విధాన నిర్ణయాలను పకడ్బందీగా ఒక వ్యూహంతో అమలు పరిస్తే తప్ప గిరిజన అభివృద్ధి తద్వారా దేశాభివృద్ధి సాధించలేము.

*

# గిరిజనాభివృద్ధి - ఒక పరిశీలన

-డా॥ ఎల్.ఎస్. ఎస్.ప్రసాద్

భారత దేశంలోని గిరిజనులు ఆదిమ తెగలవారు. నేటి ఆధునికి భారత సాంప్రదాయాలకు, సంస్కృతికి ఆద్యులు ఆనాటి గిరిజనులే. భారత దేశంలో 1991 జనాభా లెక్కల ప్రకారం 8.87 కోట్ల మంది గిరిజనులుండగా మొత్తం జనాభాలో వారిశాతం 8శాతం. అయితే ఈ గిరిజనులలో ఎక్కువ శాతంమంది మధ్య మరియు ఉత్తర గిరిజన ప్రాంతాలలో ఉండటం విశేషం. ఈ గిరిజనులున్న ప్రాంతాలు అటవీ వనరులతోనే కాకుండా వివిధ రకాల ఖనిజాలలో నిండి ఉన్నాయి. వీరిని అనేకమంది మధ్య దళారీలు, కాంట్రాక్టర్లు, అధికారులుదోచుకోవటంతో వీరి అభివృద్ధికి ఉద్దేశించిన పథకాలు వీరి దరికి చేరకపోవడంతో వీరి ఆర్థికా సాంఘికాభివృద్ధి ప్రభుత్వాలకు ఒక సమస్యగా తయారైనది.

ఈ గిరిజనులు ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడి యుండుటయేకాకుండా వీరు అభివృద్ధి కార్యక్రమాలకు దూరంగా ఉండటం వలన వీరి సామాజికాభివృద్ధి ప్రభుత్వాలకు అతి కష్టమైనది. అయితే కొంత మంది గిరిజనులు ఆధునిక వ్యవసాయ పద్ధతులను అనుసరించుచూ ఇతర పనులు చేసుకోవడం విశేషం. భారత ప్రభుత్వం 1957 బల్వంతరాయ్ కమిటీ సిఫార్సులమేరకు ఈ గిరిజనాభివృద్ధి కోసం 43 బహుళార్థక ప్రాజెక్టులను దేశంలో వివిధ ప్రాంతాలలో ఏర్పాటు చేసారు. ఆ తరువాత మూడవ పంచవర్ష ప్రణాళికలో గిరిజనాభివృద్ధి బ్లాకులు ఏర్పాటు చేసారు. అంతేకాకుండా 4వ ప్రణాళికలో 50 శాతం మించి గిరిజన జనాభా ఉన్న బ్లాకులను, మండలాలను ఎంపికచేసి వాటి అభివృద్ధికి ప్రత్యేక పథకాలు ఏర్పాటు చేసారు. దీనిలో భాగంగా రాష్ట్ర ప్రణాళికలో ద్రవ్యవనరులు కేటాయించడం, కేంద్ర ప్రభుత్వంలోని వివిధ మంత్రిత్వ శాఖలు ప్రత్యేక పథకాలు ఏర్పాటు చేయడం, సంస్థాగత ఋణాలు తక్కువ వడ్డీకి అందచేయడం మరియు కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక సహాయ పథకాలను ఏర్పాటు చేయడం వీటిలో ముఖ్యమైనవి.

సమస్యలు : గిరిజన జాతులు సాంఘిక ఆర్థికాభివృద్ధి అంత తేలిక కాదు. దీనికి ప్యూడల్ స్వభావంగల ఒక బలమైన వర్గం వ్యతిరేకిస్తుంది. దీనిని "8వ ప్రణాళికాముసాయిదా" గిరిజన జాతుల తాము ఆర్థికంగా, సామాజికంగా అభివృద్ధి జరిగినా వారే సామాజిక, సాంస్కృతిక వ్యవస్థలను పదిల పరచుకొన్నారని వివరించింది. వీరి అభివృద్ధికి మొదట తక్కువ పెట్టుబడి పెట్టినా ఉప పణ్రాళికలలో ఎక్కువ మొత్తాలను కేటాయించారు.

గిరిజనులకు నచ్చచెప్పి, వివరించి వారిని వివిధ అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేయాలి. దీనికి పెద్ద ప్రయత్నం జరగాలి.

రాజకీయ వ్యవస్థలోనికి వారి సమస్యలను తీసుకువచ్చినప్పుడే వారి అభివృద్ధి సాధ్యమగును. దానికోసం పారిశ్రామికీకరణ ద్వారా గిరిజన ప్రాంతాలను అభివృద్ధి చేయాలనే ప్రయత్నం అనేక సమస్యలను తెచ్చి పెట్టింది. అంతేకాకుండా గిరిజనాభివృద్ధి ముఖ్యంగా భూ

వనరులకు సంబంధించింది. ఈ విషయంలో వారి సంస్కృతి పరిరక్షణే వారి ప్రధాన హక్కు అందువలన గిరిజన సంక్షేమ పథకాలు గిరిజనులలో మరింత అంతరాలను పెంచేవిగా ఉన్నాయి.

**వ్యవసాయభివృద్ధి :** గిరిజన స్థితిగతులు అభివృద్ధి చెందాలంటే వ్యవసాయాభివృద్ధి జరగాలి. ఈ విషయాన్ని 1961వ సంవత్సరంలో ఏర్పాటు చేసిన ధేబరీ కమిటీ కూడా చెప్పింది. అంతేకాకుండా గిరిజన ప్రాంతాలలో గ్రామీణ పరిశ్రమలు కూడా ఏర్పాటు చేయాలి. గిరిజనులకు బేరమాడే శక్తి తక్కువ కావున గిరిజన సహకార సంఘాలు ఏర్పాటు చేయాలని కమిటీ సూచించింది.

**ప్రణాళికా పెట్టుబడి :** మొదటి ప్రణాళికా మొత్తం పెట్టుబడి 1960 కోట్ల రూ॥లలో గిరిజనాభివృద్ధికే 19 కోట్ల రూపాయలు కేటాయించారు. ఇది మొత్తం పెట్టుబడిలో ఒక శాతం మాత్రమే. అయితే 6వ ప్రణాళికలో రూ 5,535 కోట్లకు పెరిగింది. దీని శాతం 5.7. ఏడవ ప్రణాళికలో 13,000 కోట్ల రూపాయిలు (8.1) 8వ ప్రణాళికలలో 15,000 కోట్ల రూపాయిలుగా ఉన్నది (7.2).

**సాధించింది :** సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాలలో భాగంగా 30 శాతం గిరిజన కుటుంబాలకు రుణాలను మంజూరు చేయాలని ప్రణాళికలు వేయగా 13.04 శాతం కుటుంబాలకే ఈ పథకం క్రిందకు తీసుకురావడం జరిగింది. జవహర్ రోజ్‌గార్ పథకంలో కూడా గిరిజనులకు ఎక్కువ పథకాలను ఇవ్వాలని సూచించారు. ఏడవ ప్రణాళికాంతంలో గిరిజన ఉపప్రణాళికలో భాగంగా 191 సమగ్ర గిరిజనాభివృద్ధి పథకాలు, 268 మాడా పథకాలు ఏర్పాటు చేసారు.

ఎనిమిదవ ప్రణాళికలో వర్కింగ్ గ్రూపువారు గిరిజనాభివృద్ధికి ఈ క్రింది సలహాలను ఇచ్చారు.

1. గిరిజనులకిచ్చే వ్యవసాయ రుణాలు, పండ్ల తోటలకిచ్చే రుణాలు, సామాజిక అడవులకిచ్చే రుణాలు గిరిజనాభివృద్ధి సంస్థల ద్వారా జరగాలి.
2. గిరిజన ప్రాంతాలను తెలుసుకొని, అక్కడి వాతావరణ పరిస్థితుల కనుగుణంగా పథకాలు - రచించాలి.
3. ఈ గిరిజన ప్రాంతాలకు తగినటువంటి వ్యవసాయంపై పరిశోధన జరగాలి.
4. చేపల పెంపకం, పట్టు పరిశ్రమ మొదలగునవి ఏర్పాటు చేయాలి.

అంతేకాకుండా గిరిజన మహిళలో అక్షరాస్యత అభివృద్ధి చేయటానికి 48 జిల్లాలలో విద్యాలయాలు ఏర్పాటు చేసారు. మరియు వయోజన విద్య కూడా జరపాలనీ, ఈ విషయంలో స్వచ్ఛంద సంస్థల సేవలను ఉపయోగించుకోవాలని సూచించారు.

గిరిజనులకు, అడవులకు విడదీయరాని సంబంధం ఉంది. అటవీ సంరక్షణ కూడా గిరిజనులపై ఆధారపడి యున్నది. అందువలన జాతీయ అటవీ విధానం కూడా గిరిజనులను దృష్టిలో ఉంచుకొని చేయాలి. అయితే గిరిజనాభివృద్ధి వారికి కేటాయించిన నిధులను బట్టి లెక్కించకూడదు. గిరిజనలు అభివృద్ధి జరిగిందా లేదా అనేది వారిలో వచ్చిన సామాజిక, ఆర్థిక మార్పులపై చూడాలి. గిరిజనాభివృద్ధికి దానికి సంబంధించిన ప్రభుత్వ శాఖల మధ్య సహకారం ఎంతో అవసరం. గిరిజన నివాస ప్రాంతాలలో రవాణా మరియు కమ్యూనికేషన్ సౌకర్యాలు ఏర్పాటు చేయాలి. పథకాలు వారి అవసరాలపై ఆధారపడి ఏర్పాటు చేయాలి అప్పుడే గిరిజనాభివృద్ధి సాధ్యమగును. అంతేకాకుండా అభివృద్ధి అనే పేరుతో వారి సామాజిక, సాంస్కృతిక కళలు నశింపకూడదు.

★

# గిరిజన విద్య : అవకాశాలు - నిర్బంధాలు

ప్రొఫెసర్ ఎస్.కె. అంబాస్ట్

**(వ్యక్తుల సాంస్కృతిక మూలం నుంచి అభివృద్ధికి ఒక సాధనంగా దోహదపడేది విద్య అంటున్నారు ఈ వ్యాస రచయిత ప్రొ॥ యస్.కె. అంబాస్ట్. ప్రస్తుతం గిరిజన బాలలకు కల్పిస్తున్న విద్య వారి జీవితావసరాలను తీర్చే విధంగా లేదు. గిరిజనుల అవసరాలకు అనుగుణంగా కనీస స్థాయిలో విద్య, సామాజిక విజ్ఞానాన్ని నేర్చుకునే విధంగా అధ్యయన క్రమాన్ని ఏర్పాటు చేయవలసిన ఆవశ్యకత ఎంతైన వున్నదని ఆయన వాదన)**

విద్య మనస్సును మరింత వికసింప చేస్తుందనేది వాస్తవం. అది ప్రామాణిత, పరిమాణాలను కూడా పెంపొందిస్తుంది. ఆవిధమైన ప్రోద్బలం మరో విధంగా చేకూరదు. "వ్యక్తిత్వ వికాసాన్ని ప్రోత్సహించి మార్గదర్శనం చేయడమే విద్య లక్ష్యం" అనేది వైట్ హెడ్ (1949) అభిప్రాయం. విద్య అనేది మన ఆర్థిక, మేధాసంపత్తి, సామాజిక ఆధ్యాత్మికతలను పెంపొందించే విధంగాను, మన జీవన సరళికి అనుకూలంగా అర్థవంతమైనదిగా వుండాలి. మన నైతిక విలువల నుంచి విద్య ఉద్భవించాలి. అది వివిధ రకాలుగా సహకరించి నిలిచిపోవాలి. వ్యక్తులు ఏ సామాజిక వ్యవస్థలో సహజీవనం గడుపుతున్నారో ఆ సామాజిక సంస్కృతికి అద్దంపట్టే విధంగా సామరస్య పూర్వమైన అభివృద్ధికి దోహదపడేదే వాస్తవికమైనన విద్య.

విద్యకు సంస్కృతికి అవినాభావ సంబంధం వున్నందున ప్రధానంగా గిరిజనప్రాంతాలలో మానవ సంతతికి సంబంధించిన విజ్ఞాన శాస్త్ర పరమైన దృక్పథంతో విద్యా విధానాన్ని పరిశీలించవలసిన అవసరం వుంది.

వ్యక్తికి, అతని పరిసరాలకు మధ్యగల పరస్పరానుబంధం మధ్యగల విద్యావిధానంలో ప్రధాన పాత్ర వహిస్తోంది.

వ్యక్తికి, అతడు వున్న సాంస్కృతిక వాతావరణం మార్గ దర్శకత్వం నెరుపుతుంది. అందువల్ల విద్య సంస్కృతిపై ఆధారపడి వుండటమేకాక, సంస్కృతి అధ్యయనంతో ముడిపడి ఉంది.

భారతదేశంలో గిరిజన సంఘాలు స్పష్టమైన సాంస్కృతిక గుర్తింపు కలిగి వున్నాయి. గిరిజనులు, గిరిజనేతరుల సంస్కృతుల మధ్య తేడాలు సహజం కావి

గిరిజనులలో తెగలు వేటికవి సాంస్కృతిక పరమైన వ్యత్యాసాలు విద్యా ప్రణాళికల రచనలో, వాటి విధానాలలో ప్రధాన పాత్ర వహిస్తాయి.

ఏ సమాజంలోనైనా ఒక శిశువు పెరుగుదల సామాజిక అభివృద్ధితో ముడిపడి వుంటుంది. ఈ పరిణామ క్రమంలో శిశువు మొదట భాషను నేర్చుకోవాల్సి వుంటుంది. ప్రధానంగా కుటుంబ సభ్యులు, ఆపైన చుట్టుపక్కలవారు మాట్లాడే భాషను నేర్చుకుంటారు. క్రమంగా ప్రాపంచిక వ్యవహారాలు విస్తరిస్తున్న క్రమంలో 'తల్లి నుంచి కుటుంబ వ్యవస్థకు, ఆ తరువాత ఇరుగు పొరుగుతో ఆ శిశువుకు సంబంధాలు విస్తరిస్తాయి. దానితోపాటే శిశువు మాట్లాడే భాషకూడా వ్యక్తిగత అవసరాల నుంచి కుటుంబ అవసరాలు, పరిసరాల అవసరాలు, సామాజిక అవసరాలకు తగినట్లుగా క్రమంగా పెరుగుతూ వుంటుంది. సామాజిక పరిక్రమణంలో నేర్చుకునే ఆ పదాలే ఆ శిశువు తాను అర్థం చేసుకోగల భాషా పరిజ్ఞానానికి ప్రాతిపదిక అవుతాయి.

గతంలో గిరిజన సంఘాలు ఒకదానితో ఒకటి ఏ విధమైన సంపర్కంగాని, సమాచార సంబంధాలుగాని లేని సంఘాలుగా వుండేవి. అందువల్ల వాటిలో హెచ్చుశాతం రాసే భాషను (లిపి) అభివృద్ధి చేయలేకపోయాయి. కేవలం వారి అవసరాలు మాట్లాడ్డం (మౌఖిక భాష) ద్వారానే తీర్చుకొనేవారు.

అంటే వారికి లిఖిత పూర్వకమైన భాష లేకున్నా, నిర్దిష్టమైన వ్యాకరణం, భాషా నిర్మాణం వుండేవి. భారతదేశంలో చాలా గిరిజన తెగలు అబోర్స్, మోనుడ్, కుకి, జ్వాల్‌బుక్, నాగా, మెరుంగ,గారో, నోకవంటి, బరాన్, దుంకురియా, గోండు, గోటుల్ మొదలైన పేర్లతో పిలవబడే తమ పురాతన సంస్థల ద్వారానే విద్యావసరాలు తీర్చుకొనేవారు. ఈ సంస్థలు ఆయా తెగలలోని యువతను 'సామాజిక ప్రయోజనం కలిగిన' ఉత్పాదక సభ్యులుగా తయారు చేసేవి. మన ప్రస్తుత ఆధునిక విద్యా విధానాలు కూడా ఇదే విధమైన పాత్రను నిర్వహిస్తున్నాయి. ఈ రచయిత ('1970) లో ఈ పురాతన సంస్థల పనితీరు గురించి 'నేర్చుకునే ప్రక్రియ' పై ఆధునిక మానసిక శాస్త్రవేత్తలు ప్రతిపాదించిన వివిధ సిద్ధాంతాలననుసరించి సమగ్రమైన విశ్లేషణ చేశారు. ఈ పురాతన సంస్థలు అనుసరించిన పద్ధతులలో పటిష్టమైన సిద్ధాంత ప్రాతిపదిక వున్నట్లు రచయిత కనుగొన్నారు. ఈ సిద్ధాంతీకరణను చరిత్ర కాలక్రమ పద్ధతిలో చూస్తే దానిని అనుసరిస్తున్న సంస్థలకన్నా ఆధునికమైనదిగా తేలింది.

ఈ సంస్థలు అక్షరాస్యత లేకుండానే విద్యా విధులను నిర్వమిస్తున్నాయి. గిరిజన సమాజాలు చాలా వరకు ఇతర ప్రపంచంతో సంబంధంలేనివి కావడంచేత వారు లిపి

అవసరమని భావించలేదు. కాని వారికి భావాపరమైన నైపుణ్యం వుంది. గిరిజన సంఘాలలో ఆధునిక విద్యనభిమానించేవారు మాత్రం ఈ పురాతన సంస్థలను తృణీకరించారు. ఈ సంస్థలు అక్షరాస్యతావసరాలు (రాయడం, చదవడం) తీర్చడం లేదని వారి వాదన. కనీసం ప్రస్తుత ఆధునిక విద్యా పద్ధతులలో వాటిని అనుసరించడానికి గల అవకాశాలను పరిశీలించడాలనికి కూడా వారు ప్రయత్నించలేదు. విద్య మంచిదైనా కావచ్చు. అది చాలా వరకు చదువునేర్పేవారి గుణగణాలు, విజ్ఞత, తెలివితేటలపై ఆధారపడి వుంటుంది. మంచి, చెడు, గుణగణాలు అనేవి సంస్కృతితో ముడిపడి వున్న విలువలని గుర్తించాలి. ఒకరికి 'మంచివి', 'ఉత్తమ గుణాలు' గా కనుపించేవి మరికొందరికి అలా కనిపించక పోవచ్చు.

కాలక్రమేణ 'మేము', 'వారు' అనే వ్యత్యాసాలు ఇతరులతో రాజీపడి జీవిస్తున్నట్టు భావించే వైఖరికి దానితీసాయి. ద్వేషం బదులు సానుభూతి చోటు చేసుకుంది. "మేము" 'అనుకునే వర్గం "వారి"కి ప్రాతినిధ్యం వహించే బాధ్యతను తనకు తానుగా నెత్తిన వేసుకుంది. "వారి" అవసరాలను బట్టి ఆ వర్గాలకు 'రక్షకులుగా' లేదా వారిపట్ల 'సానుభూతిపరులు'గా వుండే వైఖరిని అవలంభించింది. గిరిజనుల సాంస్కృతిక చరిత్ర, ఆ సంస్కృతికి అనుగుణంగా వారికి వుండే అవసరాలను పరిగణించకుండా, 'మన విద్యా పద్ధతులను 'వారి'పై బలవంతంగా రుద్దే తొందరపాటు చర్యలకు పూనుకోవడం ఇటువంటిదే!

'మనవిద్య', వారి విద్య'ల మధ్య వ్యత్యాసం వుందని వారి విద్య రెండవ తరగతికి చెందినదని వాదించేవారు (గిరిజనులకు) అనువైన విద్యను ప్రవేశపెట్టడంలో అవరోధంగా నిలుస్తున్నారు.

మారుమూల గ్రామాలలో నివసిస్తున్న వారికి ఈ విషయాలపై మాట్లాడే అవకాశమే వుండదు. గిరిజనులకు తమను తామే "ప్రతినిధులు"గా భావించుకునేవారే గిరిజనుల తరపున మాట్లాడతారు, నిర్ణయాలు తీసుకుంటారు. సామాన్యంగా వీరు గిరిజన సంస్కృతితో సంబంధాలు తెగిపోయినవారై వుంటారు. ఈ రెండు వర్గాల అభిప్రాయాలలో వ్యత్యాసాలు వున్నాయని రచయిత జరిపిన అధ్యయనం వలన వెల్లడైంది.

విద్యావిధానంలో అక్షరాస్యతా నైపుణ్యం ఒక సాధనంగా రూపుదిద్దుకుంది. సమాచారాన్ని తెలియచేయడానికి అత్యావశ్యకమైంది పరస్పర మాటల ద్వారా సమాచారాన్ని అందచేసుకొనే వీలులేని పరిస్థితుల్లో అక్షరాస్యత కలిగి వుండడం ఎంతగానో తోడ్పడుతుంది.

ప్రస్తుత విద్యా వ్యవస్థలో అభిప్రాయాలు తెలుసుకొనేందుకు. (అవగాహన పెంచే) జ్ఞానం, నైపుణ్యం పెంపొందించుకోవడానికి పుస్తకాలు దోహదపడుతున్నాయి. ఏ సమాజంలోనైనా విద్య ప్రధానమైన సూచికగా వుంది. అక్షరాస్యత సులభంగా కొలవగలిగినది. అందువల్ల అక్షరాస్యతా శాతాన్ని సమాజంలో అభివృద్ధికి కొలమానంగా తీసుకుంటున్నారు.

1991 జనాభా లెక్కల ప్రకారం భారతదేశ జనాభాలో అక్షరాస్యతా శాతం 52.11 వుంది. వాటిలో పురుషుల శాతం 63.83 మహిళల శాతం 39.92 వుంది. గిరిజన జనాభాలో 29.6 శాతం అక్షరాస్యులు వున్నారు. వీరిలో 40.65 శాతం పురుషులు కాగా 18.19 శాతం మహిళలు. గిరిజనులందరికీ విద్య జరపాలంటే చాలాకాలం పడుతుంది. సంపూర్ణ అక్షరాస్యత అటుంచి కొద్ది సంఖ్య మేర్కైనా వారిని అక్షరాస్యులను చేయాలంటే సమయం పడుతుంది.

రాజ్యాంగంలోని 46వ అధికరణ బలహీన వర్గాల ప్రజలు ప్రధానంగా షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగల వారికి ప్రత్యేక శ్రద్ధతో విద్య, ఆర్థిక ప్రయోజనాలను కల్పించాలని నిర్దేశించింది.

రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల ప్రకారం పెక్కు పథకాలు కార్యక్రమాలను రూపొందించి ప్రోత్సాహకాలను ఇచ్చి అమలు చేస్తున్నారు. ఆర్థిక సహాయం, ఆశ్రమ పాఠశాలను నెలకొల్పడం, బాలబాలికలకు వసతిగృహాలను ఏర్పాటు చేయడం వంటి చర్యలు చేపడుతున్నారు. సార్వత్రిక ప్రాథమిక విద్యావ్యాప్తికి అవరోధంగా పరిణమిస్తున్న గిరిజన బాలల (ముఖ్యంగా గిరిజన బాలికల) పట్ల విద్యా ప్రణాళికా వేత్తలు ప్రత్యేకమైన శ్రద్ధ చూపుతున్నారు. గిరిజన బాలల విద్యాభివృద్ధి విషయంలో వెనుకబాటుతనానికి గల కారణాలపై పలు అధ్యయనాలు నిర్వహించారు.

ఈ రచయిత 1963-65 లో గిరిజనుల విద్యా విషయాలలో గల సమస్యలను సమగ్రంగా పరిశీలించారు. గిరిజన ప్రాంతాలలో విద్యావ్యాప్తికి జరుగుతున్న కృషిలో వైఫల్యాలకు, విజయాలకు సామాజిక పరమైన కారణాల గురించి ఈ పరిశీలన జరిపారు. ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహార్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలోని గిరిజనులలో వివిధ వర్గాల విద్యార్థుల సమస్యలు, వారి ప్రగతిపట్ల ఈ అధ్యయనాలు జరిగాయి. గిరిజనుల విద్య విషయంలో సమస్యలకు కారణాలు కనుగొన్నా వాటి పరిష్కారానికి చాలా కొద్దిగానే కృషి జరిగిందని ఈ అధ్యయనాల ద్వారా గుర్తించారు. 1961-93 మధ్య కాలంలో గిరిజనుల విద్యా వ్యాప్తి గురించి పరిశీలిద్దాం.

నమోదు :

విద్యావ్యాప్తికి ప్రధానమైన కొలమానం పాఠశాలల్లో 'నమోదు' అయితే అది ప్రతిసారి వాస్తవమైన కొలమానం కాకపోవచ్చు. నమోదు అయినంతమాత్రాన వారు విజయవంతంగా చదువు పూర్తి చేసినట్లు కాదు. విద్యను అందుబాటులో వుంచడానికి చర్యలు తీసుకుంటే విద్యా సౌకర్యాలు ప్రయోజనాలను పొందడానికి ప్రజలే ముందుకు వస్తారని తొలుత భావించారు.

ఇది ప్రాథమిక సౌకర్యాల కల్పనతో అభివృద్ధి జరుగుతుందనే పాశ్చాత్య ఆర్థికాభివృద్ధి లక్షణాన్ని పోలివున్న భావన. ఈ విధానం, ఆర్థిక అభివృద్ధిలోగాని, విద్యాభివృద్ధిలోగాని విజయవంతం కాలేదు.

1960-61, 1998-91లలో నమోదయిన వారి వివరాలు పరిశీలిస్తే సంఖ్యాపరంగా నమోదు పెరుగుదల గణనీయంగా వుంది. ఈ కాలంలో ప్రభుత్వం, ప్రణాళికలు-వాటి అమలులో ప్రజలకు విద్యను అందుబాటులోకి తేవడంపైనే దృష్టి కేంద్రీకరించింది. దాదాపు అన్ని గ్రామాలలో విద్యా సౌకర్యాలను అందుబాటులో వుంచింది. (ఐదవ అఖిల భారత విద్య సర్వే) దానితో పాటు నమోదు కార్యక్రమాన్ని ముమ్మరం చేసింది. అంతకు ముందు తెలిపినట్లుగా సౌకర్యాలు అందుబాటులో వుంచినట్లయితే ప్రజలు తమ పిల్లలను పాఠశాలలకు పంపవచ్చుననే భావన కూడా వుంది.

నమోదు నిష్పత్తి :

విద్యావ్యాప్తికి నమోదు నిష్పత్తికూడ మరొక కొలబద్దంగా వుంది.

నమోదు రేటు = నిర్ణీత వయోపరిమితికి చెందిన బాలలలో, పాఠశాలలో చేరిన సంఖ్య ÷ ఆ వయోపరిమితికి చెందిన మొత్తం బాలల జనాభా.

చాలా సంధర్భాలలో నమోదు నిష్పత్తి వందకంటే ఎక్కువగా వుండడం ఆసక్తిదాయకం. దీనికి కారణం నమోదైన బాలల గణాంక వివరాలు పరిశీలిస్తే, నిర్దేశించిన వయోపరిమితికి చెందిన వర్గాల బాలలు కూడా వాటిలో వుండడమే! ఉదాహరణకు ఒకటి నుండి ఆయిదవ తరగతి వరకు ఉన్నారు. అందువల్లనే ఈ నిష్పత్తి వందకు మించింది. ఈ నమోదులకు చెందిన వివరాలు పట్టిక -1 లో చూడవచ్చు.

## బడిమానివేసినవారిరేటు

నమోదుకు సంబంధించిన గణాంక వివరాలుగాని, నిష్పత్తికి సంబంధించినలెక్కలు గాని ఏ వర్గంగాని విద్యాహోదాను ప్రతిబింబించవు. షెడ్యూల్డు తెగలవారి విషయంలోనూ

అంతే. వాస్తవంగా ఒకటి నుండి అయిదవ తరగతి వరకు విద్యార్థులలో బడి మానేసేవారి రేటు ఎక్కువగా వుంటుంది. షెడ్యూల్డు తెగల బాలల విషయంలో ఇది మరీ ఎక్కువ.

మొత్తం భారతదేశ జనాభాలో ఒకటవ తరగతిలో చేరిన బాలలలో దాదాపు సగం మంది వరకూ ఐదవ తరగతిలోనికి వచ్చారనుకుందాం. ఈ పరిస్థితితో పోల్చిచూస్తే గిరిజన బాలల నమోదు, రేటు దాదాపు శూన్యంగా కనిపిస్తుంది. చాలా రాష్ట్రాలలో ఉత్తీర్ణులు కాకపోతే అదే తరగతిలో నిలిపివేసే డిటెన్షన్ విధానం లేకపోయినా ఇలా జరగడం ఆశ్చర్యకరం. మొదటి తరగతిలో నమోదయిన వారి సంఖ్యకు, రెండవ తరగతికి బదిలీ అయినవారి సంఖ్యకు మధ్య అంతరాన్ని పరిశీలిస్తే బూటకపు నమోదుల గురించి, లేదా మొదటి సంవత్సరంలోనే బడిమానేసే వారి గురించి ఒక అవగాహన ఏర్పడుతుంది.

మొత్తం మీద విద్యా సౌకర్యాల కల్పన నమోదుతో సార్వత్రిక ప్రాథమిక విద్యావ్యాప్తిలో లక్ష్య సాధన, సాధ్యమేననే ఊహాసౌధం పేకమేడలా కూలిపోతుంది. పొలాలలోను లేక ఇళ్ళలోను చిన్న చిన్న పనులు చేసే వయసు వచ్చేసరికి పిల్లలు బడిమానేసే రేటు పెరుగుతోంది. గిరిజన బాలలలో ఇది చాలా ఎక్కువగా కనిపిస్తోంది.

## కారణాలు

గిరిజన తల్లితండ్రులు తమ పిల్లలను ఆర్థికపరమైన ఆస్థిగా పరగణిస్తున్నారు. పెరుగుతున్న బాలుడు లేదా బాలికను పాఠశాలకు పంపించడాన్ని ఆర్థిక అంశంతో ముడిపెడుతున్నారు. సాంప్రదాయ సిద్ధమైన రీతిలో జీవనోపాధిని సంపాదించుకోవడానికి, పని భారాన్ని పంచుకోవడానికి వారు విద్యను అవరోధంగా భావిస్తున్నారు. బాలికలు తమ ఇళ్ళలో తల్లులకు అన్ని విధాల సహాయాన్ని అందిస్తున్నారు. వ్యవసాయ పనుల కాలంలో బాలలు తమ తల్లితండ్రులతోపాటు పొలాల్లో పని చేస్తారు. ఇతర కాలాలలో వారు తీరికలేకుండా అటవీ ఉత్పత్తులు, వంటచెరకు పరిరక్షణ, నీరు తీసుకురావడం, వేటాడి చేపలు పట్టడం లాంటి పనులలో నిమగ్నమవుతున్నారు.

"తమ పిల్లలు విద్యావంతులైతే కుటుంబానికి నష్టమని తల్లితండ్రులు భావిస్తున్నారు"

విద్యా కార్యక్రమాలు తమ అవసరాలకు సరిపోవకపోవడం వల్లనే తల్లిదండ్రులు తమ పిల్లలను పాఠశాలలకు పంపించడం లేదనేది ప్రధాన కారణమని గుర్తించారు. ఈ కారణాలే ఇప్పుడు కూడా వర్తిస్తాయి.

గిరిజన బాలలకు వారి మాతృ భాషలో బోధించడంలో ఏ విధమైన ప్రగతిని సాధించలేదు. ఉపాధ్యాయులు బయట ప్రాంతాల నుంచి వస్తారు. బాలల మాతృభాష వారికి తెలియదు. అపరిచిత వాతావరణాన్ని ప్రతిబింబించే పాఠ్యాంశాలతో పుస్తకాలు

ప్రచురిస్తారు. సామాన్యంగా వాటిలో ఇతర భాషల నుంచి గిరిజన భాషల్లోకి అనువదించినవే ఎక్కువ.

ఒకవేళ ఇవన్నీ అధిగమించినా ఒక క్రమపద్ధతిలో శాస్త్రీయ విధానాలలో విద్యా సమస్యలను పరిష్కరించడానికి కృషి జరగలేదు. ప్రస్తుతం గిరిజన బాలలకు గరుపుతున్న విద్య వారి జీవితావసరాలను తీర్చేదిగా లేదని రచయిత వాదిస్తున్నారు. సామాజిక వ్యవస్థలో విద్య ఒక అంతర్భాగం కనుక అది సామాజిక అవసరాలు తీర్చేందుకు అనుగుణంగా వుండాలి. గిరిజన సమాజాన్ని పటిష్టమైన సమాజాలు ప్రభావితం చేయడానికి ప్రయత్నం చేస్తాయి. ఆ ప్రయత్నంలో ఎంతో కొంత అస్థిరత చోటు చేసుకుని సామాజిక వ్యవస్థలో దుర్భరమైన పరిస్థితులకు దారితీస్తుంది. సాంస్కృతిక విలువల ఘర్షణ వల్ల వ్యక్తిత్వ వికాసంలో సమస్యలు తలెత్తుతాయి. ఆ తర్వాత వచ్చే దుష్పరిణామాలు ఒకోసారి వేర్పాటు వాదాలకు దారితీస్తాయి.

గిరిజన సంఘాలలో గిరిజన ఆర్థిక, సాంఘిక అవసరాలు విద్యాపరమైన అవసరాల కన్నా ప్రధానమైనవి. అయితే ఆధునిక విద్యావ్యవస్థ గిరిజన సమాజాల అవసరాలకు అనుగుణంగా లేదు. ఉపాధ్యాయుడు, విద్యార్థుల విషయంలో గిరిజనులు, గిరిజనేతరులు అనే భావనవల్ల వారి మధ్య సామాజిక పరమైన అగాధం నెలకొంది. జీవన విధానాలు ఆలోచనా సరళి రెంటినీ ఆధునిక విద్య త్వరితగతిని మార్చివేస్తోంది.

మారుమూల గిరిజన ప్రాంతాలలో నాగరికతకు చిహ్నాలుగా తలచే ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, రోడ్లు, రవాణా, సమాచారవ్యవస్థలు విస్తరించడంతో సాంప్రదాయకంగా వస్తున్న విలువలకు, కొత్తగా ఆశించే విలువలకు మధ్య అగాధం ఏర్పడుతోంది.

అభివృద్ధి విధానాల ద్వారా గిరిజన సంఘాలు కూడా లబ్ధి పొందడం సామాజికంగా అవసరం. గిరిజనుల విద్యా విధానాన్ని అవలంభించలేని అభివృద్ధి చెందిన సమాజం, తన విధానాలను వారిపై రుద్దుతోంది. ఈ క్రమంలో తన విధానానికి అనుగుణంగా గిరిజనుల అవసరాలను కుదిస్తుందే తప్ప వారి అవసరాలకు అనువైనట్లుగా తన విధానాలను మార్చుకోదు.

గిరిజన సంఘాల అవసరాలు కోకొల్లలు. కాని వాటి అవసరాలు ఏమిటో ఎవరూ అవగాహన చేసుకోలేకపోతున్నారు.

గిరిజనుల 'అవసరాలుగా' చెప్పబడే వాటికి, వాస్తవమైన అవసరాలకు మధ్య కొన్ని సందర్భాలలో వ్యత్యాసాలు వున్నవి. తమ కనీస అవసరాలు ఏమిటో చెప్పగల అవకాశం వారికి వుండటం లేదు. గిరిజనులకు ప్రతినిధులమని చెప్పుకునేవారే ఈ

అవసరాల గురించి మాట్లాడతారు, సామాన్యంగా వీరు గిరిజన సంస్కృతికి దూరమైనవారే వుంటారు.

గిరిజన ప్రాంతాలలోని పాఠశాలలు సంఘాల నడుమ ఘర్షణ పరిస్థితులు నెలకొని వుంటాయి. గిరిజన సంస్కృతి, విలువలను ఉపాధ్యాయులు గుర్తించక పోవడమే ఇందుకు కారణం.

విద్యలో వివక్ష చూపడం వల్ల వ్యత్యాసాలు ఏర్పడతాయని, విద్యను ప్రథమ శ్రేణి, ద్వితీయ శ్రేణి విద్యగా పేర్కొనడం జరుగుతుందని పలువురు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

విద్య మౌలిక స్వరూపం గురించి అవగాహన లేకపోవడం వల్లనే ఇటువంటి వాదనలు వినవస్తయ్. విద్యకు గల అతి మౌలికమైన ప్రస్థానం ఒకటే. అది జ్ఞానం, నైపుణ్యం, అలవాట్లు, వైఖరి, విలువలు, అవగాహన శక్తితో బాలలు తమ సంస్కృతికి అనుగుణంగా తమ వ్యక్తిత్వాలను వికసింప చేసుకునేందుకు తోడ్పడటం. ఈ అంశాలన్నీ సంస్కృతికి సంబంధించినవి కావడంచేత ఒక సంస్కృతికి సంబంధించిన విద్యను మరొకరిపై రుద్దడం భావ్యం కాదు. విద్యా విధానాన్ని దానిని ఎవరికి వుద్ధేశించామో వారి సంస్కృతికి అనుగుణంగా తీర్చిదిద్దుకోవాలి. అలా కానప్పుడు సామాజిక అస్థిరత నెలకొంటుంది.

మనం ఇప్పుడు గిరిజన బాలల ప్రాథమిక విద్య గురించి మాత్రమే పరిశీలిద్దాం. అభ్యాసన ఫలితాలన్నీ ఒకేలా వుంటాయి కాబట్టి ఆయా తెగలలో వాతావరణం వారి అవసరాలను బట్టి విద్యా విధానాన్ని సర్దుబాటు చేసుకోవచ్చు. ఒకే ఫలితాన్నిచ్చే వివిధ రకాల బోధన సామాగ్రిని రూపొందించడం బోధకులక్ను ప్రధాన సమస్య. ఆ తరువాత బాలలు నేర్చుకున్న దాన్ని మూల్యాంకనం చేయడంలో వాటి మధ్య సమానత్వం సాధించడం.

ప్రాథమిక స్థాయిలో విద్య లక్ష్యాలు చూద్దాం. 1991లో భారత ప్రభుత్వం "అభ్యాసనలో కనీస స్థాయి" అనే పత్రాన్ని విడుదల చేసింది. వీటిలోని అభ్యాసన లక్ష్యాలు సాంప్రదాయకంగా పేర్కొనేవే. అయితే అవి కొన్ని మార్పులకు లోనయ్యాయి.

ప్రాథమిక స్థాయిలో భాష నేర్చుకోవడం ఎందుకనే ప్రశ్నకు సమాధానంగా ఈ పత్రం దిగువ పేర్కొన్న లక్ష్యాలను వివరించింది.

-- విని అర్థం చేసుకోగలిగేందుకు.

-- నియత, అనియత వ్యవహారాలలో సమర్థతతో మాట్లాడగలిగేందుకు.

-- చదివినది బాగా అర్థం చేసుకోగలిగేందుకు, బోధనకు ఉద్దేశించిన అన్ని రకాల పఠనా సామాగ్రిని అసక్తితో చదివేందుకు.

-- ఒక క్రమాన్ని పాటిస్తూ సులభ గ్రాహ్యంగా చక్కగా వ్రాయగలిగేందుకు,

-- సందర్భోచితంగా వ్యాకరణాన్ని పాటించగలిగేందుకు.

ఈ లక్ష్యాల సాధనకు, ఆయా తెగల ప్రత్యేక అవసరాలకు తగిన భాషలో బోధనా సామాగ్రి రూపొందాలి. అందుకు వారి అవసరాలేమిటో ముందుగా తెలుసుకోవాలి. ఒక్కసారి ఒకటికి మించి భాషలు అవసరం కావచ్చు. పిల్లల్లో గ్రహణశక్తిని కలిగించి, పెంపొందించేందుకు ఆయా వయోపరిమితులకు చెందిన పిల్లలకు తెలిసిన పదాలేవో గుర్తించాలి. ఇది వారి మాతృభాషకు, వారు ఇతరులతో మాట్లాడేందుకు వాడే భాషకు సంబంధించి జరగాలి. పాఠ్యపుస్తకాల రచనకివే ఆధారం కాగలవు. స్థానిక జానపద గాథలు, పాటలు, కథలు, నీతి కథలు, పండుగలు, పబ్బాల గురించి కూడా వివరాలు సేకరించడం అవసరం. వీటిని పాఠ్యాంశాలలో పొందుపరచవచ్చు.

వేరే భాషల్లో, మరెవరి కోసమో సిద్ధంచేసి వుంచిన వాటి నుంచి సంగ్రహించకుండా, బోధనాసామాగ్రిని సరికొత్తగా తయారుచేస్తే భారత ప్రభుత్వ పత్రం (MLL)లో సూచించిన లక్ష్యాలు సాధించడం కష్టం కాదు.

ఇకపోతే గణితం విషయంలో ప్రాథమిక స్థాయికి MLL నిర్ణయించిన లక్ష్యాలు.

-- వేగంగా, తప్పులు లేకుండా లెక్కలు చేయగలిగేందుకు

-- సముచితమైన సందేశాలను వాడి (బీజ) గణిత రూపములో వ్యక్తీకరణ సాధించేందుకు

-- సరిగా అంచనాలు కట్టగలిగేందుకు

-- గణితం ద్వారా దైనందిన వ్యవహారాల్లో ఎదురయ్యే చిన్న చిన్న చిక్కులను పరిష్కరించుకునేందుకు.

**సామర్థ్యం :**

గణితంలో సామర్థ్యాన్ని ఇలా వర్గీకరించవచ్చు. అయితే ఇది బోధనాక్రమాన్ని బట్టి చేసిన వర్గీకరణ కాదు.

1. పూర్ణ సంఖ్యలను, అంకెలను తెలుసుకోవడం.
2. కూడికలు, తీసివేతలు, గుణకారం, భాగహారాలు చేయగలగడం.
3. డబ్బు, తూనికలు, కొలతలు, విస్తీర్ణం, కాలం తదితర అంశాల్లో రోజూ ఎదురయ్యే చిన్న సమస్యలను పరిష్కరించుకోగలగడం.
4. భిన్నాలు, దశాంకాలు, శాతాలను వినియోగించుకోగలగడం.
5. భౌతిక స్వరూపాలు, కాలం-దూరం వంటి అంశాలను అర్థం చేసుకోగలగడం.

తమ సమాజంలోనే ఎదిగే బాలలు గణితంలో సాధించే నేర్పు ఎలాంటిది. రోజువారీ వ్యవహారాలలో అంటే పనిలోను, ఆటల్లోనూ దానిని ఎలా వినియోగిస్తారు అనేది చూద్దాం. ఆటపాటల్లో, పనిలో వున్న గిరిజన బాలలను పరిశీలిస్తే వారికి దశాంకాలను తప్ప ఇతర సంఖ్యలను వాడడం తెలుసునని స్పష్టమవుతుంది. దానిలో కూడా వారికి కొన్ని విధానాలు ఉన్నాయి. ఉదాహరణకి, కొన్ని గిరిజన సమాజాలు 'గహి' విధానం పాటిస్తాయి. అంటే ఐదేసి చొప్పున లెక్కించడం,. మరి కొన్ని సమాజాలు ఇరవయ్యేసి చొప్పున (కుడి విధానం) లెక్కిస్తాయి గిరిజనులకు, మనకువలె వారి స్వీయ శైలిలో గణితంలో నైపుణ్యం వుంది. దాన్ని వదిలి వారు మన పద్ధతినే ప్రాథమిక స్థాయి నుంచి నేర్చుకోవాలా? వారి పద్ధతులనే అభివృద్ధి పరచి కొనసాగించేందుకు అవసరమైన సాధనం సంపత్తిని రూపొందించి, తదనంతరం దశాంక పద్ధతిని ప్రవేశపెట్టడం పద్ధతిని ప్రవేశపెట్టడం సాధ్యంకాదా? కొంత కాలం కిందటనే మనం 'బైనరీ' విధానం (రెండేసి చొప్పున లెక్కించడం) ప్రవేశపెట్టాలని ప్రయత్నించి విఫలమయ్యాం. ఈ కొత్త విధానానికి మనం అలవాటు పడలేక పోవడమే ఈ వైఫల్యానికి కారణం. తమకలవాటైన బదులు, ఇరవై బదులు, పదుల్లో లెక్కలు వెయ్యమంటే గిరిజన బాలలు అదే విధమైన కష్టాలు ఎదుర్కొంటారు గిరిజనుల సంస్కృతి, సంప్రదాయాలను దృష్టిలో పెట్టుకొని మనం పునరాలోచించ వలసిన అంశాలు ఇవి.

ఇక పర్యావరణ విషయం చూద్దాం MLL లో దీనికి సంబంధించిన పది సామర్థ్యాలను పేర్కొన్నారు వీటి ప్రకారం విద్యార్థి.

1. తన సహజ, సామాజిక వాతావరణాలకు అనుగుణముగా తన సంక్షేమానికి సంబంధించిన అంశాలను అర్థం చేసుకుంటాడు.

2. సామాజిక-పౌర వ్యవస్థలలో ప్రధానమైన అంశాలేమిటో పరిశీలించి అవి ఎలా పనిచేస్తాయో తెలుసుకుంటాడు.

3. వివిధ పనుల్లో నిమగ్నమైన వారిని పరిశీలించి, "పని" (దానికి సంబంధించిన ప్రపంచం) ఎంత ముఖ్యమైందో తెలుసుకుంటాడు.

4. మనిషికి, అతని పరిసరాలకు గల పరస్పరాధారిత సంబంధాన్ని గురించి తెలుసుకుంటాడు.

5. మనిషి వర్తమానానికి, గతంలో గల సంబంధాన్ని అర్థం చేసుకుని, గతాన్ని సరైన దృక్కోణం నుంచి చూడడం నేర్చుకుంటాడు.

6. తేలికగా గమనించదగిన సామాజిక ఆర్థిక సమస్యలను, పరిస్థితులను గుర్తించడం, విశ్లేషించడం, వాటికి తనకున్న అనుభవంతో పరిష్కారాలు అన్వేషించడం తెలుసుకుంటాడు.

7. మంచి ఆరోగ్య సంరక్షణకు దోహదపడేవి ఏవో తెలుసుకుంటాడు.

8. తన పరిసరాల్లోని (జీవ్యావరణం) జీవరాసుల గురించి సమాచారం సేకరించి, వర్గీకరించడంలో నైపుణ్యం సాధించగలుగుతాడు వాటి గురించి అభిప్రాయాలు ఏర్పరచుకుంటాడు.

9. జీవరహితమైన వాటి లక్షణాలను పరిశీలించి పరిశోధించడం నేర్చుకుంటాడు.

10. భూమిపైనా, ఆకాశంలోను సంభవించే చిన్న చిన్న సంఘటనలను పరిశీలించి అర్థం చేసుకోగలుగుతాడు.

గిరిజనులు పుట్టి పెరిగే వాతావరణంలో వనసంపద అపారం ఆ దృష్ట్యా పర్యావరణ అధ్యయనం లక్ష్యాలు గిరిజనులకు ఎంతగా నప్పుతాయో గ్రహించవచ్చు, సామాజిక విజ్ఞానానికి సంబంధించినంతవరకు, కుటుంబం, ఇల్లు గ్రామం, పంచాయతీ వంటి భావనలు గిరిజన బాలలకు పరిమితమైనవే, కొన్నేళ్ళ క్రితం వరకు పోస్టాఫీసు, ఆస్పత్రి, బడి వంటి ఆధునిక సామాజిక వ్యవస్థలు వారికి తెలియవు, కాని ఇప్పుడు అవి కూడా కొన్ని మారుమూల ప్రాంతాలు వదిలేస్తే, గిరిజనులకు సుపరిచితాలు.

పర్యావరణ పరిరక్షణకు సంబంధించి అడవుల సంరక్షణ, వన్యమృగ సంరక్షణ వంటివి గిరిజన సంస్కృతిలో అంశాలే, చెట్లను, జంతువులను పూజించేవారి ఆచారాలు, నమ్మకాలు, చిహ్నాలు జీవావరణ పరిరక్షణ అవసరాన్ని ఈ ఆచారాలు, చిహ్నాలు వివరించ లేకపోవచ్చు, కనుక ఈ తర్కాన్ని వివరించేందుకు రూపొందించే బోధనా సామగ్రి గిరిజనుల ఆచారాలు, చిహ్నాలను ఆధారం చేసుకోవాలి, అయితే వీటిలో ప్రతి ఒక్క దాని గురించి హేతుబద్ధంగా అర్థం చేసుకోనిదే అది సులభం కాదు. అందుకు వీటి పరిశీలనలో శాస్త్రీయ దృక్పథాన్ని, విధానాలను వినియోగించాలి, వారిలో ఈ శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించడం మనం అనుకునేంత కష్టం కాదు.

ప్రత్యేకించి గిరిజన బాలలకు అనువైన పాఠ్య ప్రణాళిక ఎలా వుండాలో సూచించడం ఈ వ్యాసం ఉద్దేశ్యం కాదు. అది ఇక్కడ సాధ్యం కాదు కూడా. MLL నిర్దేశించిన మార్గదర్శక సూత్రాల ప్రకారమే ఆయా తెగల అవసరాలకు తగిన విధంగా పాఠ్య ప్రణాళికలను రూపొందించడం సాధ్యం, వాంఛనీయమని నొక్కి చెప్పడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం. విద్యా వికేంద్రీకరణ జరగాలన్న మన ఆశయం నిజంగా నెరవేరేది ఇక్కడే. అలా జరిగినప్పుడే విద్య దానిని ఎవరికోసం ఉద్దేశించామో ఆ ప్రజల సంస్కృతిలో అంతర్భాగం కాగలుగుతుంది. ఇప్పుడు మాత్రం విద్య, గిరిజన బాలలను వారి సంస్కృతికి దూరం చేస్తుంది. తన సంస్కృతి పరిధిలోనే వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడేది విద్య, ఈ దిశగా

చిత్తశుద్ధితో చేపట్టే చర్యలు గిరిజన బాలల, పురోగతికి, వారి ఆత్మగౌరవం పెంపొందడానికి దోహదం చేయడమే కాక, (ప్రతి ఒక్కరికీ తెలిసిన కారణాల వల్ల) వారిలో పొడచూపుతున్న వేర్పాటు ధోరణలు అరికట్టవచ్చు.

ఈమొత్తం కృషిలో విశ్వవిద్యాలయాలు, మానవ శాస్త్ర నిపుణుల అవసరం వున్నచోట్ల, వారి నుంచి ఆశించినంత తోడ్పాటు లభించడం లేదు. వీరి సహకారంతో ఆచరణాత్మకమైన శాస్త్రీయ అధ్యయనాలు చేపట్టవలసిన సమయం ఆసన్నమైంది, ఈ రంగంలో పరిశోధన కూడా అంతే ముఖ్యమైనది.

అనియత విద్యే గిరిజన సమాజాల జీవన శైలికి. భౌతిక సామర్థ్యానికి తగినది. కాని మానవ శాస్త్ర నిపుణులు, అనియత విద్యారంగ నిపుణులు సంయుక్తంగా కృషిచేసి ఈ బృహత్ సమస్యను పరిష్కరించవలసిన అగత్యం వుంది.

విద్య, సామాజిక-మానవ శాస్త్ర సంబంధమైన అంశాలలో అంతర్ శాఖ అధ్యయనాలు ఎక్కువగా చేపట్టవలసి వుందని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. అలాగే ప్రధానమైన తెగలుండే ప్రాంతాలన్నిటిలో వేరువేరుగా మానవ శాస్త్రంలోశిక్షణ పొందిన వారితో కూడిన బృందాలను ఏర్పాటు చెయ్యాలని విజ్ఞప్తి చేస్తున్నాను, ఈ బృందాలను జాతీయ పాఠ్య ప్రణాళిక (అందులోని పది ప్రధాన అంశాలతో సహా) పరిధిలోకి లోబడి, ఆయా ప్రాంతాల సంస్కృతికి అనుగుణమైన బోధనా సామాగ్రి కూడా వారు రూపొందించాలి.

ఈ సందర్భంగా కేంద్రీయ భారతీయ భాషల సంయుక్త (CIIL), NCERT వంటి సంస్థలు జరిపిన కృషిని ప్రస్తావించడం సముచితం, అయితే అవి కేంద్రీకృత సంస్థలు కావడం వల్ల వారి ప్రయత్నాలు అట్టడుగు స్థాయికి విస్తరించకపోవడంతో ఎలాటి ప్రభావం చూపలేక పోయాయి. అందువల్ల ప్రతి రాష్ట్రం అన్ని ప్రధాన గిరిజన ప్రాంతాలలోను ఒక్కొక్క నిపుణుల బృందాన్ని నెలకొల్పాలి, అవసరమైతే పాఠ్య ప్రణాళికలు, బోధనా సామాగ్రి అభివృద్ధిలో శిక్షణనిచ్చేందుకు ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించాలి, ఈ రకమైన నైపుణ్యతను భాగస్వామ్య విధానం ద్వారా కూడా అభివృద్ధి చేసే వీలుంది.

*

# నాడునేడు గిరిజనోద్ధరణ

-యం.టి.డిన్

ప్రపంచంలోని అన్నిదేశాల్లో ఆదిమ జాతివారు లేక గిరిజనులున్నారు. అట్లాగే మన దేశంలో దాదాపు అన్ని రాష్ట్రాల్లో గిరిజనులున్నారు. వీరిని గిరిజనులని ఆదిమ జాతివారని, ఆదివాసులని, ఆది మానవులని పిలుస్తుంటారు. గిరిజనులకు సంబంధించి అస్పృస్యత లేదు అది కేవలం సాంఘిక ఆర్థిక సమస్య మాత్రమే. గిరిజన జనాభా 1961 వ సంవత్సరపు జనగణననుసరించి మన దేశంలో మొత్తం దాదాపు 30 మినియన్లు. ఇప్పటికి యీ జనాభా యింకా పెరిగి వుండవచ్చు. అంటే దేశంలోని మొత్తం జనాభాలో వీరు 7శాతం. గిరిజన జనాభా దేశంలో అన్ని చోట్ల విస్తృతమై వున్నప్పటికి కొన్ని ప్రదేశాల్లో ఎక్కువగా ఉండటంవల్ల ఆ ప్రాంతాలను గిరిజన ప్రాంతాలుగా గుర్తించారు. ప్రముఖ చరిత్ర కారుడు మంజుందార్ ఆ ప్రాంతాలను గిరిజన ప్రాంతాలుగా గుర్తించారు. మంజుందార్ ఆ ప్రాంతాలను ఈ క్రింది విధంగా విభజించాడు.

**1. ఉత్తర-తూర్పు మండలం :** ఈ మండలంలో ఖాసి, నాగ, గాసి మెమత తెగలకు చెందిన గిరిజనులున్నారు.

**2. మధ్యమండలం :** ఇక్కడ ఓరావున్, ఖోండ్, గోండ్ మొదలగు తెగలకు చెందిన గిరిజనులున్నారు.

**3. దక్షిణం మండలం :** కాదర్, బైగా, ఖిల్ మొదలైన తెగలకు చెందిన గిరిజనులున్నారు. ఆంధ్రప్రదేశ్ దక్షిణ మండలంలో చెంచులు, కోయలు, యానాదులు, కొండరెడ్లు, లంబాడి మొదలైన తెగలకు చెందిన గిరిజనులున్నారు.

**గిరిజనుల పద్ధతి :** గిరిజనులు అనాది కాలం నుండి సాంప్రదాయక జీవితాన్నే గడుపుతూ ఇతర ప్రజానీకానికి దూరంగా తమ జీవితాలను కొనసాగిస్తున్నారు. వీరిలో వివిధ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వారు కూడా వున్నారు. భారతీయ గిరిజనులు చాలామంది తమ ఆహారం కోసం అడవులపై ఆధారపడి జీవిస్తున్నారు. సాధారణంగా వీరు ఆహార సంగ్రహణ ఆర్థిక వ్యవస్థకు చెందినవారు. ఖదరాలు, పలయన్‌లు, చెంచులు మొదలైన గిరిజన తెగలు ఆహార సంగ్రహణ విధానానికి చెందినవారు. వీరు వ్యవసాయం చేయరు. ఒకవేళ చేసినా వీరు పోడు వ్యవసాయాన్ని చేస్తారు. **ఖమారు**, బైగా, కొండరెడ్డి మొదలగు తెగలకు చెందిన గిరిజనులు ఆర్థిక వ్యవస్థ అటు ఆహార సంగ్రహణ ఇటు మారక వ్యవసాయానికి చెందక మధ్య రకానికి చెందినవారు. మూడవ కోవకు చెందిన

గిరిజనుల వ్యవస్థ భారతీయ సాంప్రదాయక వ్యవసాయం. అడవి వనరులపై ఆధారపడి ఉండటం. వీరు కొండ దిగువ భాగాలపై వ్యవసాయం చేస్తు తమ ఆహారం కోసం అడవులపై ఆధారపడతారు.

పారిశ్రామిక అభివృద్ధి వల్ల గిరిజనుల్లో క్రొత్త ఆర్థిక వ్యవస్థ ఏర్పడింది. బీహార్, అస్సాం, బెంగాల్‌కు చెందిన గిరిజనులు తమ వ్యవసాయ భూముల్నికోల్పోయి ఋణాలకు లోనైనందువల్ల సాంప్రదాయక వృత్తిని కోల్పోయారు. గత్యంతరం లేక యీ గిరిజనులు అస్సాం టి తోటల్లో కూలి పనివారుగా చేరవలసి వచ్చింది. ఈ విధంగా కూలిలుగా మారిన గిరిజనులు వడ్డీ వ్యాపారస్తులకు, గుత్‌దార్లకు ఎరగా మారి అనేక కష్టనష్టాలకు గురి అయ్యారు. గిరిజన ప్రజలు నగర సమాజ వ్యవస్థకు సన్నిహితులై త్రాగుడు, జూదమాడటం, వ్యభిచారం మొదలగు చెడు అలవాట్లకు లోనైనారు. కొంత మంది వివిధ అంటురోగాలకు గురి అయ్యారు. పోడువ్యవసాయం పురాతనమైందేగాక లాభంతో కూడుకొన్నది కాదు. ఇంలాంటి వ్యవసాయం పంట దిగుబడి ఇవ్వక పోవడం వల్ల గిరిజనుల బ్రతుకు మరింత దుర్భరమై వలస వెళ్ళడమో లేదా ఆకలి బాధతో అలమటించడమో జరుగుతూ వచ్చింది.

గిరిజన ప్రజలు నగర ప్రజల సముఖంలో అనాగరికులుగా పరిగణించబడటమే గాక నిమ్న వర్గాల క్రింద జమ అయిపోయారు. క్రైస్తవ మిషనరీలు వీరిలో కొందరిని క్రైస్తవులుగా మార్చినారు.

గిరిజనులు నాగరిక ప్రజల అలవాట్లను అనుసరించడం వల్ల వారి సామాజిక వ్యవస్థతో కూడా క్రమేణా కొంత మార్పు వచ్చిందని చెప్పవచ్చు. సాధారణ పద్ధతిలో జరిగే వివాహాలు నాగరికత వ్యవస్థకులోనై వ్యయపూరితమైనవిగా అవటమేకాకుండా బాల్య వివాహ పద్ధతులు గిరిజనుల్లో ప్రవేశించినాయి. బ్రిటిష్ వారు తమ పరిపాలనాన్ని కొండ ప్రాంతాలకు కూడా విస్తృతం చేయదలచి గిరిజనుల పాలనకు ఏంజెంట్లను నియమించారు. అంతేకాకుండా అడవులను రిజర్వు అడవులుగా ఏర్పాటు చేసారు. ఇలాంటి నిర్బంధాలవల్ల గిరిజనులు అడవుల్లో వేటాడుటం, తేనె సేకరించడం, పండ్లు దుంపలు మొదలైన వాటిని సేకరించడంలో అడ్డుపెట్టడం జరిగింది. ఇలాంటి నియమాలు ఆహర సంగ్రాహకులైన గిరిజనుల జీవితాలను దుర్భరం చేసాయి. దీనికి తోడు గుత్తదార్లు అడవుల్లో ఆకులు, కట్టెలు, బొంగులు మొదలైనవి సేకరించడానికి తక్కువ కూలి డబ్బులు గిరిజనులకిచ్చేవారు. ఈ చాలిచాలని కూలి డబ్బులతో గిరిజనుల జీవితాలు గడవక వారు ఋణాలు చేసేవారు. ఈ విధంగా గిరిజనులు తీర్చలేని ఋణాలకు లోనయ్యేవారు. ఫలితంగా కొందరు గిరిజనులు అడవి ప్రాంతాలను వదలివేసి నగరాలకు పోయి నగరాల్లో కూలీలుగా బ్రతకడం మొదలుపెట్టారు.

భారత స్వాతంత్ర్యానికి ముందు చాల మంది సంఘసేవకులు, స్వచ్ఛంద సేవా సంస్థ వ్యవస్థాపకులు గిరిజనోద్ధరణకు ఎంతగానో కృషి చేసారు. క్రైస్తవ మిషనరీలు గిరిజనులకు విద్య. ఆరోగ్య సూత్రాలను నేర్పుతూ వీరిలో చాలా మందిని క్రైస్తవ మతంలోకి మార్చినారు. మహాత్మాగాంధీ కూడా గిరిజన సంక్షేమాన్ని దేశ పునరుద్ధరణ కార్యక్రమంలో చేర్చినాడు. దేశ స్వాతంత్ర్యానికి పూర్వం ఎందరో గిరిజనులకు సేవచేసారు.

భారత దేశ స్వాతంత్ర్యం తరువాత భారత దేశపు రాజ్యాగంలో హరిజనులు, గిరిజనులు, తదితర బలహీన వర్గాల కోసం కొన్ని ప్రత్యేక సదుపాయాలు కల్పించబడ్డాయి. ఈ రాజ్యాంగంలోని 46వ నిబంధన హరిజన, గిరిజన సంక్షేమాన్ని దృష్టిలో వుంచుకొని వీరిని సమాజిక అన్యాయాల నుండి కాపాడ వలెనని ఆదేశించింది.

గిరిజనుల సంక్షేమానికి ప్రతి పంచవర్ష ప్రణాళికలో కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు పెట్టడం జరుగుతుంది. గిరిజనులకు ప్రాధాన్యత యిస్తూ (1) వ్యవసాయాభివృద్ధికి, (2) పశుపోషణకు, (3) చేపల పెంపకం (4) చిన్న తరహ కుటీర పరిశ్రమ (5) విద్యా వసతులకు కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు పెట్టబడుతుంది.

1. వ్యవసాయ అభివృద్ధికి ప్రభుత్వం ఋణాల ద్వారా విత్తనాలు, ఎరువులు పంచడం, బావులు త్రవ్వడం లాంటి సంక్షేమ కార్యక్రమాలను చేస్తుంది.

2. పశుపోషణ కార్యక్రమాల్లో ప్రభుత్వం గిరిజనులకు కోళ్ళు, గొర్రెలు, మేకలు, పందులు పెంచడం కొరకు ధనసాయం ఋణం ద్వారా చేస్తుంది. గిరిజనులు పశుపోషణ ద్వారా తమ జీవనాన్ని గడుపుకోగలరు.

3. చేపల పెంపకం కొరకు గిరిజనులకు ప్రభుత్వం చేపలను పెంచడం నేర్పుతూ చేపల పరిశ్రమ అభివృద్ధి చేస్తుంది.

4. కుటీర పరిశ్రమలకు స్థానికంగా వారికి దొరికే సామాగ్రితో కొన్ని పరికరాలను సిద్ధం చేసుకోవచ్చు. వీటిలో త్రాళ్ళు పేనడం, అడవి ఫలాలు సేకరించడం, తేనెప్రాగు చేయడం, బీడి ఆకులు తెంచడం వంటివి ముఖ్యమైనవి. ఇలాంటి వస్తువులు కొన్ని కొనుగోలు చేయడానికి ప్రభుత్వం గిరిజన సహకార స్టోర్స్‌లను స్థాపించింది.

5. విద్యా వసతులను అభివృద్ధి చేయడానికి గిరిజనులకు ప్రత్యేక ఆశ్రమ పాఠశాలలను స్థాపించి గిరిజన ఉపాధ్యాయులనే నియమించడం జరిగింది. గిరిజనులకు ఉచిత విద్యా సౌకర్యాలు కల్గించి వారికి స్కాలర్ షిప్‌లను కూడా ఏర్పాటు చేసింది.

పైన వివరించిన కార్యక్రమాలేగాక గిరిజన స్త్రీ సంక్షేమం, శిశు సంక్షేమం మొదలగు సంక్షేమ సంస్థలను ప్రభుత్వం స్థాపించింది. భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం ఈ విధంగా సంక్షేమానికి, అభివృద్ధికి సర్వవిధాలా ప్రయత్నం చేస్తుంది.

*

# ఆధునిక యుగంలో ఆటవికులు?

- భూక్యా చిన వెంకటేశ్వర్లు
చీఫ్ ఎడిటర్, గిరిజన స్రవంతి

"అనేక వైభవోజ్వల మహాయుగం
వల్లకాటి అధ్వాన్న శకం
వెల్లి విరిసిన విజ్ఞానం
బ్రహ్మజెముడులా అజ్ఞానం"

ఉత్తరాంధ్ర ప్రాంతంలోని కొండకోనల్లో బిక్కు బిక్కు మంటూ బతుకుతున్న ఆదివాసుల్ని చూస్తే ఈ మాటలు గుర్తుకొస్తాయి. ఈ అధునిక యుగంలో అభివృద్ధి పథానికి ఆమడ దూరాన ఆదిమానవులకు పూర్తి నకళ్ళగా బతుకుతున్న బడుగులు వాళ్ళు. ఒంటినిండా బట్టకట్టి ఎరుగరు, కడుపునిండా తిండి తిని ఎరుగరు. బతుకులో సుఖమంటే ఏమిటో ఎరుగరు. కొండలూ కోనలే వాళ్ళలోకం, నాగరికతంటే వాళ్ళకు భయం, ప్రభుత్వం గిరిజనుల అభివృద్ధికోసం నెలకొల్పుతున్న సంస్థలు వాళ్ళ జీవితాల్లో వెలుగును కాదు సరికదా, చిరుదీపమైనా వెలిగించలేదు. వెచ్చిస్తున్న కోట్లు ఎటుపోతున్నాయో, గిరిజనుల పాట్లు మాత్రం తీరడంలేదు. ఇతర ప్రాంతాల్లో గిరిజనులకు వీరికి తేడాఉంది. ప్రభుత్వసాయంతో అభివృద్ధిచెంది నాగరిక ప్రపంచంలో కలిసిపోవాలన్న తపన ఇతర ప్రాంతాల్లోని గిరిజనుల్లో కనిపించినంతగా వీరిలో లేదు. వీళ్ళింకా విల్లంబులతో జంతువుల్ని వేటాడే ఆటవిక దశలోనే ఉన్నారు. పోడు వ్యవసాయం మీదనే ఆధారపడి బతుకుతున్నారు. కులాచార విషవలయంనుంచి దాటిరాలేకపోతున్నారు. విజయనగరం జిల్లాలో జాతాపు, సవర, గడబి, మన్నె దొర, కొండదొర జాతులవారున్నారు. శ్రీకాకుళం జిల్లాలో కొండదొర, సవర, జాతపు జాతుల వారూన్నారు. జాతులేమైనా బతుకులన్నీ ఒక్కటే.

విజయనగరం జిల్లా పార్వతీపురం ఇంటెన్సివ్ ట్రైబల్ డెవలప్‌మెంటు ఏరియా (ఐటిడిఏ) పరిధిలో నివసించే ఆదివాసులు పోడు వ్యవసాయంలో పండించిన ధాన్యాన్ని అమ్ముకోవాలన్నా కొనుక్కోవాలన్నా సంతలకు వెళ్ళాల్సిందే! క్రయ విక్రయాలన్నీ అక్కడే జరుగుతాయి. సారా నిషేధం ప్రభావం వీరిపై అంతగా లేదు. సారా దొరక్క పోతేనేం జీలుగు కల్లును కడుపారా సేవించి తరిస్తారు. వీరి పండుగలూ పబ్బాలు వింతగా ఉంటాయి. శివరాత్రికి గుమ్మజాతర, ఫిబ్రవరిలో తాడికొండ జాతర, మార్చిలో మొండెంఖల్లు, జోపగెడ్డ

జాతర్లు జరుపుకుంటారు. సవరలో కప్పరమ్మ, ఆగమ్మ అనే దేవతల్ని కొలుస్తారు కలిసి జీవించడం తప్ప ఖచ్చితంగా వివాహ బంధమంటూ ఈ ఆదివాసులకు లేదు. సాధారణంగా సంతల్లో కలుసుకునే యువతీ యువకులు ఒకరినొకరు ఇష్టపడితే కలిసి కాపురం చేస్తారు. పెళ్ళి అనే తంతులేకుండానే భార్యాభర్తలుగా గడుపుతూ పిల్లల్ని కంటారు. ఏ కారణం చేతనైనా విడిపోతే అందుకు కారణమైనవారు 'తప్పు' అనే జరిమానా, ఒకరి భార్యను మరొకరు తీసుకుపోతే అతను మొదటి తప్పు చెల్లించాలి.

శ్రీకాకుళం జిల్లా సీతంపేట ఐటిడిఎ పరిధిలోని గిరిజన తెగల్లో కూడా ఈ ఆచారాలే అమల్లో ఉన్నాయి. వీళ్ళు దేవతలనే కాక దెయ్యాల్ని కూడా పూజిస్తారు. ఊరికి దెయ్యం కాపలా ఉంటుందని వాళ్ళ నమ్మకం. దెయ్యానికి ఊరిబయట గుడికూడా కట్టిస్తారు. కాలినడక తప్ప, వాహనాలు ఎరుగురు. రవాణా సౌకర్యాలే లేవు. కావడి మోయటం, పారలతో కొండలు తవ్వి మొక్కలు నాటడమే వీరికి తెలిసిన ఆధునిక వ్యవసాయం. ఎక్కడ వ్యవసాయయోగ్యమైన భూమి కనిపిస్తే ఆ కొండమీదనే నాలుగు గుడిసెలు వేసుకొని బతుకుపోరు సాగిస్తారు. నాగరికులంటే వీరికి విపరీతమైన భయం, పత్రికా విలేకరుల బృందం ముత్యాలు గ్రామానికి వెళ్ళినప్పుడు భయంతో, ఆ గ్రామ గిరిజనులు తలుపులు బిగించుకున్నారు.

కొండమీద సుమారు ఎనిమిది కిలోమీటర్లు కాలినడకన ప్రయాణిస్తే ముత్యాలు గ్రామం కనిపిస్తుంది. అక్కడ 18 సవర కుటుంబాలున్నాయి. అన్నీ రెల్లుగడ్డి కప్పిన గుడిసెలు. వాళ్ళు బయటి ప్రపంచంలోకి వెళ్ళిన సందర్భాలు వేళ్ళమీద లెక్కించవచ్చు. వాళ్ళు పుట్టేది గిట్టేది నాగరిక ప్రపంచానికి దూరంగానున్న కొండల్లోనే!

★

# గిరిజనాభ్యుదయం - ఒక పరిశీలన

ప్రొ॥ జి.యస్. మూర్తి M.A., Ph.D

ఎందుకు చూపుతావు జాలి?
మాకు కావాలి న్యాయం
అపరాదులపై కురిపించుకో నీ జాలి
అమాయకులు మాత్రం కోరుకునేది న్యాయాన్ని.

ఈ భావం భారతదేశంలో నివసిస్తూన్న 25 మిలియన్ల గిరిజనులదంటే అతిశయోక్తికాదు. గిరిజనులు నేడు కోరుకునేది ఆర్థిక, సాంఘిక న్యాయమేకదా! ప్రకృతి అచనత్వంతో కాక నిత్యనూతన నిరంతర చలనంతో సాగిపోతూనే ఉంటుంది. గిరిజనులు కూడా ఈ సమాజంలోని సభ్యులే కదా! అందుచేత గిరిజన జీవన విధానంలో కూడా మార్పు అనివార్యము అత్యవసరం కూడా.

భారత రాజ్యాంగం యేర్పడి 50 సంవత్సరాలు దాటింది. భారత రాజ్యాంగంలో 14 రాష్ట్రాలలో 212 తెగల్ని షెడ్యూల్డు ట్రైబ్స్‌గా వర్గీకరించి నిర్దేశించారు. వీరికి ప్రత్యేక సౌకర్యాలు సదుపాయాలు హక్కులు కల్పించారు. రాష్ట్ర శాసన సభలలో, పార్లమెంటులో, సీట్లు కేటాయించారు. ప్రభుత్వ ఉద్యోగాలలో పదవులు కేటాయించారు విద్యాలయాలలో సీట్లు కేటాయించారు ఉపకారవేతనాలు హాస్టల్సువంటి సదుపాయాలు కల్గించారు. ఈ రక్షణ సౌకర్యాలన్నీ రాజ్యాంగంలో నిర్దేశించారు. 50 సంవత్సరాలు గడిచినా గిరిజనాభ్యుదయం శీఘ్రగతిని సాధించలేకపోవటం గమనార్హం. ఇంతవరకూ అన్ని రంగాలలో సాధించిన గిరిజనాభ్యుదయం స్వల్పం సాధించవలసింది అసల్పం.

నేటికి సరిహద్దు ప్రాంతాలలో **చీమలు దూ**రని, కాకులు దూరని కారడవులలో నున్న కొండచరియలలో ప్రాచీన సంప్రదాయ జీవన విధానాన్ని ఆచరిస్తు సంరక్షించుకుంటూ జీవిస్తున్నారు. దాదాపు 5 మిలియన్ల గిరిజనులు యిట్లా కొండచరియల్లో సంప్రదాయబద్ధంగా జీవిస్తున్న అనాది సంతతివారు కొందరు గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయం యితర వృత్తులు చేపట్టి నాగరికంగా జీవిస్తున్నారు. కొండ ప్రాంతం నుండి పట్టణ ప్రాంతాలకు తరలివెళ్ళి అక్కడి పారిశ్రామిక వృత్తుల్ని చేపట్టి ఆ జీవన విధానంతో తమ జీవనాన్ని సంధానం చేసుకున్నవారు కొందరు ఆధునిక

సమాజంలో సంపూర్ణంగా విలీనం చెంది ఇతరులలో సహజీవనం చేస్తున్నవారు మరికొందరు.

కొండచరియలతో తమ సంస్కృతిని సంరక్షించుకొంటూ నాగరికతకు దూరంగా నివశిస్తు సంచార్ సేద్యం చేస్తు జీవనాన్ని గడుపుతూన్న గిరిజనుల సంక్షేమం అత్యంత ప్రధానమైనది. వీరిని కూడా సమాజంలో విలీకరణ చేయడానికి అనువైన అభ్యుదయ, సంక్షేమ పథకాలు రూపొందించాలి.

కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలు కూడా గిరిజనాభ్యుదయం కోసం ప్రత్యేక శాఖను ఏర్పాటు చేసి పథకాలు తయారు చేసి అమలు చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో పాడేరు, అరకు, భద్రాచలంలో ప్రవేశ పెట్టిన సమగ్ర గిరిజన సంక్షేమ పథకాల లక్ష్యం గిరిజనాభ్యుదయమయే గిరిజనుల పంటను, శ్రమను దళారీలు దోచుకోకుండా గిరిజన కార్పోరేషను ఏర్పాటు చేసి వారికి సౌకర్యాలు కల్గించారు. ఉద్యోగాలలో, విద్యాలయాలలో సౌకర్యాలు కల్పిస్తున్నారు. ఆంధ్రదేశంలో చెంచులు, కోయవారు, ఎరుకలు, యానాదులు, లంబాడీలు మొదలైన కొండజాతి వారనేకులున్నారు కొండచరియల్లో వుండే సవరలూ ఉన్నారు. వీరందరికి యితర భారత ప్రజలతో పాటు సాంఘిక, ఆర్థిక, న్యాయం చేకూర్చాలి. ఇది ప్రభుత్వ కనీస బాధ్యత.

50 సంవత్సరాలైన గిరిజనాభ్యుదయ పథకాలు ఆశించిన సత్ఫలితాలు సాధించలేదంటే మనం సమస్యలు సమగ్రంగా పరిశీలించాలిగదా! వేష, బాషలలో వైవిధ్యం, సంస్కృతిలో, జీవన విధానంలో, ఆచార వ్యవహారాలలోని భిన్నత్వం వుండి నాగరికతకు దూరంగా అనేక సంవత్సరాలుగా ఉన్న ప్రజలతో మనం సత్సంబంధాలు ఏర్పాటుచేయ ప్రయత్నిస్తున్నామన్నది మరువరాదు. దర్పాన్ని ఉన్నత వేషభాషల్ని గిరిజనులు అనుమానిస్తారే కాని ఆదరించరు. గిరిజనులకన్న ఉన్నతుల మన్న భావంతో వీరు వ్యవహరిస్తారని వారి భావన. అందువలన గిరిజనుల ప్రగతిని తలపెట్టిన అధికారులు మానవ సంబంధాలు పరిశీలించడంలో యేర్పాటు చేయడంలో నిపుణులై యుండాలి. చొరవ, స్నేహం, చైతన్యం, సహనం వీరిలో ప్రకాశించాలి. మానవతా దృక్పధంతో గిరిజనుల సమస్యల్ని, అవగాహన చేసుకొని వారిలో పరిపూర్ణ విశ్వాసాన్ని, స్నేహసౌహార్ద్రాన్ని కల్గించాలి. అటువంటి వాతావరణం యేర్పాటు అయితే తప్ప యే పథకం అమలు జరగదు, విజయవంతం కాదు. ఆధునికి మార్పుల్ని సాంస్కృతిక విజ్ఞానాన్ని నెమ్మదిగా నేర్పుగా గిరిజనులకు అందించాలి. అంటే గిరిజనుల సంస్కృతిని ఆదరిస్తు, అభిమానిస్తు ఆధునికతను కూడా వారి జీవితంలో భాగం కావాలని ఒప్పించాలి.

ప్రభుత్వం ప్రవేశపెట్టె సంక్షేమ పథకాలు ఆ ప్రాంతాల కొండజాతి వారి సాంస్కృతిని సమగ్రంగా అర్థం చేసుకొని స్నేహబంధాలు యేర్పాటైన తర్వాత వారి సంస్కృతిని రక్షించే హామీని కల్పించిన తర్వాత సామాజిక పరివర్తన క్రమేపి సాధించవచ్చు. ఆదిమవాసులలో నిరాశా నిస్పృహలు లేక మానసిక, శారీరక ఆనందమయ జీవితాన్ని కొండ ప్రాంతాలలో నేటికి గడుపుతున్నారు. అందువలననే వారు ఆధునిక నాగరిక సంక్లిష్ట జీవితానికి అంత తొందరగా సుముఖత చూపరు. నేర్పుతో ఓర్పుతో ఈ మార్పు తీసుకురావాలి. గిరిజనాభ్యుదయ అధికారులు చేయవలసిన పనులలో ముఖ్యమైనది ఇది ఒకటి.

గిరిజనులు సంక్షేమ పథకాలతో తాదాత్మ్యం చెంది అంగీకరించినవే అమలు జరపాలి. కావున గిరిజనులకు మంచివి అని అధికారులు ఉద్దేశించినవి కావన్నది నేడు ప్రబలుతూన్న అభిప్రాయం. ప్రతికొండ జాతి వారికి వారికి అవసరమైన ఆశించిన సంక్షేమ పథకాల్నే అమలుచేస్తే సమస్య పరిష్కారమయ్యే అవకాశం ఉంది.

సుదూర ప్రాంతంలో కొండచరియలలో నివసిస్తూన్న గిరిజనులను సమీపించడానికి అధికారులు ఎక్కువ ఆసక్తి, చొరవ చూపించాలి. భాష, వేషం, సంస్కృతి భిన్నంగా ఉన్న వీరితో స్నేహసంబంధాలు యేర్పాటు చేయడం అధికారులకు కష్టం, క్లిష్టం కూడా. అయినా అనివార్యం అధికారులు దర్పాన్ని అజమాయిషిని గాక కౌశలాన్ని ప్రదర్శించి వీరిని ఆకట్టుకోవాలి స్నేహంతో ద్వేషాన్ని గెలిచినపుడు స్నేహంతో శాశ్వత సౌహార్ద్రత్సంబంధాలు ఏర్పాటుచేయడం కాదు.

గిరిజనులకు జీవన ప్రమాణస్థాయి మెరుగుపరచాలి గృహ నిర్మాణం ఆరోగ్యం గాలి, వెల్తురులతో పాటు వారి మత విశ్వాశాలకు అనుగుణంగా సాగించాలి. పరస్పర సంబంధాలు పరస్పర అవగాహనవలన గృహనిర్మాణం సాగించవచ్చు. వారి ఆచారాలకు సంప్రదాయాలకు, శీతోష్ణస్థితికి వృత్తి జీవవానికి అనువైన ఆస్తుల్ని రూపొందించి వారికి నచ్చచెప్పి ఒప్పించితే వారు తప్పక అంగీకరిస్తారు. వీరిలో అంటువ్యాధులు వంటివి చాలా ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తుంది. కొండప్రాంతాలలో అస్పత్రులు ఏర్పాటు చేసి వీరికి వైద్యసదుపాయాల్ని వినియోగించేటట్లు సుముఖుల్ని చేయాలి. వాళ్లను ముఖ్యంగా అంటువ్యాధులు, సుఖవ్యాధులు నుంచి కాపాడాలి. గిరిజన పాఠశాలలు ఏర్పాటు చేయాలి. భారత సమాజంలో భాగస్వాములగానే పరిగణించాలి. వారి వ్యవసాయ విధానంలో ఇతర వృత్తులలో ఆధునిక నైపుణ్యాన్ని సహృదయతతో వారు అంగీకరించేటట్లు ప్రబోధించాలి. అప్పుడు వారి అర్థిక విధానం పటిష్టం అవుతుంది. గిరిజన కార్పొరేషన్లలో వారు పండించిన తయారుచేసిన వస్తువులు లాభసాటిగా విక్రయించే అవకాశం

ప్రభుత్వం విస్తృతంగా కల్పించాలి.

గిరిజనుల ఆధ్యాత్మిక మానసిక విలువల్ని గౌరవించాలి సంరక్షించాలి గిరిజనులలో పేరుకొనిపోయిన మూడనమ్మకాలు స్నేహసంపదతో క్రమేపి పారద్రోలి ఆధునిక సాంకేతిక, వైజ్ఞానిక జీవనానికి అలవాటుచేయ ప్రయత్నించాలి.

గిరిజనులలో ఆర్థిక, సాంఘిక రాజకీయరంగాలలో సమగ్ర సమృద్ధి సాధించిననాడే దేశం ముందడుగు వేస్తుందన్నభావంతో ప్రభుత్వం ప్రయత్నించిన చిత్తశుద్ధితో, లక్ష్యశుద్ధితో ధ్యేయం గిరిజనాభ్యుదయంలో నూతన అధ్యాయం యేర్పరచి జగతికి సుగతి చూపేరోజు ప్రగతికిచేరేరోజు రేపో మాపో రాకపోదని ఆశ, ఆకాంక్ష, గోదావరి పులకరింతలు కృష్ణవేణి పులకరింతలతో ఆంధ్రప్రదేశ్‌లో గిరిజనాభ్యుదయ పథకాల వేదంలౌ విహరించి విజయవంత మవుతాయని ప్రగాఢ విశ్వాసం గిరిజనాభ్యుదయం లేనిదే భరతావనికి మనుగడలేదు.

*

# గిరిజనులు - గిరిజన సంస్కృతి

డా॥ బాలగోపాల్

ప్రతి దేశానికి తన నైసర్గిక, చారిత్రక, సామాజిక, ప్రత్యేకతలు కొన్నివుంటాయి.భారత దేశానికి గల ప్రత్యేకతలలో 'గిరిజనులు' అనేజాతి ఒకటి. ఇతర దేశాలలో గిరిజనులు లేరని కాదుగాని, మనదేశంలో గిరిజనులకు ఒకప్రత్యేకమయినస్థానంవుంది. సంఖ్యారీత్యా జనాభాలో 7 శాతమే అయినా గిరిజనులు దేశంలోని అన్నిరాష్ట్రాలలోను నివసిస్తున్నారు. బ్రిటీష్ వాళ్ళ కాలంనుండి ఇప్పటిదాకా మనదేశం సాధించిన 'అభివృద్ధి' వల్ల అత్యధికంగా నష్టపోయింది గిరిజనులే. అత్యధికంగాఈ150సంవత్సరాలలో తిరుగుబాట్లు చేసిందీ గిరిజనులే!

గిరిజనులు అనగానే తలలో ఈకలు, మొలలో గజ్జలు ఉండే విచిత్రజీవుల సామాన్య నాగరికులు భావిస్తారు. ఎక్కడో అడవులలో నివసిస్తూ తెల్లబట్టలు కనబడగానే పారిపోయే భయస్తులు అని కొంత చదువుకున్న వాళ్ళు భావిస్తారు. గిరిజనుల మాటే చెప్పాలంటే వాళ్ళు తమను తాము 'కొండమనుషుల'గాను 'అడవి మనుషుల' గాను వర్ణించుకుంటారు. ఈ రకంగా చూస్తే వాళ్ళకు మనం పెట్టుకున్న గిరిజనులు, ఆటవికులు, అనే పేర్లు వాళ్ళ చైతన్యం యొక్క సంస్కృతీకరణే.

హిందీ తదితర ఉత్తర భారతదేశపు భాషలలో ఈ రెండు పేర్ల బదులు "ఆదివాసులు" అన్న పేరు ప్రయోగిస్తారు. గిరిజనులే ఈ దేశంలో నిజమయిన ఆదివాసులని 'మనం' అంతా ఎప్పుడో ఒకప్పుడు బయట నుండి వచ్చి ఆదివాసులను అడవులలోకి తరిమేసిన వాళ్ళమని, ఈ ప్రయోగం వెనక ఒక సిద్ధాంతం వుంది. ఇంకొంచెం విడమర్చి చెప్పాలంటే, మొదట ద్రావిడులు వచ్చి ఆదివాసులను అడవులలోకి తరిమివేయగా ఈ సిద్ధాంతం ఏ పుస్తకంలోనూ రాయకున్నా దీన్ని నమ్మేవాళ్ళు చాలా మంది ఉన్నారు.

మనదేశానికి మొదట బయటినుండి ద్రావిడులు (అంటే ద్రవిడ భాష మాట్లాడేవాళ్ళు) తరువాత ఆర్యులు, వచ్చినమాట వాస్తవమే. ఇవ్వాళ వీళ్ళ భాషలు ప్రబలంగా ఉండడాన్ని బట్టి చూస్తే ఇక్కడి ఆదివాసుల మీద వీళ్ళు ఆధిపత్యం నెటకొల్పినట్టు గూడ తోస్తుంది. అయితే వీళ్ళు ఆదివాసులను అడవులలోనికి తరిమివేసి తాము మైదానాలను అక్రమించుకున్నార్న సిద్ధాంతానికి ఋజువు దొరకదు. వీళ్ళు 'శుద్ధంగా' ఎన్నడు ఉండలేరు. ఇక్కడి ఆదివాసులతో కేవలం సామాజికంగానే కాక భౌతికంగా గూడ కలిసిపోయారు. ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే ఇవ్వాళ మైదానాలుగా ఉన్న ప్రాంతాలు ఎల్లప్పుడూ మైదానాలుగా లేవు. ఒకప్పుడవి దట్టమయిన అడవులుగా వుండేవి.

విదేశాల నుంచి వచ్చిన ద్రావిడులు "అంశ"ఇవ్వాల్టి గిరిజనేతరులలోనేకాదు గిరిజనులలోనూ వుంది. ఆదివాసుల "అంశ" గూడ ఇద్దరిలోనూ ఉంది. ఇవ్వాల్టి తెగలలో కొన్నింటిని శాస్త్రజ్ఞులు ద్రవిడపూర్వ తెగలుగా గుర్తిస్తే మరికొన్నింటిని ద్రవిడ తెగలుగా గుర్తిస్తారు. నీలగిరి కొండలలోని తోడ పశుపోషక తెగనయితే ద్రవిడపూర్వ తెగగాని, ద్రవిడ తెగగాని కాదని, బహుశా పశ్చిమ ఆసియా నుండి వచ్చి ఇక్కడ స్థిరపడ్డ తెగ అని, భావిస్తారు. బంజారా (లంబాడా)లు గూడ పశ్చిమ ఆసియా నుండి వచ్చిన తెగ అనే అభిప్రాయం ఉంది.మరైతే యివ్వాళ కనుపించే గిరిజన గిరిజనేతర విభేదానికి మూలాన్ని ఎక్కడ చూడాలంటే దానికి సమాధానం వేరేవుంది.

మనదేశమంతా ఒకప్పుడు అడవే అయినట్లు మనం అంతా గూడ ఒకప్పుడు ఆటవికులమే. వేట, పశుపోషణ, ఆహార సేకరణ, పోడువ్యవసాయం, జీవనాధారాలుగా వుండేవి. ద్రావిడులయినా ఆర్యులయినా మన దేశానికి వచ్చినప్పుడు ఈ స్థాయిలో ఉన్నవారే. సామూహిక శ్రమ, సమిష్టి జీవనం, సమానత్వం, ఆ స్థాయికి తగ్గ సామాజిక సంబంధాలు. ఇది క్రమంగా విచ్ఛిన్నమవుతూ వచ్చి నదీ డెల్టా ప్రాంతాలలోనూ, లోయలలోనూ, ఇతరత్రా వ్యవసాయ యోగ్యమయిన ప్రాంతాలలోనూ స్థిర వ్యవసాయం ప్రారంభమయి, ఆదిమ ఆటవిక సమాజం నశించి అడవులు క్రమంగా మైదానాలయ్యాయి. ఆటవిక సమాజం ఒకరినొకరు దోచుకునే వ్యవసాయిక వర్గ సమాజంగా మారింది. ఆనాటి వ్యవసాయ పద్ధతుల పరిధిలో అంతగా వ్యవసాయ యోగ్యంకాని కొందరూ, పీఠభూములూ అడవులగానే ఉండిపోయాయి. మైదాన ప్రాంతాల ప్రజలు ఆటవిక సామూహిక సంబంధాలు వదలుకొని మనదేశపు వర్గ సమాజానికి ప్రత్యేక లక్షణమయిన కుల సంబంధాల నిర్మాణంలోకి వచ్చారు. ఇట్లా నాగరికులయిన వాళ్ళు ఎప్పటికప్పుడు విస్తరిస్తూ చుట్టూ వున్న అడవులను ఆక్రమించుకొని మైదానాలను చేస్తూ అక్కడికి ఆటవికులను వర్గ సమాజపు అధోభాగానికి బలవంతంగా కలుపుకుంటూ వాళ్ళను గూడ ఈ విధంగా నాగరికులను చేస్తూ వచ్చారు.

మనదేశం యొక్క సామాజిక-నైసర్గిక లక్షణాలను దృష్టిలో ఉంచుకుంటే ఈ చారిత్రక క్రమాన్ని పునర్నిర్మించుకోవచ్చు. మూడు నుండి నాలుగు వేల సంవత్సరాల క్రితం సముద్ర తీరములోని నదీ డెల్టాలలోనూ నదీలోయలలోనూ, ఇతరత్రా అనుకూలమయిన ప్రాంతాలలోనూ, ఆటవిక సమాజం నశించి వ్యవసాయిక వర్గసమాజం ఏర్పడడం ప్రారంభమయింది. సముద్ర తీరములోని పల్లపు భూములు, కృష్ణ, గోదావరి, కావేరి, మహనది, నర్మద, తపతి, ఇతర ఉత్తర భారతదేశపు నదులు, ఒక్కొక్కటి ఒక్కొక్క కేంద్రమయింది. ఈ ఒక్కొక్క కేంద్రంలో ఏర్పడ్డ వర్గ సమాజం ఒక్కొక్క 'జాతికి' (తెలుగు,

తమిళ, మలయాళ, మరాఠా, ఒరియా, వగైరా) బీజమయింది. ఈ జాతులు ఆ కేంద్రంనుండి వీలైనంత దూరం విస్తరిస్తూ అడవులను మైదానాలను చేస్తూ అక్కడి ఆటవికులను తమలో బలవంతంగా కలుపుకుంటూ పోయాయి. ఈ విధంగా ఒక్కొక్క ఆధునిక జాతి ఏర్పడింది. ఒక జాతికి మరొక జాతికి మధ్య వాటి విస్తరణకు ఇంతవరకు లొంగని అడవులు, పీఠభూములు, మిగిలిపోయాయి. అక్కడ నివసించే ఆటవికులు ఆర్థికంగా ఇప్పటికీ ఆటవికులుగానూ సాంస్కృతికంగా ఏ జాతికి చెందనివారుగాను మిగిలి పోయారు. అందుకే మనదేశంలో ఏ రెండు పరిసర రాష్ట్రాలను తీసుకున్నా వాటి సరిహద్దులో అడవులు, కొండలు, పీఠభూములు, అక్కడ నివసించే గిరిజనులు కనబడతారు. ఏ రాష్ట్రంలోనూ గర్భంలో గిరిజనులు కనబడరు మన రాష్ట్రాన్నే తీసుకుంటే ఉత్తర సరిహద్దుకు ఒక చివరనున్న శ్రీకాకుళం నుండి పడమటికి ఆదిలాబాద్, నిజామాబాద్ దాకా దట్టమయిన అడవులు, కొండలు. ఆ అడవులలో నివసించే సవర, జాతాపు, కోయ, కొండరెడ్డి, నాయకపు, గోండు, కోలాం, తదితర గిరిజనులు కనబడతారు. ఈ సరిహద్దు దాటితే ఒరియా, హిందీ, మరాఠి భాషలు మాట్లాడే నాగరికులు తగులుతారు. అలాగే దక్షిణాన రాయలసీమ జిల్లాలో తూర్పు కనుమలు, నల్లమలై కొండలు, ఈ అడవులలో నివసించే చెంచు, యానాది ఎరుకల, గిరిజనులు కనబడతారు. ఆ సరిహద్దు దాటితే తమిళ, కన్నడ జాతులు తగులుతాయి.

ఇది ఏ రాష్ట్రానికయినా వర్తిస్తుంది. ఒరిస్సాకు దక్షిణ సరిహద్దు జిల్లా అయిన కొరాపుట్‌లో సవర, బోండ్, గదబ తెగలు నివసిస్తాయి. అటుచివర ఒరిస్సాను బీహార్ నుండి వేరుచేసే చోటానాగపూర్ పీఠభూమి అడవులలో కోప్- ఒరవాన్, సంథాల్, ముందు తెగలు నివసిస్తాయి. తూర్పు పశ్చిమబెంగాల్ సరిహద్దులోని చిటగాంగ్ కొండలలో చక్మా గిరిజనులు నివసిస్తారు. గుజరాత్-రాజస్థాన్ రాష్ట్రాల సరిహద్దు పీఠభూమిలో బిల్లులు నివసిస్తారు. మహారాష్ట్ర దక్షిణ సరిహద్దులో వర్లీలు, తమిళనాడు, కేరళ సరిహద్దులో, పడమటి కనుమలలో పాలియన్‌లు, తమిళనాడు, కర్నాటక సరిహద్దు దగ్గరున్న నీలగిరి కొండలలో తోడ తెగ గిరిజనులు మహారాష్ట్ర మధ్యప్రదేశ్ సరిహద్దు అడవులయిన సిరోంచ బస్తర్‌లలో గోండులు, కోయలు నివసిస్తారు.

ఈ గిరిజనులందరూ గూడా ఇప్పటివరకు ఆయా ప్రాంతాల వర్గ సమాజ విస్తరణకు లొంగనివాళ్ళు. ఈ విస్తరణ, మనదేశ చరిత్రలోని ముఖ్యమైన భౌతిక క్రమాలలో ఒకటి. నాలుగువేల సంవత్సరాలుగా మైదానాలు, అడవులను ఆక్రమించుకుంటున్నాయి. ఇది ఇప్పటికీ అంతరించని క్రమం, ఇది శాంతియుతంగాను మర్యాదగాను సాగిందని అనుకుంటే భ్రమే అవుతుంది. ఇవ్వాళ కాంట్రాక్ట్‌ద్వారా, ప్లాంటేషన్‌ల ద్వారా, వడ్డీ

వ్యాపారస్తుల ద్వారా, గిరిజనేతర భూస్వాములు భూ ఆక్రమణ ద్వారా, ఎంత దౌర్జన్యంగా సాగుతున్నదో గతంలోగూడ అంతే దౌర్జన్యంగా సాగింది. మౌర్య చక్రవర్తి అశోకుడి ఘనతను కీర్తించే చరిత్రకారులు అయన అడవులను వ్యవసాయం కిందికి తీసుకురావడానికి చేసిన ప్రయత్నాన్ని ప్రముఖంగా ప్రస్తుతిస్తారు. కొత్తగా భూములు వ్యవసాయం కిందికి వస్తే, రాజుగారికి రెవెన్యూ పెరుగుతుంది కాబట్టి, అడవులను నరికి వ్యవసాయ యోగ్యం చేసి కొత్తగా ఏర్పడ్డ గ్రామాలకు కొంతకాలం రెవెన్యూ మాఫీ చేసేవాడు. కౌటిల్యుడు అర్థశాస్త్రంలో గూడ ఇటువంటి ఎత్తుగడల ప్రస్తావన ఉంది. ఈ విధంగా రాజుగారి ప్రోత్సాహంతో చాలామంది నాగరికులు అప్పటికింకా దట్టమయిన అడవులతో నిండివున్న గంగా, యమునా లోయలను వ్యవసాయ యోగ్యం చేశారు. అప్పటి ఆటవికులు ఈ అక్రమానికి లొంగిపోయి తమ స్వతంత్ర జీవితాన్ని వదిలిపెట్టి కూలీలుగా మారిపోక తప్పలేదు. హిందూ సమాజపు నిమ్నకులాలలో (ఎక్కువగా మాల మాదిగ కులాలలో) కలిసిపోయారు. ఈ మార్పును ప్రతిఘటించ దలచుకున్న వాళ్ళకు సారవంతమయిన మైదానాలను వదిలి చోటానాగపూర్ వంటి పీఠభూమి ప్రాంతాలకు వెనక్కి వెళ్లడం తప్ప గత్యంతరం లేదు కాబట్టి కొంత ప్రతిఘటించినా, అంతిమంగా చాలామంది లొంగిపోయే ఉంటారు. అశోకుడి కాలంలో చక్రవర్తి ప్రోత్సాహంతో జరిగిన ఈ దౌర్జన్యం ఇతర కాలాలలో చాలా మామూలుగా జరుగుతూనే వచ్చింది.

ఈ రకంగా ఆటవికులను నాగరికులను చేస్తూ నాగరిక వర్గ సమాజపు అధోభాగంలో (కూలీవర్గంగా, తక్కువ కులాలుగా) కలుపుకుంటూ వచ్చిన అత్యంత ప్రధానమయిన ఈ క్రమానికి మనకు ప్రత్యక్షమయిన సాక్ష్యాలుగాని ఆధారాలుగాని దొరకవు. ముస్లిం రాజవంశాల పరిపాలనకు పూర్వం మన దేశంలో ప్రజల చరిత్ర అటుంచి రాజుల చరిత్ర సహితం ఎవ్వరూ రాయలేదు. అయితే ఈ క్రమం యొక్క ప్రతిబింబం మన పౌరాణిక సాహిత్యంలోనూ, గిరిజనుల పురాణ గాధలలోనూ, కనబడుతుంది. గిరిజనుల దేవతలు, వాళ్ళ "ఆదిపురుషులు" హిందూ పురాణాలలో ప్రవేశిస్తారు. హిందూ దేవతలలో సమానంకాదు, వాళ్ళ సేవకులుగా, భక్తులుగా వాళ్ళ కరుణా కటాక్షాలచేత పునీతులయిన పావులుగా హిందూ పౌరాణిక హీరోలకు రెండవ భార్యలుగా కనబడతారు. హిందువుల వర్గసమాజంలోకి అల్పస్థాయిలో ప్రవేశించినవారు వాళ్ళ సాహిత్యంలోకి గూడ అల్పస్థాయిలో ప్రవేశించటం తప్పలేదు.

రాముడి దర్శనం కోసం పడిగాపులు కాసి అతడు తాను ఎంగిలి చేసిన ఫలాల్ని తినగానే జన్మ తరించిందనుకున్న శబరి సవరతెగకు చెందిన స్త్రీ. రాముడు అరణ్యాలకు పోతున్నప్పుడు దారిలో సేవచేసిన గుహుడు చోటానాగపూర్ ప్రాంతానికి చెందిన సంథాల్, కోల్ లేక ఒరవాన్ తెగ గిరిజనుడు అయివుండాలి. ద్రోణుడు విలువిద్య నేర్పడానికి

ఏరాకరిస్తే అతని విగ్రహాన్ని ప్రతిష్ఠించి తానే విలువిద్య అభ్యసించి, చివరికి ఆ గురువుగారికి గురుదక్షిణగా తన బొటనవేలు ఇచ్చిన ఏకలవ్యుడు భిల్లుతెగకు చెందినవాడు. అడవిలో పడుకున్న కృష్ణుడిని దూరం నుండి చూసి మృగం అనుకుని బాణంవేసి చంపిన జండుడుగూడ భిల్లు తెగకు చెందినవాడే. ఈ విదంగా హిందూ పురాణాలలోనికి హేయమయిన స్థానంలో ప్రవేశించడమేకాక, తమ పౌరాణిక గాథలలోగూడ గిరిజనులు దానిని ఆమోదిస్తారు. కృష్ణుడిని చంపిన పాపంవల్ల భిల్లులకు విల్లంబులు వాడరాదనే శాపం తగిలిందని, అందుకే భిల్లులు విల్లంబులు వాడలేరని నమ్ముతారు. పాండవులు లక్కయింటి నుండి తప్పించుకొని అడవులలో తలదాచుకుంటున్నప్పుడు భీముడు హిడింబి అనే ఆటవిక స్త్రీని పెళ్ళి చేసుకొని ఆమెవల్ల ఒక కొడుకు పుట్టగానే ఆమెను తరిమేస్తాడు. మన దేశంలోని అన్ని గిరిజన తెగలలోకి అత్యధిక సంఖ్యాకులయిన గోండులు తమను తాము ఆ హిడింబి సంతానంగా భావిస్తారు. గోండులకు 'భీం' ముఖ్యమయిన దేవుళ్ళలో ఒకడు 'భీం' అనేది చాలా సామాన్యమయిన పేరు. ప్రతి సంవత్సరం భీమ హిడింబిల వివాహాన్ని గోండులు విప్పసారాతో వేడుకగా జరుపుకుంటారు. నల్లమలై కొండలలో నివసించే చెంచులలో గూడ ఇటువంటి పురాణమే ఉంది. అడవులలో తిరుగుతున్న నరసింహుడు ఒక చెంచు యువతిని పెండ్లి చేసుకొని ఆమెకు చెంచులక్ష్మి అని నామకరణం చేసి వైకుంఠం తీసుకుపోతాడు. అక్కడి ఆదిలక్ష్మి (మార్వాడీల లక్ష్మి) ఈ సవతిని ఒల్లకపోయే సరికి నరసింహుడు విధిలేక ఆమెను వదిలిపెడతాడు. అందువల్ల చెంచు స్త్రీలకు అందవికారంగా ఉండాలనే శాపంకూడా ఉందని చెంచులు నమ్ముతారు. అంటే నాగరిక సమాజానికి లొంగిపోయే క్రమంలో, ఆటవిక స్రీలు "అందగత్తెలు" కారన్ననాగరిక ప్రమాణాన్ని తాముకూడా ఆమోదించడమే కాక దానికి ఇటువంటి కథద్వారా పౌరాణిక, వివరణ' గూడ ఇచ్చుకుంటున్నారు. సాంస్కృతిక దౌర్జన్యం ఎంతబలంగా ఉండగలదో దీనివల్ల అర్థమవుతుంది.

రామాయణం రాసిన వాల్మీకిగూడ భిల్లుతెగకు చెందినవాడే. అతడు "బందిపోటు' ' అనీ, రామాయణం రాసి పునీతుడయ్యాడనీ మనం చదువుకున్నాం. వాస్తవానికి భిల్లులు చాలావరకు ఆహార సేకరణ మీద ఆధారపడి జీవించే తెగ. అంటే కనబడ్డ ఆహారాన్ని ఏరుకొని (జంతువయితే పట్టుకొని) జీవిస్తారు. స్వంత ఆస్తి మీద ఆధారపడే వర్గ సమాజం ఆహార సేకరణను దొంగతనంగా భావిస్తుంది. భావించడమేకాదు, ప్రతీ వస్తువునూ ఎవరో ఒకరి ఆస్థిగా ప్రకటించడంవల్ల వాళ్ళను బలవంతంగా దొంగలుగా మారుస్తుంది. శాసనాలంటే చాలా ప్రేమ ఉన్న బ్రిటీష్‌వాళ్ళు వీళ్ళకు క్రిమినల్ ట్రైబ్స్ అని పేరుగూడ పెట్టారు. భిల్లుడయిన వాల్మీకికి ఈ విధంగా నాగరికులచేత బందిపోటుగా గుర్తించబడ్డాడు. గుర్తించబడి, ఆ నాగరికులకు పవిత్ర గ్రంథమైన రామాయణాన్ని రాసి పవిత్రుడయ్యాడు.

వర్గసమాజం గిరిజనులను లోబరుచుకునే క్రమంలో వాళ్ళ దేవుళ్ళనూ గుళ్ళనూ స్వంతం చేసుకుంది. కర్నూలు జిల్లాలోని శ్రీశైలం అహోబిలం దేవాలయాలు ఒకప్పుడు చెంచులవేనని చరిత్రకారులు నమ్ముతారు. తిరుపతి, భద్రాచలం, మొదలైన కొండలలోనూ, అడవులలోనూ వున్న దేవాలయాలు చాలావరకు ఒకప్పుడు చెంచులవేనని చరిత్రకారులు నమ్ముతారు. తిరుపతి, భద్రాచలం, మొదలైన కొండలలోనూ, అడవులలోనూ వున్న దేవాలయాలు చాలావరకు ఒకప్పుడు గిరిజనులవేనని చెప్పవచ్చు. అడవులను ఆక్రమించుకొని, అక్కడ ఆటవికులను కూలివాళ్ళగానూ శిస్తు చెల్లించే రైతులగానూ లోబరుచుకునే క్రమంలో భాగంగా వాళ్ళ దేవుళ్ళకు ప్రమోషన్ ఇచ్చి విష్ణు అవతారంగానో ఈశ్వరుడి ప్రతిరూపంగానో గుర్తించాల్సిన అవసరమే లేకపోతే అంతటి మారుమూల ప్రాంతాలలో దేవాలయాలు నిర్మించాల్సిన అవసరం ఏ రాజుగారికయినా ఎందుకు కలుగుతుంది? అయితే ఇదంతా ప్రయత్న పూర్వకంగా చేసిన కుట్ర అనుకుంటే పొరబాటవుతుంది. చరిత్రలో 90 శాతం కుట్రలు ఎవ్వరి ప్రయత్నం లేకుండ, చరిత్ర గమనంలో భాగంగానే జరిగేవి. జరిగిన తరువాత వాటిని వివరించే పౌరాణిక గాధలు గూడ 90 శాతం ఎవరి ఉద్దేశ్యం లేకుండ కల్పించబడతాయి. పూరీ జగన్నాధుడి దేవాలయం యివ్వాళ హిందువులకు ముఖ్యమైన పుణ్యక్షేత్రాలలో ఒకటి. కాని ఆ గుడిలో జగన్నాధుడి బొమ్మను చూసిన వారెవరికైనా అతడు ఆటవికుల దేవుడని నిస్సందేహంగా తెలుస్తుంది. మామూలుగా హైందవ దేవుళ్ళ విగ్రహాలకుండే అంగసౌష్టవంగాని కూర్పుగాని ఉండదు. చాలా "ఆటవికంగా" వుంటుంది. ఆ గుడి ఒకప్పుడు బీహార్-బెంగాల్-ఒరిస్సా రాష్ట్రాల సరిహద్దులలో నివసించే లోథా తెగ గిరిజనులది. ఆ లోథా తెగను లోబరచుకొని కోస్తా ఒరిస్సాకు పాకిన హైందవ వర్గసమాజం ఆ గుడిని స్వంతం చేసుకుంది. ఈ దురాక్రమణను లోథాలు ఒక కథద్వారా పునాణికరించు కున్నారని కమలాదేవి ఛటోపాధ్యాయ అంటుంది పూరీలో మహారాజు జగన్నాథుని విగ్రహాన్ని లోథాల దగ్గరి నుండి దొంగిలించేందుకు తన మంత్రిని పంపాడట. ఆ మంత్రి లోథాల ప్రభువు కుమార్తెను ప్రేమిస్తున్నట్లు నటించి ఆమెను పెళ్ళి చేసుకొని కొంతకాలం అక్కడే నివసించాడట. నెమ్మదిగా వాళ్ళ విశ్వాసం సంపాదించి విగ్రహాన్ని చేజిక్కించుకొని భార్యను వదిలి పెట్టి వెళ్ళిపోయాడట.

ఇవ్వాళ మనం మనకళ్ళముందు ఇటువంటివి చూడగలుగుతాం ఒకప్పుడు కేవలం గిరిజనుల పుణ్యతీర్థాలయినవి (ఉదాహరణకు తెలంగాణాలోని కేస్లాపురం, మేడారం వగైరా) యిప్పుడు క్రమంగా గిరిజనేతరులు జాతరలవున్నాయి. కొంత కాలానికి అక్కడి గిరిజన దేవుళ్ళ అవతారాలుగా పరిణామం చెంది గిరిజన దేవుళ్ళ స్థానంలో హిందూ దేవాలయాలు వెలిసినా ఆశ్చర్యంలేదు. (ఆదిలాబాదులోని గోండ్ల పుణ్యస్థలమయిన కేస్లాపురంలో శివుడి ఆలయం నిర్మించాలని అక్కడి కాంగ్రెసు (ఐ) యువకులు

సూచించారు) గిరిజనుల అడవులను ఆక్రమించుకొని వాళ్ళను భూమిలేని రైతులుగాను వేతన కూలీలుగాను మారుస్తున్న క్రమానికి యిది సాంస్కృతిక ప్రతిబింబమే తప్ప వేరేకాదు. ఈ క్రమం ప్రాచీనమయినదే అయినా ఇప్పుడు మరింత వేగంగా సాగుతోంది. ఫ్యూడల్ రాచరిక ప్రభువులకు అడవుల వల్ల వుండే ఉపయోగాలు చాలా పరిమితమయినవి. సామ్రాజ్యవాదం అలాకాదు. అడవులలో కలపనుండి ఖనిజాల వరకు ఎన్నిరకాల వనరులుంటే అన్నీ సామ్రాజ్యవాదానికి కావాలి. అందుకే గత 150 సంవత్సరాలలో మారినంత వేగంగా గిరిజనుల జీవితం ఎన్నడూ మారలేదు. గత కాలంలో కొన్ని వందల సంవత్సరాల పరిణామ ఫలితంగా గిరిజనులు కూలీలగాను రైతులగాను మారి వర్గ సమాజపు వర్గచట్రంలో ఇరుక్కున్నారు. ఇవాళ ఒక్క ఖని తవ్వకమయినా ఒక్క ప్రాజెక్టు నిర్మాణమయినా ప్లాంటేషన్ల కోసం అడవుల సంరక్షణ అయినా కొద్ది సంవత్సరాల కాలంలో కొన్ని వేలమంది గిరిజనుల జీవితాలను చిన్నా భిన్నం చేస్తుంది. గోదావరి మీద ఇచ్చంపల్లి ప్రాజెక్టు నిర్మిస్తే అది ఒక్కదెబ్బతో అక్కడి గోండుకోయ తెగల జీవితాలలో రెండు శతాబ్దాల పరిమాణాన్ని సాధిస్తుంది.

గిరిజన సంస్కృతి : ఈ పరిణామం పట్ల ఇవ్వాళ చాలా విస్తృతంగా వ్యతిరేకత కనబడుతోంది. భౌతికవాద దృక్పథంతో చూసేవాళ్ళకు దీన్ని విమర్శించడంలో ఎటువంటి సందేహం ఉండదు. కలప పరిశ్రమ, ఖనిజ పరిశ్రమ, అభివృద్ధి చెందటం వల్ల దేశానికీ లాభం కాబట్టి ఈ పరిణామాన్ని వ్యతిరేకించ కూడదని పాలకవర్గాలు బోధిస్తారు. అయితే ఈ ప్రాజెక్టులవల్ల 'దేశానికి' లాభం కలుగుతోందని అంగీకరించడం కష్టం. లాభపడుతున్నది 'దేశమే' అయితే మరి గిరిజనులు గూడ దేశంలో భాగమే కదా, వాళ్ళెందుకు నష్టపోతున్నారు? గిరిజనులకేకాదు, అడవుల సమీపంలో నివసించే సామాన్య గిరిజనేతరులకు గూడ లాభం కలగడంలేదు. లాభమంతా పెద్ద వ్యాపారస్తులకు, సామ్రాజ్యవాద దేశాలకూ కలుగుతోంది. అడవులనుండి బయటకు వెళ్ళే కలప అయినా తునికాకయినా బొగ్గు ఇనుము తదితర ఖనిజాలయినా అంతిమంగా ఎక్కడికీ చేరుకుంటాయో, మార్గమధ్యంలో ఎవరెవరికి ఎంతెంత లాభాలు సమకూరుస్తామో పరిశీలిస్తే ఈ 'దేశానికి లాభం అనేది ఎంత బూటకమో అర్థమవుతుంది. అడవుల నుండి రవాణా చేసే ట్రాన్స్‌పోర్ట్ కంపెనీల యజమాన్లు, ఆ సరుకును వినియోగించే టింబర్ మిల్లులు బీడీ కార్ఖానాలనుండి ఇనుము ఉక్కు ముడిసరుకును వినియోగించే పెద్ద పరిశ్రమల దాకా వివిధ పరిశ్రమల యజమాన్లయిన విదేశీ గుత్త పెట్టుబడిదారీ కంపెనీలు, ప్రభుత్వాలు, వీళ్ళే తప్ప దేశానికి ఎంతమాత్రం లాభం ఉండదు. దేనివల్లనయినా దేశానికి లాభం కలిగించే వ్యవస్థ మనదగ్గర లేదు. ఆస్తిపరులయిన దోపిడి వర్గాలకు మాత్రమే ఈ వ్యవస్థ లాభం కలిగిస్తుంది. శ్రామికులకు లాభం అటుంచి చేసిన శ్రమకు సగం ఫలమే తప్ప పూర్తిఫలం గూడ దక్కదు.

ఈ రకంగా భౌతికవాద దృక్పథంతో చూసేవాళ్లే కాకుండ, గాంధేయ వాదులూ తదితర నానారకాల భావుకులూ గూడ ఈ మార్పును వ్యతిరేకిస్తున్నారు. దీనికి వాళ్ళలో చాలామంది చూపించే కారణమేమిటంటే గిరిజనుల సంస్కృతిలోని "ఉన్నత'''మయిన లక్షణాలను వీళ్ళు ఎత్తి చూపుతారు. పెట్టుబడిదారీ సమాజం పూర్తిగా నాశనం చేసిన కళాత్మక, సామూహిక జీవనం, గిరిజనులలో ఉంటాయి. వీటిని నాశనం చేయకూడదని, పదిలంగా కాపాడాలని "మనం గిరిజనుల నుండి నేర్చుకోవలసినది చాలా వుందని" వీళ్ళు సవినయంగా చెప్తారు. భౌతిక జీవితాన్ని గురించి పట్టించుకోకుండా సంస్కృతిని గురించి మాట్లాడడం విచిత్రమయిన విషయమే అయినప్పటికీ, భౌతికవాదులు సంస్కృతిని తక్కువ చేయరు కాబట్టి గిరిజనుల సంస్కృతిని కొంత పరిశీలించవలసిన అవసరం వుంది.

భౌతికంగా గిరిజనులలో మూడు రకాల తెగలుంటాయి. వేటమీద, అహార సేకరణమీద, ఆధారపడి జీవించేవాళ్ళు, పశుపోషకులు ఆహారాన్ని ఉత్పత్తి చేసేవాళ్ళు మొదటి రకానికి చెందిన తెగలు ఇప్పుడు చాలా తక్కువ ఉన్న కొద్ది మందీ వలన బ్రిటీష్ పాలన తాకిడికి తట్టుకోలేక "వృత్తి దొంగల"గానో లేక అతిచవకగా పనిచేసే కూలీలగానో మారిపోయారు. వడ్డెర, ఎరుకల, యానాది, తెగలు దీనికి మంచి ఉదాహరణ. పశుపోషకులలో చెప్పుకోదగ్గ తెగ ఇది. నీలగిరి కొండలలోని తోడ తెగ, ఆహారాన్ని ఉత్పత్తి చేసే వ్యవసాయదారులయిన తెగలు మాత్రమే ఇప్పటికీ ఏదో ఒక మేరకు నిలిచి ఉన్నాయి.

ఆర్థిక జీవితం ఏదయినా, సామాజిక సంబంధాలలో మాత్రం గిరిజనులలో ఐక్యత ఉంటుంది. దీనికి మూలం గిరిజనులలో భూమి తదితర ఉత్పత్తి సాధనాలలో స్వంత ఆస్తి అనేది లేకపోవడం, బ్రిటిష్ పాలకులు దేశంలో ప్రతిగుంట భూమికి ఒక యజమానికి గుర్తించాలని ఎంత ప్రయత్నం చేసినప్పటికీ ఈ సమిష్టి ఆస్తి సంబంధాల ఛాయలు గిరిజనులను ఇప్పటికీ వదలలేదు. యెవరి వ్యవసాయం వాళ్ళదే అయినా సమిష్టి పద్ధతిలో చేసినట్టు అనిపిస్తుంది. అందరూ వ్యవసాయం ఒకేసారి మొదలు పెడతారు. దానికి చేయవలసిన పూజల తంతు గ్రామం అంతా కలిపి సమిష్టిగా చేస్తారు. పంట ఒకేసారి కోస్తారు. అంగడికి అంతాకలిసే పోతారు. పెళ్లయినా చావయినా సమిష్టిగానే జరుపుకుంటారు. వంట చేసేటప్పుడు పండుగ, కోతలప్పుడు పండుగ, విప్పచెట్టు పూత చేసేటప్పుడు పండుగ, వేసవి తరువాత మొదటి వర్షం కురిసేటప్పుడు పండుగ, ఇట్లా వాళ్ళ భౌతిక ప్రాముఖ్యతను స్పష్టంగా గుర్తించగా, కొన్నిటిని భీమదేవర పెళ్ళిగానో మరొక పురాణ పురుషుడి పుట్టుకగానో జరుపుకుంటారు.

గిరిజనుల జీవితంలోని ఈ 'కట్టడి' చాలా మందిని ఆకర్షిస్తుంది. సామ్రాజ్యవాద **బూర్జువా సంస్కృతి నాగరిక సమాజాన్ని ముక్కలు చేసింది. పక్కవాడు మనకళ్ళముందు చనిపోయినా మనం పట్టించుకోనంత ఒంటరి వాళ్ళను చేసింది.** అందుకే ఈ సామ్రాజ్యవాద

యుగంలో భావుకులు చాలామంది గిరిజన సంస్కృతిలోని సమిష్టితత్వంకి ఆకర్షితులవుతున్నారు. కాని గిరిజన సంస్కృతి అక్కడితో ఆగిపోదు వాళ్ళ భౌతిక జీవితానికి ఉండే పరిమితులన్నీ అందులో ప్రతిఫలిస్తాయి. వాళ్ళకు ప్రకృతి గురించి ఉండే పరిజ్ఞానం చాలా పరిమితమయినది. కాబట్టి విచిత్రమయిన భ్రమలు ఏర్పరచుకుంటారు. కదిలే ప్రతి వస్తువులోనూ (కొన్ని కదలని వస్తువులలో గూడ) తమకున్నట్టే ప్రాణం వుందని భావిస్తారు. గాలిలో, చెట్టులో, నదులలో, భూమిలో, పైరుతో ఉన్న ఈ 'జీవి' తో మంచిగా ఉండడం అవసరం అనుకుంటారు. దానికి తిండి పెడతారు. దానికి ఏ తిండి ఇష్టం అనుకుంటారో ఆ తిండి వెతుక్కొచ్చి పెడతారు. ఇదే క్రమంగా బలులకు (నరబలులకు సహితం) దారితీస్తుంది. ఆ జీవిని ప్రసన్నం చేసుకోవడం కోసం నృత్యాలు .చేసి పాటలు పాడతారు. గిరిజనులు నృత్యాలూ పాటలూ చాలావరకు ఈ రకంగా చిల్లర దేవతలను ప్రసన్నం చేసుకోవడం కోసమే. లౌకికమైన (సెక్యులర్) నృత్యంగాని పాటగాని కళగాని గిరిజనులలో అరుదు. అందుకే కొన్ని నృత్యాలు ఎప్పుడుబడితే అప్పుడు చేయమంటే చేయరు. నిర్ణీత సమయం లోనే నిర్ణీత పద్ధతిలోనే చేస్తారు. ఒక్క నృత్యం మాత్రమే కాదు. అన్నీ నిర్ణీత పద్ధతి లోనే జరుగుతాయి. 'భయంతో బిగుసుకుపోవడం' అనే నుడికారం ఉంది. గిరిజనుల జీవితం అట్లా బిగుసుకుపోయి ఉంటుంది. భయంతో కాకపోవచ్చుగాని, తమకే అర్థంకాని విశ్వాసాలలో బిగుసుకుపోయి ఉంటుంది. పుట్టుక, పెళ్ళి, చావు, ఆట, పాట, వ్యవసాయం, అన్నీ కూడ ఖచ్చితమయిన పద్ధతిలోనే జరగాలి. ఏ మాత్రం తప్పినా ఉపద్రవం ముంచుకొస్తుంది. ఈ ప్రపంచాన్ని శాసించే అదృశ్య శక్తులను ప్రసన్నం చేసుకోవడం కోసం తామే ఏర్పరచుకున్న నియమాలు తమ నుండి పరాయీకరణ చెంది ఈ ప్రపంచాన్ని నిలబెట్టే మానవాతీతమయిన చట్రంగా మారిపోతాయి. ఆ చట్రాన్ని కదిపితే ప్రపంచమే కూలిపోతుంది. ఈ మానసిక స్థితిని అర్థం చేసుకోవాలంటే ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. మనలో ఆస్తికులైనవాళ్ళు గూడ తమ చుట్టూ ఎల్లప్పుడూ అదృశ్య శక్తులు మూగి ఉంటాయని నమ్మరు (రాత్రిపూట తప్ప) గిరిజనులు అట్లాకాదు. వాళ్ళ దృష్టిలో ఈ ప్రపంచమంతా అద్భుతమయిన అదృశ్య శక్తులతో నిండివుంటుంది. చివరికి తాముకూడ చనిపోయిన తరువాత ఎక్కడో దూరంగా ఉండే కైలాసానికో వైకుంఠానికో పోరు. గిరిజనులు వివిధ పేర్లతో పిలుచుకునే మరణానంతర నివాసస్థలం దగ్గరిలోనే వుంటుంది. (సాధారణంగా నేలకింది "పాతాళం"లో వుంటుంది.) చనిపోయినవాళ్ళు అక్కడ జీవిస్తూ వుండి ఇక్కడి నిత్యజీవితంలో కలుగజేసుకుంటూ ఉంటారు. (అందుకే భోజనం చేసేటప్పుడు - ముఖ్యంగా పండుగలప్పుడు చనిపోయిన పూర్వీకులకు రెండు ముద్దలు 'పిండం' తీసి పక్కన పెడతారు) ఈ అసంఖ్యాకమైన అదృశ్య శక్తులను ఎప్పటికప్పుడు మంచిచేసుకుంటూ వుండాలి. వాటికి కోపం తెప్పించకూడదు. తమకు ఏదయినా మంచి జరిగినా అది ఈ

అదృశ్య శక్తుల ఈర్ష్యకు గురికాకుండా (దృష్టి తగలకుండా) చూసుకోవాలి. కొన్ని తెగలలో, పంట బాగా పండినా సరే ఆ విషయం బయటికి తెలిస్తే అదృశ్య శక్తుల దృష్టి తగులుతుందేమోనని ఒక పూటంతారోధిస్తూ పంట నాశనమయిపోయిందని పాటపాడుతూ నృత్యం చేస్తారు. సవరతెగ గిరిజనులు పెళ్ళి చేసేటప్పుడు ముందు అమ్మాయికి విల్లంపాతో పెళ్ళి చేసి దానిని నదిలోకి పారేసి, ఈ విధంగా అమ్మాయి "విధవ" అయిన తరువాతే పెళ్ళి చేస్తారు. ఈ ఆటవిక ఆచారాలు ఫ్యూడల్ దశలో గూడ చాలావరకు నాశనం కావు కాబట్టి ఇవన్నీ ఏదో ఒక రూపంలో మనకుకూడ పరిచయమే. చిన్నపిల్లలను అందరూ ముద్దుచేస్తే "దృష్టి" తగులుతుందని భయపడి చీపురుకట్ట కాల్చి బూడిదతో బొట్టుపెట్టి వీలయినంత అందహీనంగా తయారుచేస్తారు.) ఈ దృష్టి భయం ఎంతగా ఉందంటే గిరిజనులు ఏ వ్యవహారాన్నైనా సూటిగా ప్రస్తావించడం ఆహంకారాన్ని సూచిస్తుంది. అది అదృశ్య శక్తి ఆగ్రహానికి గురయి వ్యవహారం బెడిసి కొడుతుంది. (ఇదిగూడ మన ఫ్యూడల్ సంస్కృతిలో ఇప్పటికీ ఉన్న వైఖరే. సూటిగా, "బిజినెస్ లైక్"గా, వ్యవహరించడం బూర్జువా అలవాటు) ఉదాహరణకు పెళ్ళి సంబంధం కుదుర్చుకోవడానికి అబ్బాయి తల్లిదండ్రులు అమ్మాయి ఇంటికి వస్తే ఇరుపక్షాలు అసలు పెళ్ళిమాట ఎత్తరు. పక్షులమీద, పశువులమీద పెట్టి మాట్లాడతారు. కమలాదేవి ఛటోపాధ్యాయ" ట్రైబలిజం ఇన్ ఇండియా" అనే పుస్తకంలో ఒక ఉదాహరణ యిచ్చారు.

"ఎవరు మీరు" అని అమ్మాయివైపు వాళ్ళు గదమాయించి అడుగుతారు. "మేము అడవులలో లోపల వేటాడే వేటగాళ్ళం. ఇవ్వాళ మేము కొట్టిన జింక పారిపోయి మీ ఇంట్లో దాక్కుంది" అని సమాధానం ఇస్తారు "అటువంటిదేం లేద'ని వీళ్ళు అంటారు. "మేము జింక రక్తపు మరకలను వెంబడించి వచ్చాము. ఇదిగో మీ ఇంటి తలుపు దగ్గర రక్తపు మరకలు; మా జింకను మాకు ఇచ్చేయండి" అంటారు.

"మా ఇంట్లో మేము చిన్నప్పటినుండి పెంచుకున్న జింక మాత్రమేవుంది. మీరు కొట్టిన జింకలేదు." అని వీళ్ళు అంటారు. ఈ విధంగా కొంత వాదన జరిగిన తరువాత అమ్మాయి తరపువాళ్ళు లొంగుతారు. "అయితే మీ జింకే అయివుండాలి. మీకు ఇచ్చేయక తప్పదు. కాని ఒకటి గుర్తుంచుకోండి మేము దాన్ని చాలా కష్టపడి పెంచాం. దానితల్లి పుష్కలంగా పాలిచ్చేది. మీ దగ్గర చేలూ అడవులు సమృద్ధిగా వుంటే తప్ప సుఖంగా వుండదు" అంటారు. దానికి అబ్బాయి తల్లిదండ్రులు "మాదగ్గర అడవులూ కంచెలూ సమృద్ధిగా వున్నాయి" అని హామీఇచ్చి స్త్రీ ధనం ఎంత ఇచ్చేది మాట్లాడుకొని పోతారు.

వీళ్ళ విషయంగూడ అంతే గిరిజనుల జీవితం చాలా కళాత్మకంగా ఉండేమాట వాస్తవమే. పాట, నృత్యం, అలంకరణ, వాళ్ళ జీవితాలను పెనవేసుకొని ఉంటాయి. వాళ్ళ

కళకూ శ్రమకూ మధ్య ఉండే సన్నిహితమయిన సంబంధాన్ని జార్జిథామస్ లాంటి వాళ్ళు గుర్తించారు. కళ వాళ్ళు శ్రమలో పొందే ఆనందాన్ని వ్యక్తం చేస్తుంది. అలసటను మరిపిస్తుంది. శ్రమ చేయడానికి కావలసిన ఉత్తేజాన్ని ఇస్తుంది. కళలలో వుండే లయ శారీరక శ్రమలోని లయనుండి పుట్టిందని థామ్సన్ అంటాడు. ఈకారణం చేతనే, బూర్జువా సమాజంలో కళ శ్రమనుండి పూర్తిగా వేరుపడి మార్కెట్‌లో సరుకుగా మారడంతో అసంతృప్తి చెందిన భా-వుకులు చాలామంది ఆటవిక జీవితాన్ని ప్రశంసిస్తారు. కాని ఇక్కడగూడ గుర్తుంచుకోవలసిన విషయం ఒకటి వుంది. గిరిజనుల నృత్యం, పాట, చిత్రలేఖనం, అలంకరణ మొ॥ కళలకు శ్రమ సంబంధమైన ఆనందంతోను, అలసటతోను, ఉత్తేజంతోను ఉండే సంబంధం అవ్యక్తమయినది. కళయొక్క అవ్యవక్తమయిన పాత్ర అంటే గిరిజనుల జీవితంలో దాని ప్రాముఖ్యత వేరేవుంది. అదేమిటంటే, వాళ్ళు నమ్మిన దేవతలను ప్రసన్న చేసుకోవడం ద్వారాగానీ, మంత్రం ద్వారాగానీ, శ్రమఫలాన్ని ఇనుమడింపజేయడం, వేటాడే గిరిజనులు తమ ఇళ్ళ గోడలమీద జంతువులను వేటాడి చంపుతున్నట్టు బొమ్మలు వేస్తారు. వ్యవసాయం చేసేవాళ్ళు పంట చేతికొచ్చే సమయం ఆసన్నమయితే పంట కోస్తున్నట్టు అభినయిస్తూ నృత్యంచేస్తారు. ఇందులో తమ శ్రమకు కళారూపం ఇచ్చుకోవడం అనే మానవీయ ప్రక్రియ అవ్యక్తమయినది. దానివల్ల వాళ్లు పొందే ఉత్తేజంగూడ అవ్యక్తమయిన ఫలమే. వీటి వ్యక్తమయిన ప్రయోజనం గిరిజనులు మూఢ నమ్మకాలతో ముడిపడి వుంటుంది. వేటజంతువులను చంపుతున్నట్లు బొమ్మవేస్తే నిజంగానే ఆ ఫలితం దక్కుతుందన్న నమ్మకం గిరిజనులలో వుంటుంది. పంటకొస్తున్నట్లు అభినయిస్తే పంట నిజంగానే పుష్కలంగా పండుతుందని ఆశిస్తారు. ఆదిమ మానవ మనస్తత్వం ఒక వస్తువుకూ ఆ వస్తువు యొక్క ప్రతిరూపానికీ (అది చిత్రపటంగానీ, నృత్య అభినయంలోని దృశ్యమేగానీ, చివరికి కృత్రిమంగా తాము ఏర్పరుచుకున్న సంకేతాలయినాగాని) తేడా చూడరు. ప్రతిరూపానికి ఏంజరిగితే వస్తువుకూ అదే జరుగుతుందని నమ్ముతుంది. ఇది చాలా ఆరిమమయిన మంత్రం (ఇంగ్లీష్‌లో సింపదిటిక్ మాజిక్ అంటారు చేతబడి అని అవశేషము) తరువాత కాలంలో ఇదే చిలువలు పలవలై అభివృద్ధి చెందిన మంత్ర తంత్రాలన్నిటికీ మూలం.

గిరిజనుల కళా జీవితమంతా గూడా ఇంతే ముగ్గులు పెట్టడంలో సౌందర్య దృష్టి అవ్యక్తమయింది. వాటి అసలు ఉద్దేశ్యం దుష్టశక్తులను దూరంగా ఉండడం. పచ్చలు పొడిపించుకుంటే శరీరాన్ని చనిపోయిన తరువాత దయ్యాలు తినకుండ కాపాడుకుంటాం. మరి వీటిలో కళ లేదా, అందులో సృజనాత్మకమయిన ఆనందం లేదా అంటే ఉన్నాయి. కాని ఆ కళ, ఆ అనందం, విశ్వాసాల పరిభాషలోనే రూపం తీసుకుంటాయి. గిరిజనుల

ఆలోచనలో వాళ్ళ విశ్వాసాలు ఎంత బలంగా అలుక్కుపోయి ఉంటాయంటే వాళ్ళ శ్రమను, కళాకాంక్షను, సృజనాత్మకతను, విశ్వాసాలను, వేరుచేయడం సాధ్యంకాదు. కళను నిజంగా శ్రమయొక్క ప్రత్యక్ష వ్యవస్తీకరణగా ఒక గిరిజనుడు సృష్టించదల్చుకొన్నా అది అతని విశ్వాసాల నుడికారంలోనే రూపం తీసుకుంటుంది. అంతిమంగా ఆ నుడికారంలోనే అతనికి అది అర్థవంత మవుతుంది.

ఈ నుడికారంనుండి గిరిజనుల జీవితాన్ని వేరుచేయటం సాధ్యం కాదు. ఈ విశ్వాసాలను తొలగించి వాళ్ల సమిష్టి జీవనాన్ని, కళాత్మక జీవితాన్ని మాత్రమే కాపాడాలనుకోవడం అర్థరహితం. గులాబి పువ్వు నుండి గులాబి రంగు తొలగించటం లాంటి ప్రయత్నం అవుతుంది అది గిరిజనుల జీవితంలోని భౌతిక వెనుకబాటుతనమే వాళ్ళ జీవితాలలో మనకు కనిపించే 'ఉన్నత' లక్షణాలకూ మూఢ విశ్వాసాలకూ రెండింటికీ గూడ కారణమని గుర్తించాలి.

కాని ఆ భౌతిక జీవితం మారవలసింది కాంట్రాక్టర్ల ద్వారా, కలప వ్యాపారస్తుల ద్వారా, సామ్రాజ్యవాద దళారీ పెట్టుబడుల ద్వారా, గిరిజనేతరులు భూ ఆక్రమణుల ద్వారా, ఇతర దౌర్జన్యాల ద్వారా కాదు. దాని వల్ల గిరిజన సంస్కృతిలోని మానవీయ అంశం నాశనమవుతుందే తప్ప భౌతిక జీవితమూ అభివృద్ధి కాదు. వాళ్ళ మూఢ విశ్వాసాలు నాశనంకావు. ఈ దేశ సంపదను మొత్తం శ్రామికుల పరం చేసే విప్లవంలో గిరిజన్నులు భాగం కావాలి. ఆ విప్లవం విజయవంతమయి, ఒక్క అడవులలోనేకాదు దేశవ్యాప్తంగా సమిష్టి జీవనాన్ని నెలకొల్పి కళనూ సంస్కృతిలోని ఉన్నత లక్షణాలు కాపాడబడాలంటే అవి మొత్తం సమాజంలో నెలకొల్పబడాలి. అంటేసమాజాన్ని మొత్తం ఆటవికులను చేయడం కాదు. ఇవ్వాళ కొందరు దోపిడీదారుల ఆస్థిగావున్న విజ్ఞానం అందరి సంపద కావాలి. ఆ సంపద ప్రాతిపదికగా, కొందరు సంపన్నుల సమాజంకాక మొత్తంగా సంపన్నమయిన సమాజం ఏర్పడాలి. ప్రకృతిని చూసి భయపడవలసిన అవసరం పోవాలి. ఆ ఉన్నతమైన మానవీయ స్థాయిలో తిరిగి సమిష్టి జీవనాన్ని ఇతర మానవీయ విలువలను సాధించాలి.

*

# కొండకోనల్లో గిరిజనులు-వారి సంస్కృతి

- భూక్యా చిన వెంకటేశ్వర్లు

స్వాతంత్ర్యం వచ్చి దాదాపు 50 సంవత్సరాలు దాటినప్పటికినీ మారుమూల గిరిజన ప్రాంతాలలో నివసిస్తున్న అనేక మంది గిరిజనులు నేటికినీ ఈ సభ్యసమాజ బాటకు దూరంగా అభివృద్ధికి నోచుకోక జీవనం సాగిస్తున్నా ఆశ్చర్యం కల్గించకమానదు.

అట్టడుగు ప్రజలకు ప్రధానంగా ఏజన్సీ ప్రాంతాలలో నివసిస్తున్న గిరిజనుల అభివృద్ధికి ప్రభుత్వపరంగా అనేక సంక్షేమ కార్యక్రమాలు చేపడుతున్నప్పటికి వాటి ఫలితాలను గిరిజనులు ఎంతవరకు అందుకున్నారన్నది ప్రశ్నార్థకంగా మిగిలిపోతుంది. పోడు వ్యవసాయానికి అలవాటుపడి కందమూలాలు సేవిస్తూ ఆటవిక పద్ధతుల్లో విల్లంబులు చేతబూని అడవి జంతువులను వేటాడి జీవించే ఆదిమజాతి గిరిజనుల్లో "కొండరెడ్లు" ప్రథములు వీరిని మైదాన ప్రాంతాలకు రప్పించి సభ్య పమాజపుబాటకు తీసుకువచ్చే ప్రయత్నాలు ఇంకా సాగుతూనేవున్నాయి.

మన రాష్ట్రంలో షుమారు 33 ముఖ్య గిరిజన జాతులున్నట్లుగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు గుర్తించాయి. ఆదిలాబాద్ జిల్లాలో గొండ్లు, యాందులు, తోంధిస్, కోలమ్ అనే గిరిజన జాతులు శ్రీకాకుళం, విశాఖపట్టణం, విజయనగరంజిల్లాలో వాల్మీకి, భగత్, మూకదొర, కొండదొర, సామంత, దదఖ, జాతులు మెహబూబ్ నగర్ ప్రకాశంజిల్లాలో చెంచు జాతి గిరిజనులు అలాగే ఖమ్మం, వరంగల్, తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాల్లో కోయలు, కొండరెడ్డి, నాయకపోడు, సుగాలి(లంబాడీలు) యిలా మొత్తం రాష్ట్ర జనాభాలో దాదాపు 50 శాతం గిరిజనులు "ఏజెన్సీ" ప్రాంతాల్లో నివసిస్తున్నారు.

ఖమ్మం జిల్లాలో దాదాపు 160 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంతో వున్న ఈ జిల్లా జనాభా 17.52 లక్షలు కాగా అందులో 4.30 లక్షల మంది గిరిజనులున్నారు. వీరిలో సుగాలీలు (లంబాడీలు) నాయకపోడు మైదాన ప్రాంతానికి చెందినవారు కాగా మిగిలిన కోయలు కొండరెడ్లలో అధికభాగం భద్రాచలం ఏజన్సీ ప్రాంతంలో నివశిస్తున్న ఆదిమజాతి గిరిజనులు.

వీరి నాగరికతను పరిశీలించినట్లయితే వారిలో ఒక ప్రత్యేకత మనకుగోచరిస్తూ వుంటుంది. నియమ నిష్టలు, కట్టుబాటులు కలిగివుంటారు. వీరిలో మూడనమ్మకాలు ఎక్కువ.

ఒకప్పుడు మన్య ప్రాంతాలుగా వున్న ఈ భద్రాచలం ఏజన్సీ ప్రాంతం కాలక్రమేణా అభివృద్ధి చెందుతున్నకొలదీ వీరి జీవన విధానంలో మార్పులు వచ్చాయి. కోయజాతి గిరిజనులు భద్రాచలం, పరిసర ప్రాంతాలలో నివసిస్తున్న కారణంగానే గిరిజనేతరులలో ఏర్పడిన సన్నిహిత సంబంధాల వల్ల అభివృద్ధి చెంది నాగరికులుగా కన్పిస్తూ వుంటారు.

వీరి పూర్వీకులు విధానానికి, వీరి జీవన విధానానికి ఎంతో వ్యత్యాసం మనకు గోచరిస్తుంది. ఈ జాతివారిలో అధికభాగం వ్యవసాయ కార్మికులు వీరికి ఒక ప్రత్యేకమైన భాష ఒకటి వుంది. కాని దానికి "లిపి" లేదు వీరి శరీరంమీద అచ్ఛాదన లేక చిన్న గుడ్డముక్కలు గోచీలుగా ధరిస్తారు. ఆనాటి వీరి పూర్వీకులు అడవి తల్లి ఒడిలో కీకారణ్యంలో నివసిస్తూవున్న వారికి అభివృద్ధి చెందుతూవున్న వీరివునికికి ఎంతో వ్యత్యాసం ప్రస్ఫుటమవుతుంది.

నేటికీ వీరిలో కొందరు పూర్వీకులు ఉనికిని తెల్పుతూ విల్లంబులు ధరించి, అడవి జంతువులను వేటాడి, ఆ అడవినుంచి సేకరించిన దుంపలను ఆహారం చేసుకుని విప్పపూవు, తాటికల్లు మొదలైన వాటితో సారాయి కాచి తయారుచేసి సేవించే అలవాటు కలదు.

వీరిలో మూఢనమ్మకాలు ఎక్కువ. ముత్యాలమ్మ, మద్దిరామక్క మొదలైన దేవతలను కొలుస్తూ కొలువులూ, జాతరలు చేస్తుంటారు.

"వీరు జరుపుకొనే పండుగలలో "కొత్తల పండుగ" "భూమి పండుగ" ప్రధానమైనది. "రెల్లో-రెల్లోరే" అంటూ ఆనందోత్సహాలతో ఈ పండుగల సందర్భంగా స్త్రీలు అర్థవృత్తాకారంగా ఏర్పడి నృత్యాలు చేస్తుంటే అడవి దున్నల కొమ్ములను ధరించిన పురుషులు కొమ్ముబూరటోలు, మొదలైన వాయిద్యాలతో లయబద్ధంగా వాయిస్తూ వచ్చితాటాకు బూరలుగా చేసి వీరు ఆనందోత్సహాలతో పండుగ జరుపుకుంటారు. వివాహాలు కూడా ఒక ప్రత్యేకరీతిలో వుంటాయి. పెండ్లికాని పిల్లపై మోజుపడి చేయిపట్టి అపహరించి బలవంతంగా వివాహం చేసుకొను ఆచారం వీరిలో వుంది. ఆ పిల్ల యిష్టపడకపోయినా ఈ వివాహం జరుగుతుంది. వివాహం అనంతరం ఆ పిల్లకీ యిష్టం లేకపోతే ఆపిల్ల (మారుమనువు) మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు. కాని ఆమెను వివాహం చేసుకునే వరుడు పెళ్ళి ఖర్చులతో సహా నష్టపరిహారం ఆపిల్ల మొదటి భర్తవాళ్ళకి చెల్లించాలి. దీనిని వివాహము రాక్షస వివాహం అంటారు.

గిరిజనుల్లో మెరుపు మెరిసినా, వాన కురిసినా, హరివిల్లు కన్పించినా, ఆనందించే అమాయకపు మనుషులింకా వున్నారు. నాగరికత వికృతరూపం ధరిస్తున్నా కట్టుబాట్లు ఆచారాలు, మార్చుకోని వారూ వున్నారు.

నాగరిక ప్రపంచంలో ఎత్తులు, జిత్తులు, కుంభకోణాలు జరుగుతున్నా, అధికారపదవులకోసం అమానుషంగా ప్రవర్తిస్తున్నా ఈ కల్తీమాయ ప్రపంచానికి దూరంగా అడవి తల్లినే నమ్ముకుని అదే ప్రపంచంగా బ్రతికే కల్మష రహితులు మనిషి మనిషికీ మధ్య అడ్డుతెగలు, మాయపొరలు లేని నిష్కల్మషం గలవాళ్ళు గిరిజనులని అనవచ్చు.

ఖమ్మం జిల్లాలో జనాభా 17,51,574 అందులో నాల్గవవంతు గిరిజనులే ఖమ్మం జిల్లా భద్రాచలం ఏజన్సీలో కోయలు, కొండరెడ్లు, గొట్టికోయలు డోలు జరిగిన జాతులవారు వున్నారు.

ఒకప్పుడు మన్య ప్రాంతమై ఈ భద్రాచలం ఏజెన్సీ ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతోంది దీనితో గిరిజనుల సాంఘిక జీవన విధానాలలో కొంత మార్పు వచ్చింది. భద్రాచలం పరిసర ప్రాంతాలలోని కోయజాతి గిరిజనులలో వేషభాషల్లో కొంత మార్పు వచ్చింది. గిరిజనేతరులతో సన్నిహిత సంబంధాలు, ప్రభుత్వ ప్రోత్సాహం వల్ల వీరు నాగరికులుగా మారారు. పూర్వీకులకన్నా వీరిలో ఎంత మార్పు వచ్చింది. ఈ కోయలు వ్యవసాయ కార్మికులు, కీకారణ్యంలో నివశిస్తూ జంతువులను వేటాడి, వారి ప్రియమైన విప్పసారా, తాటికల్లు సేవిస్తూ జీవిస్తారు. ముఖ్యమైన విత్తనాలు జల్లేముందు "భూమి పండుగ" పంటలు వచ్చిన కొత్తల్లో "కొత్తల పండుగ" జరుపుకుంటారు. వీరి పెళ్ళిళ్ళలో కట్నకానుకలుండవు. వీరి పెళ్ళిళ్ళు పెద్దల అనుమతితో సంప్రదాయ పద్ధతిగా ఉంటాయి. పిల్లలకి నచ్చకపోతే పెళ్ళి అయిన తర్వాత నష్ట పరిహారం పిల్ల అత్తవారికి చెల్లించి వివాహం (మారుపెళ్ళి) చేసుకోవటాన్ని రాక్షస వివాహం అంటారు.

కోయలలో తప్పుపట్టే పద్ధతి వుంది. వీళ్ళల్లో కట్టుబాట్లు అతిక్రమించిన వ్యక్తిపై కులపెద్దల ముందు పంచాయతీ జరుపుతారు. ఏ తగాదాలు వచ్చినా కోర్టులకు వెళ్ళరు. కుల పెద్ద నిర్ణయించిన నష్టపరిహారం చెల్లించి కులపంచాయతీకి బద్ధులై వుంటారు. ఈ నిర్ణయం వ్యతిరేకించే వ్యక్తిని వారు "అంటు"గా ప్రకటించి కులంనుంచి వెలివేస్తారు"

గొట్టుకోయలు మన్యం ప్రాంతంలో వుంటారు. వీరు చెవులకు ముక్కులకు పోగులు పెట్టుకొని గోచీలు ధరించి, పూర్తిగా ఆటవిక జీవనవిధానంలో వుంటారు.

కొండరెడ్లు కొండప్రాంతంలో నివసిస్తూ వుంటారు. కొండజొన్నలు, వెదుట బియ్యం అడవి దుంపలు ఆహారం చెవులకు పోగులు, జుట్టుకి నడినెత్తిన కొప్పు, మెడలో పూసలు వుండి విల్లంబులు ధరించి వేటకి వెళ్తారు.

గిరిజనుల సంక్షేమానికి ప్రభుత్వం ఎంతో కృషి చేస్తున్నది. "సమీకృత గిరిజనాభివృద్ధి" సంస్థ ద్వారా గిరిజన సంక్షేమ కార్యక్రమాలు అమలుచేస్తాయి.

ఉద్యోగ ఉపాధి కల్పనలో వీరికి రిజర్వేషన్ సౌకర్యం వుంది. గిరిజనులలో

కొందరు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో ఉద్యోగాలు చేస్తున్నారు. కొందరు పార్లమెంటుసభ్యులుగా కేంద్ర సభ్యులుగా ఎన్నికైనారు.

గిరిజనులకోసం ప్రత్యేకంగా ఆశ్రమ పాఠశాలలు, హాస్టళ్ళు పాలిటెక్నిక్, ఐ.టి.ఐ మొదలైన సాంకేతిక విద్యా సంస్థలున్నాయి. ప్రభుత్వంతో పాటు "ఆవేర్" వంటి స్వచ్ఛంద సేవా సంస్థలు కూడా వీరి పురోభివృద్ధికి కృషి చేస్తున్నాయి.

భారతదేశంలో మొట్టమొదట ఆదిమజాతి మానవులుగా గుర్తింపబడిన వారిలో కొండరెడ్డి జాతిని పేర్కొనవచ్చును, వీరి జీవన విధానాన్ని పరిశీలించినట్లైతే ఆదిమజాతి మానవుని జీవన విధానానికి పోలిక ఎంతగానో కావస్తుంది.

నాగరిక ప్రపంచానికి దూరంగా కొండలపై నివసించే ఈ కొండరెడ్డి జాతి గిరిజనులు విల్లంబులు ధరించి అడవి జంతువులను వేటాడడం ద్వారాను దుంపలు ఆకులు తిని అడవులలో సేకరించడం ద్వారా జీవనంసాగిస్తున్నారు. భద్రాచలం ఏజన్సీ ప్రాంతంలో జనాభాలో అధిక శాతం గిరిజనులే. వీరి సాంప్రదాయం కొన్ని ఆచార వ్యవహారాల్లో ఒక ప్రత్యేకత కావస్తుంది. ముఖ్య కారణం వీరు నాగరిక జీవనానికి దూరంగా వుండడమే వీరిభాషకు లిపి లేదు. కులాచారాలకు, నియమాలకు, మూఢ నమ్మకాలకు ప్రాధాన్యత నిచ్చే జాతులలో ఇది ఒకటి.

వీరు "పోడు" వ్యవసాయం చేసి జొన్నలు, సజ్జలు పండిస్తారు. బుట్టలు అల్లి సంతలో అమ్మి జీవనాన్ని గడుపుతారు. సూదిపాటి కర్రలను తయారుచేసి భూమిని పెళ్ళగించి వ్యవసాయం చేస్తారు. దీన్నే "పోడు" వ్యవసాయం అంటారు. దుక్కిటెడ్లను, నాగలి మాత్రం ఈ పోడు వ్యవసాయం చేసేటప్పుడు వుపయోగించరు. భద్రాచలం డివిజన్‌లోని 10 గ్రామాలలో ఈ కొండరెడ్డి జాతి వారున్నారు సోకీలేరు, శబరి గోదావరి తీరాలలో కొండలపైన, కొండ గుట్టలపైన రెల్లుగడ్డితో కప్పబడిన పూరిండ్లలోనూ కొండ గుహల్లోనూ వీరి స్థిర నివాసం, చిన్న రంగు గుడ్డను పంచెగా కట్టి పైన ఏ ఆచ్ఛాదన లేకనే మెడలో రంగుల పెద్ద పూసలు వెండితో తయారు చేసిన చెవి రింగులు (పెద్దవి) కంటెలు పెట్టుకుంటారు. వీరి వివాహాలు రాక్షస రీతిలో కన్నెపిల్లలను ఎత్తుకుపోయి వివాహం చేసుకొనే ఆచారం వీరిలో వుంది. అయితే ఈ వివాహం యిటు అటు పెద్దల సమ్మతి మీదనే జరుగుతుంది. నియమాలను ఉల్లంఘించిన వారిని కఠినంగా శిక్షించి సాంఘిక బహిష్కరణ చేయటమేకాక గ్రామ బహిష్కరణ కూడా చేస్తారు.

కోయజాతి గిరిజనులకంటే అధికులమనే భావం వుండటంవల్ల కొన్ని ప్రాంతాలలో కోయజాతి గ్రామాలు అతి సమీపంలో వున్న ఆ జాతి అలవాట్లను అనుసరించవని తెలుస్తున్నది.

కూనవరం సమితిలోని టేకులొద్ది గిరిజన గ్రామంలో గిరిజనుల ఆచార వ్యవహారాలు ఆసక్తిదాయకంగా కన్పిస్తాయి. గిరిజన స్త్రీని బహిష్టుకాలంలో తామునివసించే ఇంటికి షుమారు ఒక పర్లాంగు దూరంలో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఒక పాకలో వుంచడం జరుగుతుంది. దీన్నే "కీడుపాక" గా వ్యవహరిస్తారు.

ప్రసవకాలంలో స్త్రీలకు మరొక కీడుపాకను తమ నివాసస్థలానికి దూరంగాఏర్పాటు చేసి గర్భిణీ స్త్రీని వుంచి పురుటిస్నానం అయ్యేవరకూ వుంచడం వీరి ఆచారం. ఆ స్త్రీకి సహాయకారిగా మరో వృద్ధస్త్రీని వుంచి ఆ స్త్రీ ప్రసవించిన 2 మాసాల తర్వాత ఇరుగుపొరుగు ఇళ్ళలో నిద్రచేయించి తర్వాత తమ ఇంటిలోనికి రానిస్తారు.

గిరిజనాభివృద్ధి పథకాలపై ఈ కొండజాతి గిరిజనులు అంతగా అసక్తిచూపరు. తామునివసించే ప్రదేశాలు వదలి క్రొత్త ప్రదేశాలకు రావడానికి ఇష్టపడరు. సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థద్వారా దుక్కిటెద్లు, గొర్రెలమంద (పెంపకం) మేకల (పెంపకం) మందఇచ్చి ఆర్థికంగా తోడ్పడ్డా అవివారు ఎంతవరకు వుపయోగించుకుంటున్నారు? కొత్తల్లో సాంఘిక సేవాసంస్థవారిని గ్రామంలో అడుగుపెట్టకుండా కుల పెద్దలు ఆటంక పరిచారు. తర్వాత ఎంతో శ్రమవల్ల వాళ్ళు తన ప్రవర్తనలో మార్పుతెచ్చుకొని ఉత్సాహం పుంజుకొని, అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొంటూ, సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ "ఆవేర్ ' ఉమ్మడి సహకారంతో భద్రాచల ఏజన్సీ ప్రాంతంలో కార్యక్రమాలు చురుకుగా కొనసాగి ఆశించిన ఫలితాలు పొందగల్గుతోంది. ఇంకా ఎంతో అభివృద్ధికి రాగలదన్న ఆత్మవిశ్వాసం ప్రస్ఫుటమవుతున్నది.

*

# గిరిజనుల ఆచారాలు, అలవాట్లు

- భూక్యా చిన వెంకటేశ్వర్లు

మన రాష్ట్రంలోగల 32 లక్షలమంది గిరిజనులలో చెంచు కులానికి చెందినవారు ఇప్పటికీ ఆహారాన్ని సేకరించుకొనే దశలోనే ఉన్నారు. కోలం, పోర్లగదబ్బ, బండాయి నాగరికత ప్రాథమిక దశలోనే వున్నారు. గిరిజనులలో మగవారి కంటే ఆడవారు కష్ట జీవులు, తమకున్న వ్యవసాయ భూమికి అనుగుణంగా పని పంపిణి కోసం గిరిజనుడు అవసరమైన వివాహాలు చేసుకుంటాడు. సోదరుడు చనిపోతే వదినను వివాహం చేసుకొని అన్నయ్య పిల్లలను కూడా పోషించాలి. అయితే చెంచులు మాత్రం తోబుట్టువులను శత్రువులకన్నా భయంకరంగా పరిగణిస్తారు. వీరు పెండ్లికాగానే తోబుట్టువులను వదిలివేసి బావమరదుల దగ్గరకి మకాం మారుతారు.

గిరిజనులకు పాడి పరిశ్రమలపై నమ్మకంలేదు. తల్లిపాలు పిల్లలు ఎదగడానికి ఏ విధంగా అవసరమో ఆవు, గేదె పాలుకూడా వాటి పిల్లలు దూడలు ఎదగడానికి అవసరమని వారి వాదన. పులిహోరను, ఈసడించుకొనే వీరు ఎడమ చేతితో అన్నం వడ్డిస్తే అంగీకరించరు. వీరిలో గొండు జాతి వారు పూర్తిగా శాఖాహారులని వింతగా చెప్పుకోవచ్చు.

తూర్పు గోదావరి జిల్లా రంపచోడవరం గిరిజనులు "తోట పండుగ" జరుపుకొంటారు. అంటే కల్లు పండుగ, కల్లు తాగేటప్పుడు చెప్పులు వేసుకోకూడదు. ఆసనాలమీద కూర్చొనకూడదు ఎడమచేతితో గ్లాసు ముట్టుకోకూడదు. వీరి వివాహాలలో ఆలక పాన్పులు, కన్యా శుల్కాలు, లంఛనాలు, అరాటాలు అసలే వుండవు. పచ్చబొట్టును వేయించుకోడానికి వెనుకాడరు.

వివాహాలు :

1. రాయబారాలు 2. అపహరణ 3. ప్రేమ 4. లేచి పోవడం అనే 4 రకాలు. 4 వేదమంత్రాలు, పురోహితులు అవసరము వుండదు. పెండ్లివారు వాగుదాటివస్తే ఆదనంగా ఇవతలి వారు సుంకం చెల్లించుకోవాలి. పైన నాలుగు పద్ధతులు కాక అత్తమామలకు సేవలుచేసి ఒప్పించి, మెప్పించి తాను వలచిన అమ్మాయిని పెండ్లి చేసుకోవడం మనలో ఇల్లరికం మాదిరిగా ఉంటుంది.

రుచులు-అభిరుచులు :

సిగ్గుపడడం వీరి జీవనంలో విడదీయరాని బంధం. కోయ జాతికి చెందినవారికి నలుపు రంగు సరిపడదు. కోతులు నల్లపందులను, మేకలను పూర్తిగా నాశనం చేస్తారు.

**సామాజిక వ్యవస్థ :**

గ్రామాధికారిని 'నాయుడు' అని అంటారు. గ్రామ సేవకులను 'వారికి' 'తలారి' అని

పిలుస్తారు. నాయుడు గ్రామ కట్టుబాట్లను కాపాడుతూ సామాజిక జీవనంలో ప్రధాన పాత్ర వహిస్తాడు. ఒక్కొక్క తెగ వంశీయులుగాను, ఒక్కొక్క వంశానికి ఒక్కొక్క ఇంటిపేరు, గోత్రాలు కలిగి ఉంటారు. వీరి ఇంటిపేరు పక్షులు, జంతువుల పేర్లనుపోలి ఉంటాయి.

ఉదా : కిలో అంటే పులి, పంతాల్ - సర్పం, సాగి - గ్రద్ద, కొర - సూర్యుడు, కీముడు - ఎలుగుబంటి, ఈ విధంగా ఇంటిపేర్లు ఉంటాయి. సాధారణంగా ఏ రోజున జన్మిస్తే, ఆ రోజు పేరు పెట్టే ఆనవాయితీ కూడా వీరిలో ఉంది. ఉదా : శుక్రవారం పుడితే శుక్రన్న, శుక్రి అని పేర్లు పెట్టడం కద్దు.

ఇప్పుడిప్పుడే ఉషోదయ రేఖలు ప్రసరిస్తున్న వీరి జీవితాలలో పాత రాతియుగపు అవశేషాలు ఇమిడి యున్నాయని నిరూపించడానికీ అన్నట్లు తూర్పు గోదావరి జిల్లా రంపచోడవరం సమీపంలోగల కానివాడ గ్రామంలో నరబలి ఉందంతం వెలుగులోకి రావడం, ఆదివాసి ప్రాంతాలకు స్వపరిపాలన కలిగిన మండలాలుగా ఏర్పాటు చేయాలి. వారి సంస్కృతిని ఒక ప్రత్యేకమైన సంస్కృతిగా గుర్తించాలి. వీరి ప్రాంతాలల్లో జరిగే అభివృద్ధి కార్యక్రమాలను మానవతావాధి కళ్ళతో చూడాలి. 105 భాషలు మాట్లాడే వీరిలోనే వెట్టిచాకిరీ చేసేవారు ఎక్కువమంది ఉన్నట్లు ఒక సర్వే వెల్లడించింది.

గిరిజన జాతులలో వున్న వైరుధ్యాలను, ఆర్థిక వ్యవస్థలలో వ్యత్యాసాలను పరిగణలోకి తీసుకోకుండా అభివృద్ధి పథకాలను కార్యక్రమాలను చేపట్టినట్లయితే ఆచరణలో అనేక అడ్డంకులు అవరోధాలు ఎదుర్కొనవలసి వస్తుంది. గిరిజనులలో అందరి అవసరాలు ఒకే విధంగా ఉండవు. వారివారి స్థాయిని బట్టి పథకాలను రూపొందించాలి.

ఉదా : వ్యవసాయంలో అసలు అనుభవంలేని చెంచులకు, గోండులు, గదబ, పోర్జ, కోలం తెగలకు చెందిన వారికి దుక్కిటెద్దులను, ఆధునిక వ్యవసాయ పనిముట్లను సరఫరాచేస్తే ఆశించిన ఫలితాలు రాకపోగా ప్రభుత్వం పై వారికి అపనమ్మకం కలిగే అవకాశం వుంది.

అదే విధంగా జాకెట్ తొడగడం తెలియని వారికి కుట్టులో శిక్షణ ఇవ్వడం వారి కాలాన్ని వృధా చేయడమే అవుతుంది. దానికి బదులుగా అడ్డాకులతో ఇస్తరాకులు తయారు చేయడంలో శిక్షణ ఇవ్వడం మంచిది.

**పండుగలు :**

వీరు ఆయా సమయాలలో చేసుకునే పండుగలు, జాతర్లు ఉత్సవములు, మైదాన ప్రాంతాలలో మనం జరుపుకునే వాటిని పోలి వుండడం వింతగా చెప్పుకోవచ్చు. పుష్యమాసంలో వీరు జరుపుకునే సంక్రాంతి పండుగతో కొత్త సంవత్సరం ప్రారంభమౌతుంది. ఈ సందర్భంగా దానధర్మాలు, ఇచ్చి పుచ్చుకోవడాలు, పశు సంపదను సంపాదించుకోవడం చేస్తారు. సంక్రాంతి పండుగ మూడు రోజులూ గిరిజనులు మధ్యాహ్న సమయంలో కూడా థింసా నృత్యం చేస్తారు.

పండుగకు 10 రోజులముందుగానే గ్రామ పెద్దలు బాల గురువు దగ్గరకు వెళ్ళి, అన్ని రకాలు పనులను ప్రారంభించడానికి ముహూర్తం గురించి తెలుసుకుంటారు. కొండదేవతను క్రిందకు దించేటప్పుడు చేసే నాట్యాన్ని 'ఒర్స' అంటారు. ఈ సమయంలోనే ముఠా వాళ్ళంతా కలిసి సమరోళ్ళు, బారిక, చలాను, గౌడు, కుమ్మరి అనే సేవకులను నియమించుకుంటారు.

పయిడీలు, వివాహాలు, మరణాలు, పండుగలు, ఉత్సవాలు సందర్భంగా వచ్చి పనులు చేస్తారు. గాడు గ్రామస్తులందరికి పశువుల కాపరి. ఈ పండుగ సందర్భంగా ఎవరైనా తప్పుచేస్తే పన్ను వసూలు చేస్తారు. గ్రామ నాయకుడు పూజారికి ఒక కొత్త తువ్వాలు తలకు బిగిస్తాడు. బూడిదరంగు కోడిని కోస్తారు. ఆడవాళ్ళు 'జోడియ' నాట్యం చేస్తారు. చేపలు, పీతలు, ఈత పురుగులు వేట చేస్తారు.

**నంది పండుగ :**

మాఘమాసంలో ఈ పండుగను నాలుగు రోజులపాటు చేస్తారు. 'మాఘమాసంలో మేఘం, పాల్గుణంలో వర్షం' అని వారి నమ్మకము. పూజారి తలంటుకొని, ఒకసీసా సారాయిని పుట్టదగ్గరకు తీసుకెళ్ళి దాన్లోపోసి, అక్కడ అంబు గుచ్చి వస్తాడు. తరువాత ఆ పుట్టమట్టిని తెచ్చి నందిని తయారుచేసి, తెల్లకోడిని అర్పణ చేస్తారు. ఈ మట్టి ఎద్దును బారికి భార్య దొంగిలించుకు పోతుంది. పూజారి నందిని వెతుకుతూ బారికి ఇంటికి పోవడం జరుగుతుంది.

**ఒలీ పండుగ :**

వీరి ఆచారాల్లో భాగంగా ఆచరించే తంతు. దీనినే ఇటుక పండుగ, ఇనుముల పండుగ, ఈటెల పండుగ అని పిలుస్తారు. ఈ పండుగలలో ఆడవారిదే పైచేయి. ఆ గ్రామంలో తొలిసారి నివాసం ఏర్పరచుకున్న వ్యక్తి ఇంట్లో (నిసాని) శుభకార్యాలు నిర్వహించటం వీరి ఆచారం.

మొగవాళ్ళు వేటకు వెళ్ళి జంతువును కొట్టుకొచ్చి నట్లయితే స్త్రీలు బెల్లం నీళ్ళతో ఎదురేగి స్వాగతం చెబుతారు. జంతువును "నిసాని" ఇంట్లో దింపి, కొట్టినవారికి మట్టిరంగు కోడిని బహూకరిస్తారు.

**బల్లి పండుగ :**

ఆశ్వయుజ మాసంలో 12 రోజులపాటు ఈ పండుగను చేస్తారు. గుమ్మడి ఆకు, వెదురుపూలు, వెదురు బదును అన్నం, ఈ సందర్భంగా తింటారు. 'బల్లి' అంటే ఇసుక, గోధుమలను ఇసుకలో పెట్టి మొలకెత్తించి ఈ పండుగ చేస్తారు.

**దసరా :**

ఈ పండుగ సందర్భంగా పశువులు పోయేదారిలో బెత్తాన్ని పెట్టి 'నది' ఆట ఆడుతారు.

*

## గిరిజన, ఆర్థిక వనరులను కబళిస్తున్న

# దేశీయ వ్యాపార సంస్థలు

- భూక్యా చిన వెంకటేశ్వర్లు

సాంఘిక, ఆర్థిక లక్షణాలు పరిశీలనలో భాగంగా గిరిజన గిరిజనేతర కుటుంబాలు భూకమతాల తీరు పరిమాణం, అక్షరాస్యత వృత్తులు, వ్యవసాయ, వ్యవసాయేతర ఆదాయాలు, రుణాలు, ఆహార, ఆహారేతర వ్యయాలను పరిశీలించినప్పుడు గిరిజన గిరిజనేతరులలో కూడా ముఖ్యంగా చిన్న, సన్నకారు రైతాంగం బలహీన స్థితిగతులలో ఉన్నట్లు పరిశోధన స్పష్టంగా ధ్రువీకరిస్తున్నది. అంతేకాకుండా బలహీన ఆర్థిక పరిస్థితులు, అవసరాలకు చాలినంతగా సంస్థాగతమైన పరపతి, ఇతరత్రా, అవసరమైన సౌకర్యాలు అందుబాటులో లేకపోవడం వలన వారి జీవన స్థితిగతులు దాదాపు దారిద్ర్యం అంచుకు చేరాయనటంలో అతిశయోక్తిలేదు. పైన ఉటంకించిన ఆర్థిక, సామాజిక అంశాలన్నీ సమిష్టిగా గిరిజన, గిరిజనేతరులలోని పేద వర్గాల కుటుంబాలను అంతర్గతంగా ముడిపడివున్న పరపతి వస్తూత్పత్తుల మార్కెట్లపై ఆధారపడివుండే విధంగా చేశాయి.

ఈ కుటంబాలు పరిస్థితి పరిశీలిస్తే వస్తురుణ మార్కెట్ల సంబంధం అంతర్గతంగా పెనవేసుకున్నట్లుగా స్పష్టమవుతుంది. గిరిజన ప్రాంతాలలో పరపతి వ్యవస్థీకరణ సంఘటిత విత్త సంస్థల ద్వారా జరగటం లేదనేది ఇప్పటికే రుజువయింది. ఇప్పటికీ వ్యవస్థీకృత పరపతి సంస్థలపై పెద్ద రైతుల అజమాయిషీ ఏమి తగ్గనట్లు స్పష్టంగా తెలుస్తోంది. అయితే అరమితి శాస్త్ర పద్ధతి అయిన లాడిట్ నమూనాను దత్తాంశానికి అనువర్తింపచేసి చూసినపుడు గిరిజన ప్రాంతాలలో కేవలం సంఘటిత విత్త సంస్థలు మాత్రమే ఉన్నట్లు తెలుస్తోంది. అయితే ఈ విత్త సంస్థలు గిరిజన గిరిజనేతర చిన్న సన్నకారు రైతాంగం అభిలాషలను రక్షించలేకపోతున్నాయనేది స్పష్టంగా ఉంది. అంటే వారికి భద్రతా భావం కల్పించడంలో అవి విఫలమవుతున్నాయి. సంఘటిత విత్తసంస్థలు విత్త పంపిణీలో అమలు పరుస్తున్న ఆస్తులాధారిత రుణ విధానాలు గిరిజనులపై వారి ఆధిక్యత చాటడానికి ప్రధాన కారణమవుతున్నది.

చిన్న, సన్నకారు, పేద గిరిజన రైతులు వ్యవస్థీకృత రుణ సంస్థల ద్వారా పరపతిని పొందే క్రమంలో తక్కువ అక్షరాస్యత స్థాయి, నిమ్న ఆదాయం, అతి తక్కువ భూకమతాల పరిమాణం, హెచ్చుకుటుంబ పరిమాణం అధిక శ్రామిక ఆధారిత నిష్పత్తివంటి అంశాల

ప్రభావం ప్రతికూలంగా పనిచేస్తున్నట్లుగా తెలుస్తున్నది. అంతేకాకుండా ఈ సంస్థల నుండి రుణాలను పొందే క్రమంలో పై లక్షణాలున్న కుటుంబాల క్రమానుగత నిర్మాణ శ్రేణి వారికి ఆటంకంగా నిలుస్తున్నది. పరస్పరాధారిత మార్కెట్లపై ఆధారపడకుండా వున్న రుణగ్రస్తుల పరిస్థితుల మధ్య సరిపోల్చుతూ జరిగిన విశ్లేషణ ఫలితాలు ఈ విధంగా ఉన్నాయి.

రుణగ్రస్తుల సగటు అక్షరాస్యత స్థాయి చాలా తక్కువగా ఉండటమేకాక, అధిక కుటుంబ పరిమాణం అధిక సగటు వ్యవసాయాదాయాలు, చిన్నతరహా అంటే సంపదనుండి పొందే స్వల్పఆదాయాలు వ్యవసాయేతర శ్రమద్వారా పొందే స్వల్ప ఆదాయాలు, వ్యవసాయ వేతన శ్రమద్వారా పొందే స్వల్ప సగటు ఆదాయాలు, నాపేక్షికంగా వ్యయాల సగటు అధికంగా ఉండటం మొత్తం శ్రామిక నిష్పత్తిలో అదిక సగటు పురుష శ్రామిక నిష్పత్తి ఇంకా తక్కువ శ్రామిక ఆధారిత నిష్పత్తివంటి లక్షణాలు కలిగి ఉన్నాయి. పై లక్షణాలన్ని కూడా ఈ కుటుంబాలను పరస్పరం ఆధారిత మార్కెట్లలో కూరుకుపోయేవిధంగా చేస్తాయి. వీటన్నింటి సమిష్టి కృషి ఫలితంగానే ఏది కారణమో ఏది ఫలితమో తెలియకుండా వారికి ఇది ఒక విషవలయంగా పరిణమించింది.

గిరిజనులలోని ఋణగ్రస్తుల అక్షరాస్యత స్థాయి, వ్యవసాయాదాయాలు, వ్యవసాయక శ్రమ ద్వారా పొందే ఆదాయాలు మొత్తం వ్యయాలు, మొత్తం శ్రామికులలో పురుష శ్రామికుల శాతం వంటి చలాంకాలలోని పెరుగుదల వీరిపై పరస్పరాధారిత మార్కెట్ల ప్రభావం ద్విగుణీకృతమవుతున్నట్లుగా ప్రస్తుత అధ్యయనం స్పష్టపరుస్తున్నది. అయితే ఈ ఫలితం పూర్వ అధ్యయనాల ఫలితాలకు భిన్నంగా ఉండటం గమనించతగ్గ అంశం. ఐతే మరికొన్ని చలాంకాలైన చిన్న తరహా అటవీసంపద ఆదాయాలు వేతనేతర శ్రమనుండివచ్చే ఆదాయాలు, శ్రామిక ఆధారిత నిష్పత్తులలోని పెరుగుదల కుటుంబాలను పరస్పరాధారిత మార్కెట్లనుండి దూరంగా ఉంచుతున్నట్లుగా తెలుస్తున్నది. అంటే పూర్వ అధ్యయవాల పరికల్పనన కొంతవరకు ఈ అంశం బలపరుస్తున్నట్లుగా అర్థం చేసుకోవచ్చు.

ప్రతిచయన కుటుంబాల విక్రయం కాగల మిగులు, విక్రయం అయిన మిగులును పరిశీలించినప్పుడు గిరిజన కుటుంబాలలో విక్రయం కాగల మిగులు కంటే విక్రయించిన మిగులు దాదాపు 3 శాతం ఎక్కువగా ఉంది. వీటినే “బలవంతపు అమ్మకాలు అని కూడా చెప్పవచ్చు. ఉత్పత్తుల అమ్మకాల విషయంలో గిరిజన ప్రాంతాలలో వ్యవస్థీకృతమైన, క్రమబద్ధమైన, సంస్థాగతమైన మార్కెట్ల లేమివల్ల వారి ఉత్పత్తులకు సరయిన ధరలను పొందే మార్గాలను కోల్పోతున్నారు. ఫలితంగా చిన్న వర్తక వ్యాపారుల తరగతి ఈ ప్రాంతాలలో స్థిరపడటానికి పరోక్షంగా పరిస్థితి అనుకూలిస్తున్నది. ఈ అవకాశాన్ని వ్యాపారుల నిస్సహాయ స్థితిలోని గిరిజనులను దోచుకోవడానికి ఉపయోగించు కుంటున్నారు.

గిరిజన ప్రాంతాలలో వారి జీవితాలలోని అన్ని అంశాలలో కూడా చాలా నెమ్మదిగా మార్పు సంభవిస్తున్నదనే అంశాన్ని కూడా గమనించవచ్చు. అయితే పై రకమయిన క్రమమార్పీకరణలో అనుకూల, ప్రతికూల అంశాలు రెండు యిమిడి వున్నాయి. గిరిజనేతర ప్రాంతాలలో ఉండే రాకపోకలవల్ల నగర సంస్కృతి గిరిజన ప్రాంతాలలోకి ప్రవేశిస్తున్నది. అంతేకాక వాణిజ్య పరమైన సంబంధాలు మార్కెట్ వ్యవస్థ గిరిజనుల దోపిడీకి దోహదపడుతున్నది. అయితే దోపిడీతో బాటుగా గిరిజనులు తమ దోపిడిని గుర్తిస్తూ తమ హక్కులను తెలుసుకునే చైతన్యీకరణానికి కూడా గురవుతున్నారు. అంతేకాకుండా వంటలతీరు, జీవన విధానాలు, వేషభాషలు మొదలైన అంశాలు మార్పుకు గురవుతున్నాయి.

వ్యవసాయపనుల తదనంతరం దాదాపుగా గిరిజన కుటుంబాలన్నీ కూడా చిన్నతరహా అటవీసంపద క్రమక్రమ క్షీణతవల్ల ఈ ఉత్పత్తుల సేకరణ ద్వారా వచ్చే ఆదాయం రోజురోజుకూ తగ్గి పోతున్నది. ప్రత్యామ్నాయంగా మారుమూల గిరిజన ప్రాంతాలలో ఇంకా "పోడు వ్యవసాయ" పద్ధతిని గిరిజనులు చేపడుతున్నారు. కాబట్టి ఏ సంస్థ అయితే గిరిజనాభివృద్ధికి పాటుపడుతుందని భావిస్తున్నామో ఆ సంస్థే ప్రభుత్వపరంగా గిరిజన కుటుంబాలు సరయిన ధరను పొందే వీలులేకుండా పరోక్షంగా అడ్డుకుంటున్నది. అంతేగాకుండా కొన్ని వస్తువులకు జిసిసిలో కంటే బహిరంగ మార్కెటులోనే ధరలు ఎక్కువగా వున్నాయని గిరిజన కుటుంబాలు అభిప్రాయ పడుతున్నాయి. జి.సి.సి., ఐటిడిఎ ఉద్యోగులు క్షేత్రస్థాయిలో అక్కడక్కడ కొంతమేరకే అవినీతి లేదా మోసపూరిత పద్ధతుల నవలంభిస్తున్నప్పటికీ ఋణాల మంజూరీలో, డీఆర్ డిపోల ద్వారా నిత్యావసర వస్తువుల లభ్యతలో, భౌతిక ఆస్తులను కల్పించడంలో ప్రధాన పాత్రను వహిస్తున్నాయని కూడా ఈ అధ్యయనం తెలియజేస్తుంది.

గిరిజన ప్రాంతాలలో జీవన స్థిరీకరణను స్థూల, సూక్ష్మ స్థాయిలో పరికించి చూస్తే, సంక్లిష్టమైన ఋణమార్కెట్ల, కారక మార్కెట్ల మధ్య అంతర్గతంగా పెనవేసుకుని ఉండే సంబంధ వ్యవహారాలు గిరిజన ప్రాంతాలలో ప్రత్యక్ష, తెలివి మీరిన పద్ధతుల ముసుగులో గిరిజనుల నుండి అధిక వడ్డీరేట్లను వసూలు చేస్తూ ప్రత్యక్షంగా గాని, లేదా పరోక్షంగా గాని గిరిజన, గిరిజనేతర (ముఖ్యంగా గిరిజనేతర వడ్డీ వ్యాపారస్తులు)ల మధ్య దోపిడి సంబంధాలు పటిష్టవంతం కావడానికి దారితీస్తున్నాయి. ఈ పరిస్థితి మారితేగాని గిరిజనుల జీవన పరిస్థితులు మారవు.

*

# గిరిజనులు - అటవీ నిర్వహణ

- డాక్టర్ పి. దాస్ శర్మ

అడవుల్లో పహారాలు, కఠిన చర్యలమీద ఆధారపడిన అడవుల యాజమాన్యం అడవుల క్షీణతను ఆపలేకపోయింది. అడవుల మీద ఆధారపడిన వారి బతుకులు బాగుచేయలేక పోయింది. ప్రజాస్వామిక పద్ధతిలో వికేంద్రీకరించిన అభివృద్ధి కార్యక్రమాలు ఇప్పుడు చాలా అవసరం. దీనికి మానవ శాస్త్ర నిపుణులు తోడ్పడగలుగుతారని డా॥ పి. దాస్ శర్మ అభిప్రాయం.

భారత దేశంలో భౌగోళికంగా అడవులు 25 శాతం ఆక్రమిస్తున్నాయి. 77.1 మిలియన్ హెక్టార్ల మేర విస్తరించిన అటవీ ప్రాంతం ప్రపంచ అడవుల్లో రెండు శాతంగా వుంది. జనాభా విషయంలో మాత్రం ప్రపంచ జనాభాలో 15 శాతం మనదే. దేశంలోని గిరిజనుల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక జీవనంలో అడవులు ముఖ్యపాత్ర పోషిస్తున్నాయి. గిరిజన జనాభాలో అత్యధిక శాతం మంది అనాదిగా అటవీ ప్రాంతాల్లోనే సామరస్యంగా సురక్షితంగా, చీకుచింతా లేకుండా జీవనం సాగించడం అందరికీ తెలిసిన విషయమే.

గిరిజనుల సమస్త జీవితం వారి మనోభావాలు, సంప్రదాయాలు అటవీ వాతావరణంతో ముడిపడి వున్నాయి. మరణానంతరం కూడా గిరిజనులు మృతదేహాలను దీర్ఘ విశ్రాంతి కోసం అటవీ ప్రాంతంలోనే సమాధిచేస్తున్నారు. ఆవిధంగా వారి జీవన్మరణాల సర్వస్వం అడవి చుట్టే తిరుగుతుంది.

అడవిలో నివసించే గిరిజనులకు, అటవీ ప్రాంతాలకు సమీపంగా నివసిస్తున్న ఇతర ప్రజలకు అడవుల నుంచి అనేక ప్రయోజనాలు కలుగుతున్నాయి. ఇళ్ళకు కలప, నీడనిచ్చే గుడిసె, ఇళ్ళలో ఇతరత్రా వాడకానికి పనికొచ్చే పనిముట్లు, జిగురు, వంటచెరకు, ఓషధులు, పశువుల మేత మరెన్నో రకాల ప్రయోజనాలు అడవుల నుంచి లభ్యమవుతున్నాయి.

భారతదేశంలో గిరిజనుల జీవనం, వారి ఆర్థిక వ్యవస్థ యావత్తూ అడవులతోనే పెనవేసుకుపోయింది. అత్యధిక గిరిజన జనాభా పూర్తిగా అడవుల్లోనే జీవిస్తూ అటవీ ఉత్పత్తులతోనే జీవనోపాధి కొనసాగిస్తున్నారు. ముఖ్యంగా దుంపలు, గడ్డలు వారికి ఆహారంగా ఉపయోగపడతాయి. చిన్న చిన్న జీవాలను వేటాడి ఆహారంగా భుజిస్తుంటాడు. అయితే వేట ప్రధానంగా జీవిస్తున్న గిరిజనులు సంఖ్య తక్కువే. ముఖ్యంగా ఒరిస్సా, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాల్లో వారి జనాభా కొంతవరకు వుంది. విప్పపూత,

విత్తనాలు, తునికాకు, దుంపలు, వెదురు, బొంగు, చింతపండు, కుంకుడుకాయలు మొదలైన అటవీ ఉత్పత్తుల మీద ఆధారపడి వీరి జీవనం సాగుతోంది.

ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహార్ రాష్ట్రాలలో సాగిన అధ్యయనం ప్రకారం 80% మంది గిరిజనులు 25 నుంచి 50 శాతం వరకు ఆహారాన్ని అడవి నుంచే సంపాదించుకుంటున్నారు. చెంచు, బిర్‌హార్, కొర్వ, పహారియా, అసుర్, బిర్‌జియా మొదలైన గిరిజన తెగలు, అడవుల్లోని చిన్న రకాల ఉత్పత్తుల మీదే ఆధారపడి జీవిస్తున్నారు. వ్యవసాయదార్లుగా స్థిరపడిన సంథాల్, ముండా, ఆరోన్, హోం, బిల్, గోండు బైగా మొదలైన మధ్య భారతంలోని పెద్ద గిరిజన తెగలవారు చిన్న గిరిజన తెగలవారి కన్నా ఆర్థికంగా స్థితిమంతులు ఈశాన్య రాష్ట్రాల్లో నివసిస్తున్న మంగోలు తెగలకు చెందిన వారికి ముఖ్యంగా నాగా, కుకీలకు ప్రధాన జీవనాధారం. జుమ్ వ్యవసాయమే జుమ్ వ్యవసాయాన్ని బస్తర్‌లో 'పెండా' సాగని, ఒరిస్సా ఖోండులు పోడు అని పిలుస్తారు. ఈ పోడు వ్యవసాయం వల్ల అడవులు కొంతవరకు తరిగిపోతాయి. కాబట్టి ఇది అనవసరమైంది, పూర్తిగా మానుకోదగింది అనే విషయంపై ఇప్పుడున్న పరిస్థితిలో ఇంకా చర్చ జరగాల్సివుంది. గిరిజనుల ప్రధాన జీవనోపాధికి ఉపకరిస్తున్న వ్యాపకం కాబట్టి ఇది వాంఛనీయమనో, అవాంఛనీయమనో అంత తేలిగ్గా చెప్పే వీలు లేదు.

**అటవీ విధానం :**

బ్రిటీషువారి పాలనకు పూర్వదేశంలోని అటవికులు, ఇతర జాతులు అడవులను ఉపయోగించుకొనేందుకు తగిన స్వేచ్ఛ వుండేది. అటవీ భూములను అటవీ ఉత్పత్తులను ప్రజలు వినియోగించుకోవడంలో నామ మాత్రమైన నియంత్రణ వుండేది. జనాభా తక్కువగా వుండటం వారి అవసరాలు తీరేందుకు విస్తారమైన అడవులు వుండడంవల్ల ఆ మాత్రం నియంత్రణ కూడా ఎటువంటి సమస్యనూ సృష్టించలేదు. ఈ అటవీ జాతులకు నేల రాలిన ఆకులు సండ్లు, ఇతర రకాల ఉత్తత్తులను మాత్రమే పోగుచేసుకొని ఉపయోగించుకొనే అవకాశం వుండేది. కాబట్టి సహజమైన అటవీ సంపద పరిరక్షణకు అది ఉపయోగపడింది.

బ్రిటీషు సామ్రాజ్యవాదుల పాలనలో అడవులవలన వాణిజ్య ప్రయోజనాలను గుర్తించడంవల్ల అడవులనుంచి ఆదాయ వనరులను పెంచుకోవచ్చని భావించడం వల్ల ఆక్రమణలో వారు గిరిజనులు, అడవులపై ఆధారపడి జీవించే ఇతర జాతులు వారికి అడవులపై వున్న హక్కులను క్రమబద్ధం చేయడానికి, ప్రయత్నించారు.

1855 అటవీ ప్రాంత వాసుల హక్కులకు పరిమితులు విధిస్తూ మార్గదర్శక సూత్రాలతో కూడిన మెమోరాండంను జారీ చేశారు. ప్రభుత్వ అడవుల నిర్వహణ,

పరిరక్షణకు రూపొందించిన నిబంధనలను అమలులోకి తెస్తూ 1855లో చట్టానికి ఆమోదం లభించింది. ఈచట్టం ప్రధాన లక్ష్యం అడవులపై ప్రభుత్వానికి అదుపు కల్పించడమే. ఆతర్వాత మరింత సమగ్రమైన భారత అటవీ చట్టం 1878 వచ్చింది. అది అడవులను 1) రిజర్వుడు అడవులు, 2) రక్షిత అడవులు, 3) గ్రామ అడవులుగా వర్గీకరించింది రిజర్వు ఫారెస్టులో పశువులమేత నిషేధచట్టం వంటివి కూడా వచ్చాయి. ఏ అడవినైనా, భూమినైనా రక్షిత అటవీ ప్రాంతంగా ప్రకటించేందుకు స్థానిక ప్రభుత్వాలకు అధికారాలిచ్చారు.

అడవుల వలన వాణిజ్య అవసరాలను ప్రధానంగా సూచిస్తూ బ్రిటీషు ప్రభుత్వం 1894లో అటవీ విధానాన్ని ప్రకటించింది. ఈ విధానం అటవీ ఉత్పత్తులు, అటవీ భూములపై అటవీ ప్రాంత ప్రజలకున్న హక్కులపై పరిమితులు విధించేందుకు మార్గాన్ని సుగమం చేసింది 1927లో అంతకుముందున్న చట్టంలోని అంశాలు అన్నిటిలో సమగ్రభారతీయ అటవీచట్టం వచ్చింది. బ్రిటీషు పార్లమెంటు ఆమోదించిన భారతప్రభుత్వ చట్టం 1935లో ప్రాంతీయాధికారాలను, అటవీ అంశాన్ని పొందుపరచారు ఆ తర్వాత అటవీ ప్రాంతాల ప్రజలకు అడవులపైగా అటవీ ఉత్పత్తులపైనా వున్న హక్కులను క్రమబద్ధం చేస్తూ స్థానిక ప్రభుత్వాలు అనేక చట్టాల్ని తీసుకొచ్చాయి. ప్రధానంగా బ్రిటిషు అటవీ విధాన లక్ష్యం అటవీ ప్రాంతాల్లో వాణిజ్య అవసరాలకు వినియోగించడం సామ్రాజ్యవాదుల అటవీ ఆధార పరిశ్రమలకు కలప సరఫరా చేయడం అటవీ ప్రాంతాల్లో నివసించే గిరిజనేతరులకు గిరిజనులకు చెందవలసిన అటవీ వనరులను సామ్రాజ్యవాదుల ప్రయోజనంకోసం వాణిజ్యపరం చేశారు. భవిష్యత్తు పరిణామాలను లక్ష్యపెట్టకుండా అటవీ వనరుల సేకరణలో ప్రయివేటు కంట్రాక్టర్లకు స్వేచ్ఛ కల్పించారు.

ఈ విధంగా 97 శాతం భారతీయ అటవీ ప్రదేశంపై ప్రభుత్వానికి యాజమాన్య హక్కు కల్పించిన సామ్రాజ్యవాద చట్టాలు ప్రజలకు అడవులవల్ల ఏ ప్రయోజనాలు కలుగకుండా చేశాయి. వీటివల్ల అడవుల విస్తీర్ణం తగ్గిపోయి, అడవుల నరికివేత తీవ్రతరమైన పర్యావరణ సమతుల్యంపైన అటవీ ప్రాంత ప్రజలసాంఘిక, ఆర్థిక స్థితిగతులపైనా పెనుప్రభావాన్ని కల్గించాయి. పరిసర వాతావరణంలో అడవుల తరుగుదల, కఠినమైన అటవీ చట్టాలు వలన వ్యతిరేక ప్రభావం వల్ల స్థానిక అటవీ ప్రజల జీవనోపాధి మార్గాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. అడవులు విపరీతంగా తరిగిపోతుండటం, వున్న కొద్దిపాటి అటవీప్రాంతంలో అటవీ ఉత్పత్తులు సేకరించుకొని జీవించేందుకు చట్టాలు అడ్డంకులు కల్పించటంతో ప్రజల నిత్యజీవితం చిన్నాభిన్నమైంది.

స్వాతంత్ర్యానంతరం అటవీ విధానంపై పునరాలోచన చేశారు. 1952లో నూతన

జాతీయ అటవీ విధానాన్ని ప్రకటించారు ఈ సారి వాణిజ్య పారిశ్రామిక అవసరాలు, అటవీ లాభాలకు ప్రాధాన్యత తగ్గించి పర్యావరణ సమతౌల్యానికి, సాంఘికాంశాలకు అధిక ప్రాధాన్యత కల్పించారు. అడవుల్లో జీవించే ప్రజల ప్రయోజనాలకు జాతీయ ప్రయోజనాలను బలి పెట్టకూడదన్న బ్రిటీషు విధానానికి ఇది ఒక రకంగా కొనసాగింపుగా పరిణమించింది. అటవీ ప్రాంతాల సమీపంలో జీవించే గిరిజనులు అటవీ ఉత్పత్తులపైనా, అడవుల పైనా ఆధారపడడాన్ని తగ్గించే ప్రయత్నం జరిగినది. జాతీయ వ్యవసాయ కమీషన్ 1976లో అటవీ భూములను మూడు రకాలుగా వర్గీకరించింది. 1. రక్షిత అడవులు. 2. సాధారణ అడవులు. 3. సామాజిక అడవులు. కమీషన్ ఈ సందర్భంలో గ్రామీణ ప్రాంతాల ప్రజల అవసరాలను గురించి చర్చించింది గాని చిన్న అడవులపైనా అటవీ ఉత్పత్తులపైన ఆధారపడి జీవిస్తున్న గిరిజనుల అవసరాలపై దృష్టి పోయినట్లు లేదు. ఆదివాసీల అటవీ అవసరాల ముఖ్యంగా ఇళ్ళ కప్పులు, ఇళ్ళ నిర్మాణానికి అవసరమయ్యే కలప, వారి అవసరాలు తీర్చే అడవుల్లోని పండ్లు, ఫలాలు, ఇతర వస్తువులు ఉత్పత్తుల గురించి కమీషన్‌చర్చ సాగించినట్లు లేదు. ఆదివాసీలకు అటవీ పనుల్లో ఉపాధి కల్పించాలని జాతీయ వ్యవసాయ కమీషన్ అభిప్రాయపడుతోంది. వాస్తవానికి ఆదివాసీలకు అటవీపనుల్లో ఉపాధి ప్రధానం కాదు చిన్న చిన్న జంతువులవేట వల్ల ఇతరత్రా అటవీ ఉత్పత్తుల వల్ల వారి జీవన సాగుతుందన్న ముఖ్య విషయాన్ని కమీషన్ విస్మరించింది.

ఇలా వుండగా 1980 భారతీయ అటవీ బిల్లు సంపన్నులకు అనుకూలమైందిగా, గ్రామీణ ప్రజలకు వ్యతిరేకమైందిగా రూపొందింది. అటవీ పద్ధతుల్లో అనేక చట్ట నిషేధాలను విధించింది. ఈ బిల్లులో కఠిన శిక్షలను పొందు పరచడంతో పాటు ప్రభుత్వ సిబ్బందికి అనేక అధికారాలను కల్పించారు. వారికి అనేక రక్షణ చర్యలు కల్పించారు. కాని అడవులపై ఎంతగానో ఆధారపడి జీవిస్తున్న గిరిజనులను ఈ బిల్లు చిన్న చూపు చూసి వారంతా అటవీ సిబ్బంది దయాదాక్షిణాలపై ఆధారపడి జీవించే వారన్నంత దుస్థితి కల్పించింది.

అడవులే ప్రధాన జీవనాధారంగా బ్రతుకుతూ దేశ జనాభాలో 8 శాతంగా వున్న గిరిజనుల కోసం జాతీయ వ్యవసాయ కమీషన్ (1976) అభివృద్ధి పరచిన సామాజిక అడవులు ఈ పేద గిరిజనులు గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చలేవు ఇక్కడ ఒక ముఖ్య విషయం గమనించాలి గిరిజనుల ఆర్థిక వ్యవస్థ అంటే కేవలం బ్రతుకుతెరువుపై ఆధారపడ్డ ఆర్థికవ్యవస్థే సంప్రదాయకంగా వారి సంపాదనంతా కేవలం వారి కోసం వారి పిల్లల కనీసావసరాల కోసమే అయితే గిరిజనులు పోడు వ్యవసాయం కోసం నిర్లక్ష్యంగా నిర్దాక్షిణ్యంగా అటవీ శాఖ వారు అనుకుంటారు.

ఈ దిశలో 1988 జాతీయ అటవీ విధానం పూర్వపు అటవీ విధానాలు చట్టాల

కన్నా గణనీయమైన ముందడుగు వేసింది. అటవీ ప్రధాన లక్షం పర్యావరణ సమతౌల్యాన్ని పరిరక్షించడమేనని గుర్తించడం నూతన చట్టంలో చెప్పుకోదగిన అంశం సకల మానుష్య వృక్ష, జీవరాశి మనుగడకు దోహదం చేసే వాతావరణ నియంత్రణ, పర్యావరణ సమతౌల్య పరిరక్షణే అటవీ విధాన ముఖ్య లక్ష్యం కావాలని జాతీయ అటవీ విధానం నిర్దేశిస్తోంది. అటవీ ప్రాంతాల్లో నివసించే గిరిజనులు ఇతరవర్గాలు సమీప ప్రాంతాల్లో నివసించే ప్రజలను అటవీ నిర్వహణలో ప్రత్యక్షంగా భాగస్వాముల్ని చేసేందుకు కొన్ని అంశాలు కలిగివుండడం 1988 జాతీయ అటవి విధానంలో ప్రత్యేకంగా చెప్పుకోదగిన అంశం.

తక్షణ కర్తవ్యం

అటవీ నిర్వహణ పద్ధతి అనేది అటవీ పాలనగా, కఠిన చర్యలతో కూడినదిగా వుంటే చెల్లదని గతంలోని విధానాలవల్లే స్పష్టమైంది. సుస్థిరమైన అభివృద్ధికి ప్రజాస్వామిక వికేంద్రీకృత భాగస్వామ్యం కలిగిన అటవీ నిర్వహణే ఇప్పుడు మనకవసరమని తేలిపోయింది. పర్యావరణ రంగంలో సుస్థిర అభివృద్ధి అనేమాట ఎక్కడ చూసినా ప్రతిధ్వనిస్తున్నది అసలు సుస్తిర అభివృద్ధి అంటే సాధారణంగా శక్తికి లోబడిన ఆర్థిక వనరులతో మానవ జీవన ప్రమాణాలను పెంపొందింపజేయడమని అర్థం. ప్రతిదానికి అడవుల్లో నివసించేవారినీ, గిరిజనులను, బాద్యుల్ని చేయడమనికాదు వాళ్ళ నుంచి ఎంతో ప్రయోజనం ఆశించవచ్చునని అర్థం. సుస్థిర అభివృద్ధి సూత్రాలను ఆచరణలో పెడుతూ అడవుల అటవీ ప్రాంతాల ప్రజల సామరస్య పూర్వకమైన అభివృద్ధి కోసం పర్యావరణ, మానవశాస్త్రవేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలతో అవసరమైన సంప్రదింపులు, సంబంధాలు కొనసాగించవలసిన ఆవశ్యకతను పాటించవలసివుంది. అటవీ నిర్వహణ, ఆటవీ వినియోగం అనేది ఒక విశాల భావనకు సంబంధించినది. అది పరిపాలనాపరమైన ఆర్తిక, సాంఘిక, ప్రవర్తన న్యాయ, సాంకేతిక, వైజ్ఞానిక, కోణాలతో ముడిపడినది అటవీ సంపద నిర్వహణకు పరిరక్షణకు నిరంతరం వివిధ వర్గాల ప్రజలు శాఖలతో సంబంధాలు కొనసాగించడమే సుస్థిర అటవీ అభివృద్ధి అంతరార్థం దేశంలో నానాటికీ తరిగిపోతున్న అటవీ సంపద, పర్యావరణ సమతౌల్య సమస్యకు అటవీ నిర్వహణలోని కేంద్రీకరణ, ప్రజలభాగస్వామ్యం ఒక్కటే దీర్ఘకాలిక పరిష్కారం అటవీ అభివృద్ధి క్రమంలో ఆ ప్రాంతాల్లోని ప్రజల సహకారం పొందేందుకు 1988 జాతీయ అటవీ విధానం ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది. ఈ నూతన ఆలోచన ఉమ్మడి అటవీ నిర్వహణ పద్ధతికి దారి తీసి ఈనాడు చక్కని పద్ధతిగా అందరి మన్ననలందుకుంటున్నది. సుస్థిర అటవీ అభివృద్ధికి సంబంధించి చర్చించేందుకు గ్రామీణ ప్రజలను అటవీ సిబ్బందిని ఒక్క తాటి మీదకు తెచ్చేందుకు ప్రభుత్వేతర సంస్థలు ముందుకు వచ్చాయి.

గిరిజనులు వివిధ ప్రాంతాలవారు వివిధ సాంఘిక, ఆర్థిక స్థితిగతులు కలిగినవారు విభిన్న సంస్కృతులకు చెందినవారు కాబట్టి అటవీ నిర్వహణలో వారి పాత్ర వారు భాగస్వాములయ్యే తీరులో మార్పు ఉంటుంది. ఉమ్మడి అటవీ నిర్వహణలో కొన్ని ప్రాంతాల్లో గిరిజనులు ఉత్సాహంగా పాల్గొంటే అక్కడ ఫలితాలు కూడా అంత అద్భుతంగా వుంటాయి. ఇతర ప్రాంతాల్లో అంతటా అదే విధంగా వుండకపోవచ్చు ఈ వినూత్న పద్ధతిని గురించిన అవగాహన అక్కడి ప్రజల్లో ఏ మేరకు వుందన్న దానిపై దాని విజయం ఆధారపడివుంటుంది. కాని ఈదిశలో ప్రభుత్వేతర సంస్థలు దేశంలో అనేక చోట్ల ఈ పద్ధతికి అప్పుడే శ్రీకార చుట్టాయి. ఉమ్మడి అటవీ నిర్వహణ పట్ల గిరిజనుల్లో తగిన అవగాహన పెంపొందించి కార్యక్రమాన్ని సక్రమంగా అమలుచేస్తే ప్రజల ప్రభుత్వ యంత్రాంగం నడివడిలో ఆశించిన ప్రమాణాల్లో, పరిమాణాల్లో మార్పులు తేవడం తథ్యం ఇక్కడ మానవ శాస్త్రవేత్తల పాత్ర అవసరమవుతుంది ఉమ్మడి అటవీ నిర్వహణ కార్యక్రమాన్ని విజయవంతంగా అమలుచేయడంలో మానవ శాస్త్రవేత్తల నైపుణ్యం ఎంతో దోహదం చేస్తుంది.

గిరిజనులు, ఇతర అటవీప్రాంతా ప్రజలు అటవీ సిబ్బంది దృక్పథంలో మార్పు తీసుకువచ్చేందుకు వారి మధ్య అవగాహనను పెంపొందించేందుకు అవసరమైన సమాచారం చాలా ముఖ్యం సమాచారం అంటే కార్యక్రమం ప్రయోజనాన్ని ప్రాముఖ్యాన్ని గురించి తెలియజెప్పే సమాచారం, అవగాహన పెంపొందించగల ఇతర సమాచారం అన్నమాట ఇదొక పద్ధతి ఇందులో గిరిజనులు ఏ విధంగా పాల్గొంటున్నారు వాళ్ళ ఆలోచనా విధానం అంతకు ముందు ఎలా వుండేది ఇప్పుడెలా వుంది దాన్ని సుముఖంగా చేసేందుకు ఏం చెప్పాలి ! అలాగే అటవీ సిబ్బందితో వాళ్ళు గతంలో ఎలా మెలిగేవాళ్ళు ? ఇప్పుడెలా వున్నారు ? ఇద్దరి మధ్య ఇంకా ఏమైనా ఎడం కనిపిస్తోందా ! అటవీ నిర్వహణ ప్రణాళిక రూపొందించడంలో ప్రజలు అధికారులతో కలిసి ముందుకు సాగడంలో ఎలా వ్యవహరిస్తున్నారు మొదలైన విషయాలను శ్రద్ధగా అధ్యయనం చేయవలసి వుంటుంది. ఈ అధ్యయనం ఉమ్మడి అటవీ నిర్వహణ విజయవంతం కావడానికి సుస్థిర అటవీ అభివృద్ధికి దోహదం చేస్తుంది. దేశం వివిధ ప్రాంతాల్లో ఉమ్మడి అటవీ నిర్వహణ కార్యక్రమం విజయం ఫలితంగా సాంఘిక మార్పు ప్రక్రియను అధ్యయనం చేసేందుకు సామాజిక శాస్త్రాలు నిర్వహణ రంగాల్లో పరిశోధకులకు అవకాశాలు పెంపొందాయి. గిరిజనులు అటవీ ప్రాంతాల ప్రజలు అటవీ సిబ్బంది పరస్పర సహకారంతో, సామరస్య పూర్వకమైన సంబంధాలతో కొనసాగుతున్న ఉమ్మడి అటవీ నిర్వహణ కార్యక్రమం అనేక ప్రాంతాల్లో విజయవంతమైంది. ఈ కార్యక్రమ సాఫల్యానికి గిరిజనులు ఇతర వర్గాలు,

అటవీసిబ్బంది తమ నిబంధనలను దృక్పధాలను ప్రవర్తనను, పద్ధతులను అవసరమైన విధంగా తీర్చిదిద్దుకోవలసి వుంది తమలోని బలాన్ని బలహీనతని సమస్యలను పరస్పరం చర్చించుకోవలసివుంది.

గ్రామాల్లోని అటవీ రక్షణ సంఘాల్లో మహిళలు చురుగ్గా పాల్గోవడం వల్ల ఉమ్మడి అటవీ నిర్వహణకార్యక్రమం ఎక్కువ విజయవంతమైందని వెల్లడైంది. మహిళలు తమ గ్రామంలో తమ పరిధిలోని రక్షిత అటవీ ప్రాంతంలో ఇతర గ్రామాల మహిళలు వంటచెరకు తీసుకుపోకుండా అడ్డుకుంటున్నారు.

గ్రామంలోని ప్రజలు రకరకాల వయస్సుల, కులాలు వర్గాలు, వృత్తులవారున్నా అటవీరక్షణలో గనుక భేదభావాలు విడనాడి సమైక్యంగా కృషిచేస్తే దేశవ్యాప్తంగా ఉమ్మడి అటవీ నిర్వహణ కార్యక్రమం పెద్దఎత్తున విజయవంతమవుతుంది.

ఉమ్మడి అటవీ నిర్వహణ కార్యక్రమం గ్రామీణ ప్రజల్ని ఈ కార్యక్రమంలో చురుగ్గా పాల్గొనేలా చేసేందుకు అనుసరించ వలసిన పద్ధతులు మొదలైన అంశాల్లో అదికారులకు కేంద్ర అటవీశాఖ తప్పనిసరి శిక్షణా కార్యక్రమాన్ని ప్రవేశపెట్టింది సమాజంలోని అనేకులను తమ కృషితో భావి అటవీ అభివృద్ధి బాధ్యత నిర్వహించే విధంగా ఈ కార్యక్రమం సాగుతుంది.

*

# నాయకపోడు - ఒక పరిశీలన

డా.యం.డి.రాజ్‌మహ్మద్

జానపద గిరిజన విజ్ఞానపీఠం శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వరంగల్ వారి అధ్వర్యంలో వరంగల్ జిల్లా జానపద విజ్ఞానదర్శిని సేకరణలో భాగంగా ఆచార్య యన్. భక్తవత్సల రెడ్డిగారి ప్రోత్సాహంతో వరంగల్ జిల్లా నాయకపోడు విజ్ఞాన బహుముఖ రూపాలు ఈ వ్యాస రచయిత సేకరించడం జరిగింది. ఆ సేకరణను ఆధారంగా జేసుకొన్నదే ఈ వ్యాసం.

నాయకపోడు వరంగల్, ఆదిలాబాద్, కరీంనగర్, ఖమ్మం, నిజామాబాద్, పశ్చిమ, తూర్పు గోదావరి జిల్లాలలో ఉన్నారు. వీరిని ఆదిలాబాద్‌లో నాయకుపు అని, నిజామాబాద్‌లో న్యాయక పోళ్ళు అని కరీంనగర్, వరంగల్ జిల్లాలలో నాయిక పోళ్ళు అని ఖమ్మం, పశ్చిమ, తూర్పుగోదావరి జిల్లాలలో నాయకులు అని పిలువబడుతున్నారు. వీరి జనాభా వరంగల్ జిల్లా 20 వేలవరకు ఉంది.

నాయకపోడు అరణ్యవాసి గిరిజనులు ప్రత్యేకమైన Culture కలిగితెగ, దుస్స, కర్పుగోల, బుట్టి వీరి Culture కు Symbol అయినా ప్రభుత్వం ప్రత్యేక తెగగా గుర్తించక పోవడం శోచనీయం. ఆదిలాబాద్ జిల్లాలో గోండు, రాజగోండు, నాయకపోడు అని గోండు తెగలో క్లబ్ చేయబడి 6వ సంఖ్యలో ఉంది. మిగతా జిల్లాలలో Caste list లో లేక రకరకాల కుల ధృవీకరణ పత్రం తీసుకుంటున్నారు.

గిరిజనులపై పరిశోధననే అంతంత మాత్రమైతే ఈ తెగ పై ప్రత్యేక పరిశోధన జరుగలేదని చెప్పవచ్చును.

నాయకపోడులకు పూజారులు, కొర్పాజులు అనే వారు ఆశ్రిత హక్కుదారులు వీరి ఇలవేల్పు లక్ష్మిదేవర ఎక్కువగా పాండవులను దేవతలుగా కొలుస్తారు. పూజారులు, కొర్పాజులు కేవలం పాండవుల కథలు చెబుతారు. నాయక పోడులు మేమే పాండవులం అని అంటారు.

నాయకపోడు సామాజిక పరిణామాలు

సామాజిక పరిణామాలలో ముఖ్యమైనవి వివాహం (Marriage), బంధుత్వము (Kinshep), మతం (Religion), చట్టము (Law)

నాయకపోడు రెండు రకాల గోత్రాలు కన్పిస్తున్నాయి.

1) యాపకాయ గోత్రం 2) పాలకాయ గోత్రం

మేనరికంనే పెండ్లీళ్లు చేసుకుంటారు. పితృవంశీయ లక్షణాలున్నా, మాతృవంశీయ లక్షణాలు కూడా ఉన్నాయి.

మాతృవంశీయ లక్షణాలు రెండు రకాలు ఎ) సామాజిక లక్షణాలు (Social Elements)లేవు కాని బి) మతపరమయిన లక్షణాలున్నాయి. (Religious Elements). ఆడదేవతలను పూజించడం ఉంది.

ఉదా : లక్ష్మిదేవర పెద్దమ్మ

| | |
|---|---|
| కుడి దేవర | అంకమ్మ |
| సమ్మక్క | సారలమ్మ |
| ముత్యాలమ్మ | మైసమ్మ |
| ఎర్రమ్మ | ఎల్లమ్మ |
| బలరక్కీసనాగులమ్మ | |
| దైత | మొ॥ ఆడదేవతలు |

**వివాహాచారాలు :**

సామాజిక వ్యవస్థలో చాలా ముఖ్యమైనది వివాహవ్యవస్థ.

నాయకపోడు వివాహవ్యవస్థను పరిశీలిస్తే అవి

1) సంప్రదింపుల ద్వారా వివాహం : తల్లి దండ్రులు కలిసి పెద్దల ద్వారా వివాహం చేయడం. ఈ పెండ్లి పిల్లవాడి ఇంటిలోనే జరుగుతుంది.

2) వివాహం కాకుండానే కాపురంచేయడం పరిస్థితులవల్ల వివాహం చేసుకోకపోవడం ఇద్దరు కలిసి లేచిపోయి పిల్లలు కంటారు.

3) పునర్వివాహము : భర్తగాని, భార్యగాని ఇష్టంలేక విడిపోయి పునర్వివాహం చేసుకోవడం. ప్రత్యేకమైన ఆంక్షలేమి లేవు.

4) మార్మనం (విధవా పునర్వివాహం) : విధవ అయితే మళ్ళీ పెండ్లి చేసుకోవడం మార్మనం.

5) బహుభార్యత్వం, భార్య ఉన్నా కూడుకోవడం : పిల్లలు లేకపోవడం వల్ల చేసుకోవడం. వివాహవ్యవస్థలో స్త్రీ పురుషులకు సమాన ప్రాధాన్యత ఉంది. ఎవరికి ఇష్టంలేకున్నా విడిపోయి మళ్ళీ వివాహం చేసుకోవచ్చు. కేవలం విడిపోయేవాళ్ళు లగ్గం ఖర్చు, పెద్దల నిర్ణయింపుకారణం ఇవ్వాలి.

ఇప్పుడిప్పుడు వరకట్నం ఆసన్నమైంది.

## మతపరంగా నాయకపోడులు

1) Animism (అధప్రాకృతిక శక్తి)

నాయకపోడులు తమప్రక్కనున్న వృక్ష జంతు నదీ అన్ని శక్తిరూపాలుగా, మరణించిన పెద్దలుకూడా శక్తిరూపాలుగా భావించి పూజిస్తారు. ప్రతి యింటిలో పెద్దల చిహ్నాలను పెట్టి హానిజరుగకుండా చూడమని ప్రార్థిస్తారు.

2) Naturism (ప్రకృతివాదం)

ప్రకృతిని శక్తిగా నమ్మడం ప్రకృతిని పూజించడం నాయికపోడులలో వుంది సూర్యుడు సృష్టికర్త అని సూర్యున్ని దైవంగా ప్రార్థించడం, ఇంటిలోని దర్వాజలో సూర్యుడు పడితే ఇంటికి వెలుగు వస్తుందని నమ్ముతారు.

3) Taboo (నిషేధం)

నిషేధాన్ని మత ఆచారంగా పేర్కొనవచ్చు. బహిష్టు సమయంలో స్త్రీలు లక్ష్మి దేవర దగ్గరకు రాకూడదు. దూరంగా ఉండి దేవరను చూచిన పోతరాజు వాళ్ళను గుర్తించి కొట్టుతూ వెళ్ళగొడతారు. గృహ నిర్మాణంలో తానికర్ర నిషిద్ధం. తానన్న నేనన్న ఉండాలని కోరుకుంటుందట.

4) పితృదేవతాపూజ (Ancester Worship)

నాయకపోడు మరణించిన పూర్వీకులు క్షేమం కోరుతారని భావించి వారికి చాలా ప్రాధాన్యత నిస్తారు.

మరణించిన వారిని ఇంటిలో పొయ్యికి ఎదురుగా గోడకు ఎర్రమన్నుతో గుండ్రగా పూసి దానికి బొట్లు పెడతారు. పెండ్లికి ముందు పెండ్లి తర్వాత వారిని మొక్కడం, పండుగలో వారిని మొక్కడం వారిముందు బట్టలు పెట్టి కట్టుకోవడం, వారికి ఇష్టమైనవి పెట్టడం వుంది.

దుష్టశక్తులు ఆవరించకుండా వారే చూసుకుంటారని వారు మెదిలిన చోటు పుణ్యస్థలంగా భావించి, అక్కడే ఇల్లు కట్టుకుంటారు. సంవత్సరానికి ఒకసారి పెద్దల పండుగ (కొత్తల పండుగ) చేస్తుంటారు.

అధిష్టాన దేవత (Supreme God)

నాయకపోడు అధిష్టాన దేవత లక్షిదేవర, అనారోగ్యంగా ఉన్నా పంటకు పురుగుతగిలిన, పిల్లలు లేకున్నా, వర్షంపడకున్నా వివాహ కార్యక్రమంలో పూజారిగా, లక్షిదేవర చూసుకుంటుంది. అన్ని విషయాల్లో లక్ష్మిదేవరకు చాలా ప్రాధాన్యత ఉంటుంది.

బహుదేవతారాధన (Polytheism)

నాయకపోడుల అధిష్టాన దేవత లక్షిదేవర అయినా ఇతర దైవిక శక్తులపై కూడా నమ్మకం ఎక్కువ వ్యక్తిగత జీవితానికి సంబంధించిన మంచికీ చెడుకి ఒక్కొక్క రకమైన శక్తిని పూజించడం చేస్తారు.

1) పంటలను కాపాడేందుకు మైసమ్మను, కుడిదేవరను

2) పంటకు పురుగుతగులకుండా లక్ష్మిదేవరను

3) గ్రామాన్ని కాపాడమనీ ముత్యాలమ్మను

4) అడవిలో తిరిగేవారం పురుగుబూసి ముట్టకుండా చూడమని పెద్దమ్మ, నాగులమ్మను,

5) మంచికీ, చెడును లక్ష్మీదేవరను

6) వర్షాలకోసం సాల్‌దేవరను

లక్ష్మిదేవరకు గుర్రం ముఖం కలిగిన ప్రతిమ ఉంది. కాని మిగతాదేవతలకు ప్రత్యేకమైన ఆకారం ఏమీ కన్పించదు. రాయిని చెట్టును, పసుపు కుంకుమలు పెట్టి పూజిస్తారు.

1) సంరక్షక శక్తులు (Protective Spirits)

ఈ దేవరలు గ్రామాన్ని రక్షిస్తాయి. ముత్యాలమ్మ ఈ శక్తిని ఏ కీడురాకుండా చూడమని గ్రామం అంతా సామూహికంగా వ్యక్తిగతంగా శక్తిని కొలుస్తారు.

2) ఉదారపూరిత శక్తులు

కుడిదేవర ఈమెను కొలువని పక్షంలో పంటను నాశనం చేస్తుంది. కొలిచినవారికి ఇతరుల పంటను తీసుకొచ్చి ఇల్లు నింపుతుంది.

పితృశక్తులు (Ancestrd Spirits)

ఈ శక్తులు ఉదారపూరిత శక్తులుగా నాయకపోడులు గుర్తిస్తారు.

**పవిత్ర ప్రదేశము**

దేవతలను పెట్టిన చోటును పవిత్ర ప్రదేశంగా పరిగణిస్తారు. దేవుడుండే చోట వంటగదిలో పొయ్యికి ఎదురుగా ఉండే ప్రాంతం కుడిదేవర, అంకమ్మ, ఎల్లమ్మ, ఎర్రమ్మ పితృదేవతలు ఈ దేవతలు పొయ్యికి ఎదురుగా వండే ప్రతి వంటను చూస్తాయి.

తూర్పుకు ఉత్తరం వైన (ఈశాన్యం వైపు) సమ్మక్క, సారలమ్మ, రాజులు, లక్ష్మిదేవర, పెద్దమ్మ పెద్దలు, పితృదేవతలు ఉంటారు. ఈ ప్రదేశం పవిత్రమైనది. అంటు ముట్టుకు చాలా ప్రాధాన్యత ఉంటుంది.

పూజా కార్యక్రమాలకు ప్రత్యేకమైన పూజారి ఉన్నాడు. పూజారి కూడా వంశపారంపర్యంగా ఉంటాడు.

నాయకపోడులను బాగా పరిశీలిస్తే ఇవన్ని ఉన్నాయి. గిరిజనేతరుల ప్రభావంతో నాయక పోడుల మత విశ్వాసాలలో అనేక రకాలైన మార్పులు, గిరిజనేతరుల ప్రభావంతో చేర్పులు వచ్చాయి.

సంస్కృతి పరంగా నాయకపోడు

సంస్కృతి అంటే వర్తమానంలో ఉన్నవారికి తమగత మేదో తెలియజేసే అంశమే సంస్కృతి.

ఇందులో ముఖ్యంగా : నాయకపోడు ఆహారం ఎలా తయారు జేసుకున్నారు. ఇల్లు ఏ విధంగా కట్టుకున్నారు బ్రతుకు దెరువు కోసం చేసుకునే వృత్తులు ఏమిటి?

ఈ పనితనం ఒక తరం నుండి మరో తరానికి ఎలా సంక్రమించిందో తెలియజేసేది సంస్కృతి.

నాయకపోడు నివసిస్తున్న ప్రదేశం ఒకప్పుడు అడవి ప్రాంతం. ఇపుడు మైదాన ప్రాంతమయ్యింది. అయినా దూర ప్రాంతాల్లో అడవికి వెళ్ళి కందమూలాలు ఇప్పటికి సేకరిస్తున్నారు.

ఆహారం కోసం సేకరిస్తున్న కందమూలాలు ముఖ్యంగా ఎర్రచెన్నగడ్డ, తెల్లచెన్నగడ్డలు, తేగదుంప, అడవిశంభ కాయలు, చౌడిదుంప మొ॥

పండ్లు: తునికి పండ్లు, పూనుగుపండ్లు, మొ॥

ఆకుకూరలు : గొగ్రుకూర, బొద్దికూర, అవ్వాలకూర చెరువులో, టోగుల్లో దొరికే దుప్పలతో అంబలి తయారు చేసుకోవడం జొన్నలతోకూడా అంబలి తయారు చేసుకుంటున్నారు. ఎక్కువభాగం, నాయకపోడులుండే ప్రదేశంలో గిరిజనేతరులున్నారు. కాబట్టి కూలీలుచేస్తూ అందరూ అన్నం తింటున్నారు. 

**అడవిలో లభించే ఉత్పత్తులు :** 

బంక, చింతపండు, ఇప్పపూవు, కొండతేనె, చీపుర్లు, వెదురుకొమ్ము, అడవి జంతువులు కొమ్ములు, నులక మొదలైనవి సేకరించి అమ్ముకుంటారు.

వేట : ఒకప్పుడు అడవిలో రకరకాల జంతువులను వేట కుక్కలతో పాటు 5,6, మంది కలసి జంతువుల వేట చేసేవారు. 

ఇప్పుడు కుందేల్లు, ఉడుములు మొ॥ మాత్రమే షికారు చేస్తున్నారు.

గృహ నిర్మాణం : నాయకపోడు గృహనిర్మాణంనకు ప్రత్యేకమైన వాస్తుఉంది.

నిర్మాణమునకు ముందు స్థల నిర్ణయంచేసి మంచి జరుగుతుందనే అనుకున్న తర్వాత ఇల్లు కట్టుకుంటారు.

**ఇండ్లరకాలు**

మోరిపాక ఇల్లు, నాలుగుదూలాల ఇల్లు, రెండుదూలాల ఇల్లు, ఒంటిదూలం ఇల్లు, పిల్లదూలం ఇల్లు, నిట్రాల్ల ఇల్లు, పిల్లనూరు ఇల్లు

ఈ ఇండ్లకు తూర్పుముఖం చేయబడి, దర్వాజలో సూర్యుడుపడాలె ఇల్లు వెలుగుతూ ఉంటుందని బావిస్తారు. ఇంటిలో పొయ్యి అజ్ఞానంలో (ఆగ్నేయం) ఉండాలి.

నాయక పోడులు కట్టుకున్న ఇల్లు చిన్నదే అయినా, ఇంటిని ఉపయోగించుకునే విధానం నాగరిక సమాజం ఆశ్చర్యంగొలిపె విధంగా ఉంటుంది.

ఇప్పుడు ఇంటి నిర్మాణం చేయడానికి బ్రాహ్మణులను ఆశ్రయిస్తున్నారు.

### వృత్తులు

అడవి ప్రాంతంలో వృత్తులు చేసుకునేది నాయకపోడులే. వడ్రంగి పని కమ్మరిపని వీరే చేస్తారు. ఇపుడు ఈ వృత్తులు చేసే గిరిజనేతరులు వచ్చినారు.

### వ్యవసాయం

పోడు వ్యవసాయం నుండి ఆధునికవ్యవసాయం చేయడం నేర్చుకున్నారు. కాని ఆధునిక వ్యవసాయానికి తగిన పెట్టుబడి పెట్టలేక ఉన్నభూములన్ని అమ్ముకొని వ్యవసాయ కూలీలుగా మారినారు.

### ప్రస్తుతం నాయకపోడుల వృత్తులు

1) ఇటుక పనికిపోవడం

2) జీతం (పాలేరు) ఉండడము

3) బ్యాండు వాయించడం

4) ఇతర కూలిపనికి పోవడం

ఆర్థికస్థితి : నాయకపోడు ప్రత్యేక తెగకాదు కాబట్టి ప్రభుత్వ సహాయ కార్యక్రమాలు సరిగా అందడంలేదు. అడవిలో దొరికే ఉత్పత్తులకు గడ్డలకు, కాయలకు దూరమైనవారు. ఆధునిక వ్యవసాయం చేయనిస్థితిలో ఉన్నవారు ఎటూగాని అయోమయ స్థితిలో ఉన్నారు.

### చట్టపరంగా నాయకపోడు

నాయకపోడు కులపెద్దకు ప్రాధాన్యం ఇస్తారు. కులపెద్ద పూజారి వారసత్వంగా సంక్రమిస్తుంది. పూజారి ఊరిక్షేమం కొరకు దేవతలను పూజిస్తాడు. కులపెద్దకు సహాయంగా మేనగాడు ఉంటాడు.

మేనగాడు : ఇది వారసత్వమే ఎప్పుడో వారి కులంలో కులం తక్కువవారిని పెండ్లిచేసుకున్నందుకు పుట్టినవాడు మేనగాడు అప్పటినుండి ఊరిలో (నాయకపోడు) కులంవారిని పిలవడం చావుకూ, పెండ్లికి చుట్టాలకు చెప్పడంలాంటి విషయాలు మేనగాడు చేస్తాడు.

పంచాయితీ : కులంవారి నందరిని పిలిచి అందరిముందే కుల పెద్ద పంచాయితి తీర్మాణం చేస్తాడు. దండుగ అనేది శిక్ష కులంకేటు (కులతప్పు)

పర్యావరణం : పర్యావరణం అంటే ఆహారం, నీరు, గాలి నాయకపోడు ఆహారం అటవీసంపద, ఈ అటవీసంపద నాయకపోడులకు దూరం అయ్యింది. అడవిలోదొరికే

అన్నింటిని ఉపయోగించుకునేవారు. టోగుల్లో నీరు త్రాగేవారు. అడవిలోని సంపదలను వినిమయ పద్ధతిద్వారా అమ్ముకుని బ్రతికేవారు.

గిరిజనేతరులు రావడంవల్ల అడవి అంతా కనుమరుగయ్యింది. వ్యవసాయ భూమికోసం చెట్లనునరికి కాలబెట్టడం వల్ల అడవిపోయింది. ప్రభుత్వం లాటీలు కొట్టి అమ్మడం, పట్టణ ప్రాంతాలకు జీరోకర్ర టేకు, పెద్దేగి, మొదలగు కర్రలు అక్రమంగా వ్యాపారం చేయడం ఇదంతా గిరిజనేతరుల వల్ల జరిగిందే అడవిప్రాంతాల్లో రెయన్స్ పాక్టరీలు పెట్టడంవల్ల పర్యావరణం అంతా నాశనం అయ్యింది.

## విద్యాపరంగా

నాయకపోడులు విద్యలో చాలా వెనుకబడివున్నారు. జిల్లా మొత్తంలో ప్రాథమిక విద్యవరకు కొంత చదువుకొని ఉన్నారు. 1 డాక్టర్లు 3,4 Degree discontinue, 3 Degree చేస్తున్నారు. 10 మంది వరకు ఇతర ఉద్యోగస్తులు ఇప్పుడే ఒకరు ఇంజనీరుగ జాయిన్ అయ్యారు.

ఈ విధంగా నాయకపోడుల సామాజికంగా, ఆర్థికంగా సాంస్కృతికంగా, పర్యావరణంగా, విద్యాపరంగా చాలా వెనుకబడి ఉన్నారు. ఆధునిక సమాజాన్ని తట్టుకోవాలంటే ...

1. నాయకపోడులను ప్రత్యేక తెగకు గుర్తించి వారికి కావలసిన వనరులు చేకూర్చాలి.
2. Primitive tribe group గా గుర్తించాలి.
3. నిర్భంధ విద్యను ప్రవేశపెట్టాలి.
4. ప్రభుత్వం అమలుచేస్తున్న అభివృద్ధి కార్యక్రమాన్ని మధ్యదళారులనుండి రక్షించి ఉపయోగపడేలా చూడాలి.
5. ఇందుకు స్వచ్ఛందసంస్థలు, స్వచ్ఛంద కార్యకర్తలు ముందుకువచ్చి ఒక్కొక్క గ్రూప్‌కు కావలసిన వనరుల ప్రభుత్వం అమలు చేస్తున్న తీరుగమనించి ఇటు ట్రైబల్స్‌కు శిక్షణా తరగతులు నిర్వహించి గిరిజన సమాజం ఎలా అభివృద్ధి అవుతుందో అటు ప్రభుత్వానికి ఇటు గిరిజన సమాజానికి తెలియజేసినపుడే గిరిజన సమాజం ఆధునిక సమాజాన్ని అందుకోగలరు.

*

# గిరిజనులు - పండుగలు - వేడుకలు

అమ్మిన శ్రీనివాసరాజు

మానవుడు అనునిత్యం కాలంతో పోటీపడుతూ మానసికంగా శారీరకంగా శ్రమిస్తూ తన మనుగడ కొనసాగించడం పరిపాటైపోయింది. అనునిత్యం చేసే శ్రమకు మధ్యలో ఆటవిడుపు (సెలవు) కలిగినపుడే మరింత ఉత్సాహం పెంపొందించుకొని తన పనిని మరింత ఉత్సాహంగా చేసుకు పోగలడు. ఆ వుద్దేశంతోటే కొన్ని ప్రత్యేక సమయాలు సందర్భాలు అనిచెప్పి వాటికి "పండుగలు" అనే పేరు పెట్టి వాటిని మన సంస్కృతీ సంప్రదాయాల్లో మిళితం చేసుకుని ఆయా సందర్భాల్లో వాటిని అచరిస్తూ పాటిస్తూ మన సంస్కృతీ - సంప్రదాయాలను కాపాడుకుంటూ ఆయా పండుగల ఆనందాలు అనుభవిస్తున్నాము.

ఏ ప్రాంతంలో నివసించే వారైనా వారి వారి ప్రాంతాలకనుగుణంగా వారి సంప్రదాయాల ప్రకారం పండుగలు జరుపుకోవడం పరిపాటి. "పండుగలు వేరైనా పండగానందం ఒక్కటే" "అమెరికా వారికైనా ఆదివాసి వారికైనా ఆనందం ఒక్కటే?"

చెట్లలో చెట్లలా, కొండల్లో కొండల్లా, కాలేకడుపుకోసం కాయ కష్టం చేసే అమాయకజీవులైన ఆదివాసి గిరిజనులు కూడా వారి కష్టాల బ్రతుకు బాటలో అక్కడక్కడా "పండగ-మజిలీలు" చేసుకుని ఆ ఆనందాన్ని అనుభవిస్తుంటారు.

అందులో భాగంగానే భద్రాచలం ఏజన్సీ ప్రాంతంలోని "కోయదొర" తెగవారు జరుపుకునే పండుగల విశేషాల తెలుసుకుందాం! సాధారణంగా వీరు జరుపుకునే పండుగలు "సామూహిక పండుగలు" "వ్యక్తిగత పండుగలు" అని రెండు రకాలు.

ఈ గిరిజన గూడేలలో ఎక్కువగా సామూహిక పండుగలే కనిపిస్తాయి. ఈ సామూహిక పండుగలను ఆ గూడెంలోని గిరిజనులంతా కలిసి జరుపుకుంటారు. ఈ సామూహిక పండుగల్లో ప్రధానమైనవి (1) ఇత్తు పండుగ (2) పచ్చ పండుగ (3) ఎల్లనంపుడు పండుగ (4) చిక్కుడు కొత్త పండుగ.

(1) ఇత్తు పండుగ :- సాధారణంగా గిరిజనులు వారికున్న స్వల్ప సౌకర్యాలతో వ్యవసాయం చేసుకుంటుంటారు. అందులో భాగంగా తొలకరి ఆరంభం అయ్యాక ఆరుద్ర కార్తెలో మొదటి ఆదివారం జరుపుకునేదే "ఇత్తు పండుగ". ఆ సంవత్సరం వారి పంటలు బాగా పండాలనివారి గ్రామ దేవతకు మొక్కు కోవడానికే వీరీ పండుగ జరుపుకుంటారు. వీరు జరుపుకునే సామూహిక పండుగలన్నింటికీ ఆ గ్రామ దేవత పూజారి అయిన

పెరమయ్య / పెరమడు నాయకత్వం వహిస్తాడు.

ఈ పండుగ జరిపే ఆదివారం పొద్దుటపూటే పెరమడు గ్రామదేవతలకు పసుపు కుంకుమలు పూసి పూజచేస్తాడు. అనంతరం గ్రామ పెద్దలు గూడేనికి వెలుపల తూర్పుదిక్కున పడమ దిక్కున పచ్చికొమ్మలు పాతి తోరణాలు కడతారు. గ్రామదేవత వద్దకూడా పందిరి వేస్తారు. అనంతరం జొన్న అంబలి ఆరబోస్తారు. ఇక ఆనాటి రాత్రి పూట ఆ గూడెపు యువకులు పెద్దలు కలసి రెండు గుంపులుగా విడిపోయి ఒక గుంపు ఒక వైపు మరో గుంపు మరో వైపుగా గూడెంచుట్టూ తిరుగుతారు. ఇలా తిరిగే ఒక గుంపులో బొణగలు/గంటలు వాయిస్తూ వుంటారు. వీరిని పాండవులు అంటారు. రెండవ గుంపును పొరులుగా భావించుకుంటారు. ఈ పొరుల గుంపువారు "మీరెవరు...? మీరెవరు...? అంటూ పెద్దగా అరుస్తూ అడుగుతారు. దానిక పాండవుల గుంపు వారు "మేం పాండవులమ్... పంచపాడవులం ..." అంటూ సమాధానం చెబుతారు. దానికి రెండో గుంపు వారు "అయితే మా గూడెంలోని పురుగూ-పుట్రా, ఈగలు-దోమలు, రోగాలు-రొచ్చులు, అన్నీ పట్టకపోండి..." అని అంటారు. దానికి పాండవుల గుంపు "అట్టనే.. అట్టనే" అంటూ సమాధానంఇస్తారు. ఇలా సంభాషణలతో రెండు గ్రూపులూ గూడెంచుట్టూ తిరిగాకా గూడేనికి తూర్పుదిక్కున రెండు గుంపులూ కలుసుకుంటాయి. అక్కడ అందరూ కలిసి తమ చేతుల్లోని కొర్రాయిలు (నిప్పుకట్టెలు) ఆకాశం కేసి దూరంగా విసిరివేసి అక్కడినుండి అందరూ కల్సి గూడెం మధ్య వున్న గ్రామదేవత గుడివద్దకు చేరుకుంటారు. అక్కడ ఇప్పసారా, కోడిని దేవతకు మొక్కి అక్కడే ఆకోడిని కోసి అంతా కలసి తింటారు. అనంతరం ఇప్పసారాతాగుతూ తెల్లవార్లూ అక్కడే నృత్యాలు చేసుకుంటూ గడుపుతారు. ఈ విధంగా ఊరు కట్టడి చేయడం వల్ల ఆ రాత్రి అంతా ప్రక్క గూడెం వారిని ఎవరినీ తమ గూడేనికి రానివ్వరు. అలాగే ఆ గూడెం మీదుగా కూడా ఎవరినీ వెళ్ళనివ్వ కుండా కాపలా కాస్తారు.

ఆ "ఊరుకట్టు" సమయంలో పొరుగూరువారుగాని వెళితే తమ గూడెం బరకతి (పంటల రాబడి) తగ్గుతుందని వాళ్ళు విశ్వసిస్తారు. పంటలు అధికంగా పండాలని కోరుకుంటూ చేసే ఈ పండగ చేసాకనే వాళ్ళు పొలం పనులు మొదలు పెడతారు.

(2) పచ్చ పండగ :- ఈ పండగ కూడా ఆదివారం నాడే చేస్తారు. ఈ పండుగనాడు పొద్దుట పూటే పెరమడు గూడెంలోని 3 లేదా 5 ఇళ్లలో జొన్న అంబలి అడిగి అనంతరం గ్రామదేవతలైన పోశమ్మ, ఎర్రమ్మలకు పసుపు కుంకుమలు పూసి పూజచేస్తాడు. గూడెం వెలుపల పాతిన ద్వార స్థంభాల వద్దకూడా తోరణాలు కడతారు.

గ్రామదేవతలను పూజించిన తరువాత అక్కడ ద్వార స్థంబాలవద్ద అంతకు ముందు అడిగినజొన్న అంబలి ఆరబోస్తాడు. ఈ అనంతరం ఒక కోడిపిల్లను ఆ దేవతవద్ద

కోస్తారు. ఇలా పగటిపూటతో ముగిసే ఈ "పచ్చ పండుగ" చేసాకే గిరిజనులు ఆహారంగా తినే పచ్చకూర, గెగ్గలికూర, పాగటి పాలకూర మొదలైన ఆకు కూరలు తినడం మొదలు పెడతారు.

(3) ఎల్లనంపుడు పండుగ :- గూడెంలో అందరూ ఆయురారోగ్యాలతో ఉండాలని గ్రామదేవతకు మొక్కుకునే పెద్దపండుగే ఈ "ఎల్లనంపుడు పండుగ" దీనిని మఘకార్తె ఆరంభమైన మొదటి ఆదివారం చేస్తారు. ఈ పండుగకు ముందుగానే పండుగ ఖర్చుకు గాను గూడెంలో అందరి వద్ద చందాలు వసూలు చేస్తారు. ఆ డబ్బుతో పండగ సంబరానికి కల్లు, కోళ్ళు, మేకపోతు మొదలైనవి కొంటారు.

ఈ పండుగ పూట పొద్దున్నే పెరమడు గూడెంలో అందరివద్దా ధాన్యం గింజలు అడుగుతాడు. అనంతరం గ్రామ దేవతలైన పోశమ్మ, ఎర్రమ్మల బొడ్డురాళ్ళుకు (కర్రతో చేసిన విగ్రహాకారాలు) పసుపు కుంకుమలు రాస్తాడు. వాటిముందు పందిరి వేస్తారు. గూడెం బయటవున్నద్వార స్థంబాలకు కూడా తోరణాలు కట్టి అక్కడ జొన్న అంబలి ఆరబోస్తారు. తరువాత కర్ర ముక్కలతో "బండి" ఆకారపు నిర్మాణం తయారు చేసి దానిమీద చిన్న చిన్న దేవత విగ్రహ ఆకారాలను ఉంచుతారు. దీనికి కొత్త గుడ్డ కడతారు. దీనిని పొద్దు కూకే సమయంలో గూడెం మధ్యలోగల బొడ్డురాళ్లవద్ద ఉంచి, డప్పులు, వాయిద్యాలతో సంబరం చేస్తారు. అక్కడికి గూడెంలోని ప్రతి ఒక్కరూ తవ తమ మొక్కులు తీసుకొచ్చి పెరమయ్య సమక్షంలో వాటిని దేవర్లకు సమర్పించుకుంటారు. అనంతరం అక్కడే మేకపోతును బలివేస్తారు. అనంతరం దేవతా విగ్రహ ఆకారాలున్న బండి పెరమడు మోసుకుంటూ వాయిద్యాలతో సంబరంగా "పెరమడ్ని-బండిని" అనుసరిస్తూ గూడెం మధ్య నుండి సాగిపోయి గూడేనికి తూర్పుదిక్కునున్న ద్వార స్థంబాల వద్దకు చేరుకుంటారు. అక్కడ బండిని వుంచి దాని దగ్గరే పాత చేట, చీపురు, గుల్లలు కూడా వుంచి అందరూ అక్కడి నుంచి తిరిగి గూడెంమధ్య బొడ్డురాళ్ళ వద్దకు చేరుకుంటారు. అక్కడ అంతకుముందు గ్రామదేవతకు బలి ఇచ్చిన మేకపోతును కోసి గూడెంలోని అందరూ సమానంగా పంచుకుంటారు. అనంతరం ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళి పోతారు.

(4) చిక్కుడు కొత్త పండుగ :- ఈ పండుగకూడా ఆదివారం పొద్దుటపూట చేస్తారు. పొద్దుటపూటే పెరమడు గూడెంలోని ప్రతి ఇల్లు తిరిగి ధాన్య గింజలు అడుగుతాడు. అనంతరం గ్రామదేవతలకు పసుపు కుంకుమలు రాసి పిదప కోడిని మొక్కి చిక్కుడుకాయల కూరవండి గూడెం పిల్లకు పెడతాడు. ఈ చిక్కుడు కొత్త పండుగ చేసాకే గిరిజనుల తమ ఇళ్ళపైకప్పుకునే గడ్డిని కోయడం ప్రారంభిస్తారు. ఈ పండుగకు ఒక గమ్మత్తైన విషయం ముడిపడివుంది. చిక్కుడు కొత్త పండుగ చేసిన గూడెంవారు ఆ పండుగ ఇంకా చేయని

గూడెం వాళ్ళ ఇంటివద్ద అన్నం తినరు. అలాగే ఆ పండుగ చేయని గూడెం వారికి చేసిన వాళ్లు అన్నం పెట్టాలంటే వారికి వేరుగా అన్నం పెడతారు.

ఇకపోతే గిరిజనులు జరుపుకునే వ్యక్తిగత పండుగల్లో ముఖ్య మైనవి రెండు. అవి (1) కొత్తల పండుగ (2) పొట్టపండుగ. ఈ పండుగల్లో అతి ప్రధానమైంది కొత్తల పండుగ. ఈ పండుగ ఉత్తర కార్తె మొదటి పాదంలో గురువారం రోజు జరుపుకొంటారు. దీనినే పెద్దల పండుగ అని కూడా అంటారు. ఈ పండుగ నాడే ఆ సంవత్సరం పెళ్ళై వచ్చిన కొత్త కోడళ్ళను తమ తమ దేవర్లలో కలుపుకోవడం ఒక ప్రధాన విషయంగా ఆచరిస్తారు. అందరూ ఈ పండుగలను తమకు వున్నంతలోనే ఉత్సాహంగా జరుపుకుంటారు.

ఈ పండుగనాడు ఇంటి యజమాని, యజమానురాలు పగలంతా ఉపవాసం వుంటారు. ఇక సాయంత్రానికల్లా ఇంటిల్లపాది తలస్నానాలు చేసి కొత్త బట్టలు కట్టుకుంటారు. అనంతరం యజమానురాలు అన్నం వండుతుంది. పిదప ఇంటి యజమాని ఇంటి బయట తూర్పు దిక్కున ఇప్పకొమ్మపాతి దానికి పసుపు కుంకుమ రాసి దాని ముందు తమ దేవర్లకు తమ వంశపు పెద్దలకు అందరికీ ఇప్పసారా, కోడి మొక్కుతాడు. మొక్కిన తర్వాత దాన్ని అక్కడ బలి ఇస్తాడు. పిదప వండిన అన్నంతో పది ముద్దలు చేసి తమ ఇంట పేర్ల వారందరికీ పంచుతాడు. ఈ పండుగ పూట కుంటుంబంలోని అందరూ ప్రధానంగా యజమాని యజమానురాలు తప్పని సరిగా ఇప్ప సారా త్రాగడం పరిపాటి. ఆ పండుగ పూట తమ ఇంటికి వచ్చిన చుట్టాలకు స్నేహితులకు విరివిగా ఇప్పసారా పోసి మర్యాదలు చేస్తారు. ఈ పండుగపూట ఒకరి ఇంటికి ఒకరు వచ్చి ఇప్పసారా త్రాగుతూ ఆనందంగా గడుపుతారు.

ఇకపోతే ఈ పండుగ పూట కొత్త కోడళ్ళను దేవరలో కలపడం గురించి తెలుసుకుందాం.... ఈ పండుగనాడు కొత్తగా పెళ్ళైన దంపతులిద్దరూ ఉపవాసముంటారు. యధావిధిగా సాయంత్రం పూట కొత్తకోడలుతో అన్నం వండిస్తారు. పిదప ఆ గూడెపు పెద్దలు ముత్తైదువల సమక్షంలో ఇంట్లో తూర్పు వైపున దేవర్లకు పెడతారు. తమ ఇంటి దేవర్లకు ఇంటి యజమాని కోడిపెట్టను మొక్కుతాడు అనంతరం కొత్త దంపతులతో మొక్కిస్తాడు. అప్పటి నుండి ఆ కొత్త కోడలు ఇంటిపేరు మారినట్లు భావిస్తారు. ఇదే దేవర్లను కలిపే వ్యవహారంలో మొగనాలి దంపతులైతే ("మొగనాలి" అంటే ఒకరిభార్యను మరొకరు చేసుకోవడం) నీలపాలు మలపడం అంటారు.

ఇక్కడ యధావిధిగా దంపతులతో మొక్కించే ముందు ఇప్పసారా నీళ్ళు, పాలు కలిపి ఆకుడొప్పల్లో పోసి దేవర ముందు ఆరపబోయించి "పిల్లలు పేల్చిన కోడిపెట్ల"తో అక్కడ మొక్కిస్తారు. పండుగ మర్నాడు తమ ఇళ్ళకు వచ్చే కులవృత్తులవారికి (చర్మకారులు, కమ్మరి, కుమ్మరి, మంగలి) ఇప్పసారా, దాన్యగింజలు, అన్న దానం చేస్తారు. ఈ విధంగా

జరుపుకునే ఈ కొత్తల పండుగ లేదా పెద్దల పండుగను వీరు ఒక పెద్ద పండుగగా చూసుకుంటారు.

(2) పొట్ట పండుగ : తమకు పండిన పంట ఫలసాయాన్ని ముందుగా తమ కులదేవతకు సమర్పించిన తరువాతే ఆ ఫలాన్ని అనుభవించే ఆచారం గిరిజనుల్లో సహజంగా కనిపిస్తుంది. దానిలో భాగమే వాళ్ళు జరుపుకొనే ఈ "పొట్ట పండుగ" తమకు పండిన పంటల్లో మొదటి కంకి/పొట్ట పొలం నుండి తీసుకువచ్చి మేళతాళాలతో నృత్యాలు చేసుకుంటూ గ్రామదేవత వద్ద ఆ ఫలసాయాన్ని సమర్పించుకుంటారు. దీనికి గాను గ్రామ దేవతల్లో ఒకరైన "పోశమ్మ" కు బుధవారంనాడు యైతే ఎర్రమ్మకు అయితే ఆదివారంనాడు ఈ పొట్ట పండుగ చేయడం వారి ఆచారం.

ఇలా తమ తమ ఆచార వ్యవహారాలతో వారి ఆనందాలను వారి పండుగల ద్వారా పొందడం ఆదివాసీ గిరిజనులకు ఆనవాయితీ! ఈ ఆదివాసి గిరిజనుల ఆచార వ్యవహారాలు ఆధునిక ప్రపంచానికి ఆశ్చర్యంగా ఉన్నా.... "పండుగలు వేరైనా పరమార్థమొక్కటే" అన్న విషయం నిత్య సత్యం!

*

# గిరిజనులకు రాజ్యాంగ పరిరక్షణలు - పరిశీలన

- యం. టి. పిన్.

1947 ఆగష్టు 15వ తారీకు భారత దేశం నవశకాన్ని ప్రారంభించింది. గిరిజనులతో సహా భారతీయులందరికీ నూతన ఆశలను రేకెత్తించింది. స్వతంత్ర భారత ప్రభుత్వానికి బాధ్యత వహించినవారు గిరిజనుల భవిష్యత్తు పట్ల శ్రద్ధ కనబర్చారు. అందువల్ల రాజ్యాంగం రూపొందించే సమయంలో వారు గిరిజనులపట్ల అమలు చేయబడిన విధానాలను, గిరిజనులు సాధించిన అభివృద్ధిని తెలుసుకొని దేశంలోని గిరిజనులందరికి తగియున్న నూతన విధానాన్ని తయారు చేయాలని భావించారు.

బ్రిటిష్ పాలకులు అనుసరించిన వేర్పాటు విదానంతో సహా యితర చారిత్రక కారణాలపట్ల దేశంలోని అనేక ప్రాంతాలలో గిరిజన గిరిజనేతర ప్రజల మధ్య కొంతవరకు మానసిక అవరోధాలు ఏర్పడ్డాయని వాటిని తొలగించేందుకు నేర్పుగా కృషిచేయాలని రాజ్యాంగ నేతలు గ్రహించారు. గిరిజనుల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ పరిస్థితులను మెరుగు పర్చనిదే వారు జాతీయ జీవనంలో సముచిత స్థానం పొందలేరని కూడా వారు తెలుసుకున్నారు.

గిరిజనుల పరిస్థితులను మెరుగు పరచి వారిని యితర ప్రజల స్థాయికి తేవలసిన అవసరాన్ని గ్రహించినా, యీ ఆశయాన్ని ఏవిధంగా సాధించాలో రాజ్యాంగవేత్తలకు, అవగాహన లేదు. గిరిజనుల ప్రత్యేకమైన సామాజిక, సాంస్కృతిక వ్యక్తిత్వాన్ని విచ్చిన్నం చేయకుండా వారిని జాతీయ జీవనస్రవంతిలో చేర్చాలని నిర్ణయించారు. దీనికోసం అభివృద్ధి, సమాకాలన విధానాన్ని రూపొందించారు.

భారత రాజ్యాంగాన్ని 1950లో తయారు చేసినప్పుడు, అందులో గిరిజనుల అభివృద్ధికి, సమకాలానికి దోహదపడే ఆర్టికల్స్, షెడ్యూళ్ళు చేర్చారు గిరిజనులకు, ఇతర ప్రజలకు మధ్య ఏర్పడిన సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక అంతరాన్ని అంతంచేసి గిరిజనులకు కూడా ఇతర భారతీయులతో సామాజికంగా ఆర్థికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా సమానఅవకాశాలు పొందటానికి ఈ ఆర్టికల్స్‌ను, షెడ్యూళ్ళను ఉద్దేశించారు. అదే సమయంలో గిరిజనులు సమాజంలోని ఆర్థిక వ్యవస్థ, సంస్కృతి రాజకీయ వ్యవస్థలోని మంచి విషయాలను కాపాడేందుకు శ్రద్ధ వహించారు.

గిరిజన జాతులుగా భారతరాష్ట్రపతి ఒక షెడ్యూలులో పేర్కొన్నవారే గిరిజనులని, వారిని షెడ్యూల్‌తెగలుగా పేర్కొనాలని, భారత పార్లమెంటు ఈ జాబితాను ఆమోదించిన తర్వాత ఆ జాబితాను సవరిస్తూ మరొక ఉత్తర్వు జారీచేయవచ్చుననీ రాజ్యాంగ నిర్మాతలు పేర్కొన్నారు. కాబట్టి షెడ్యూల్ తెగలంటే భారత రాష్ట్రపతి మొదట్లో ఉత్తర్వుద్వారా పేర్కొన్న

తెగలనీ, భారత పార్లమెంటు చట్టరీత్యా ఈ జాబితాకు మార్పులు, చేర్పులు చేయవచ్చునని తెలుసుకోవాలి.

దేశంలోని అన్ని రాష్ట్రాలు గిరిజనాభివృద్ధికి చేపట్టే పథకాలన్నింటికి నిధులను కేటాయించే ఏర్పాటు జరిగింది. పైవిధానానికి అనుగుణంగా గిరిజనులకు అనేక రక్షణలు, రిజర్వేషన్లు భారతరాజ్యాగంలో పొందు పర్చారు. వీటిలో కొన్నింటి కాలపరిమితి పదిసంవత్సరాలే, ఆ తర్వాత వీటి అవసరం వుండదని భావించారు. దీని ప్రకారం పది సంవత్సరాల తర్వాత భారత రాష్ట్రపతి ఒక కమీషన్ ఏర్పాటు చేసి షెడ్యూలు నిర్వాహణ రాష్ట్రాలలో షెడ్యూల్ తెగల సంక్షేమం విషయాలలో సాధించిన ప్రగతిని సమీక్షించాలి.

రాజ్యాంగం అమలులోకి వచ్చిన పది సంవత్సరాల తర్వాత అప్పటి రాష్ట్రపతి యు.ఎన్. దేబర్ అధ్యక్షతన షెడ్యూల్ ప్రాంతాలు షెడ్యూలు తెగల కమీషన్‌ను నియమించారు. ఈ కమీషన్ షెడ్యూల్ తెగల అభివృద్ధిని మిగతా ప్రజలతో వారి సమతూకాన్ని పరిశీలించిన పిదప గిరిజనుల ప్రత్యేక రక్షణలను 1970 జనవరి 26 వరకు పొడిగించాలని సిఫార్సు చేసింది. ఆ తర్వాత మరి రెండు సార్లు మొదట 1980 జనవరి 26 వరకు తిరిగి 1990 జనవరి 26 వరకు వీటిని పొడిగించారు.

గిరిజనులకు ఉద్దేశించిన రాజ్యాంగ రక్షణలను మూడు రకాలుగా విభజించవచ్చును, గిరిజనులను రక్షించడానికి ఉద్దేశించినవి రాజకీయ రక్షణలు అభివృద్ధికి సంబంధించినవి.

మొదటి రకం రక్షణలు : గిరిజనుల విద్య, ఉపాధి, ఆర్థిక వ్యవస్థ, సాంఘిక అన్యాయాలు, బలవంతపు చాకిరి, గిరిజన ప్రాంతాలు పరిపాలనకు సంబంధించినవి.

రాజకీయ రక్షణలు : గిరిజనులకు పార్లమెంటు, రాష్ట్రాల విధాన సభలలో స్థానాల ప్రత్యేక కేటాయింపు, గిరిజనులు గణనీయమైన సంఖ్యలో వున్న రాష్ట్రాలలో గిరిజన సంక్షేమానికి ప్రత్యేకంగా మంత్రుల నియామకం, నాగాలాండ్స్, అస్సాం, మణిపూర్ రాష్ట్రాల విషయంలో ప్రత్యేక నిబంధనలు చేరి వున్నాయి.

అభివృద్ధికి సంబంధించిన రక్షణలలో గిరిజనుల విద్య ఆర్థిక విషయాలపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించడానికి, వారికి ఉచిత న్యాయం అందించడానికి, గిరిజనుల సంక్షేమానికి, షెడ్యూల్ ప్రాంతాల పరిపాలనకు, రాష్ట్రాలకు కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక గ్రాంటు మంజూరు చేయడానికి ఏర్పాట్లు చేశారు.

గిరిజనుల సంక్షేమానికి, అభివృద్ధికి సంబంధించిన ఈ రక్షణలన్ని ప్రత్యేకమైన నిబంధనలద్వారా పొందుపరచారు.

1) 15, 15 (4), 29, నిబంధనలు విద్యా సంబంధమైన రక్షణలను తెలియచేస్తాయి.

15వ నిబంధన ప్రాథమిక హక్కుల విభాగంలో వుంది దీని ప్రకారం మతం, జాతి, కులం, లింగభేదం, జన్మస్థలం కారణగా ఏఒక్కరిపట్ల విచక్షణ చూపడం జరగలేదు. ఏఒక్కపౌరుడు కూడా పైకారణాలవల్ల గాని, వాటిలో ఏ ఒక్క దానివల్ల గాని 1) దుకాణాలు,

రెష్టారెంట్లు, హోటళ్ళు, ఏఇతర వినోద స్థలాల ప్రదేశం విషయంలోగాని 2) బావులు, చెరువుల, స్నానఘట్టాలు, రోడ్లు, ప్రజల ఉపయోగార్థం నిర్వహింపబడుతుంటే వాటిని ఉపయోగించుకొనే విషయంలో గాని ఎటువంటి అసౌకర్యానికి లేక నిషేధానికి లేక షరతులకు గురికాకూడదు.

గిరిజనులపట్ల గతంలో మతం, జాతి, జన్మస్థలం కారణంగా విచక్షణ చూపబడి నందున ఈ నిబంధనకు గిరిజనుల సంక్షేమం సదర్భంగా ప్రాధాన్యత కల్గుతుంది.

15 నిబంధనలోని 4వ క్లాజు ప్రకారం సామాజికంగా, విద్యా విషయకంగా వెనుకబడిన తరగతుల పౌరులకు లేక షెడ్యూల్ కులాలు, షెడ్యూల్ తెగల ప్రజల అభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేక ఏర్పాట్లు చేయవచ్చు.

29వ నిబంధన ప్రకారం భారతదేశంలో కాని దేశంలోని ఏదైనా ఒక ప్రాంతంలోని ప్రజలలో ఏవర్గమయినా ప్రత్యేక భాషా, లేక లిపి లేక సంస్కృతి కలిగివుంటే వాటిని పరిరక్షించుకొనే హక్కులను అవర్గం పౌరులు కలిగివుంటారు. ఈ నిబంధన అల్పసంఖ్యాక ప్రజల సాంస్కృతిక, విద్యాహక్కులను రక్షింస్తుంది. గిరిజనులు భారతదేశంలో ప్రధానమైన సాంస్కృతిక అల్పసంఖ్యాక వర్గంకాబట్టి, వారి విషయంఓ ఈ నిబంధన ప్రాధాన్యత కలిగివుంది.

2) 16, 16 (4), 320 (4) 335 నిబంధనలు ఉపాధివిషయంలో రక్షణలకు సంబంధించినవి.

3) 16వ నిబంధన ఉపాధి విషయంలో లేక ప్రభుత్వ అదీనంలోని ఏ ఉద్యోగానికైనా నియామకం విషయంలో పౌరులందరికి సమాన అవకాశాలను కల్పిస్తుంది. ఉపాధి విషయంలో లేక ప్రభుత్వ అధీనంలోని ఉద్యోగాల నియామకం విషయంలో ఏ పౌరునిపట్ల మతం, జాతి, కులం, లింగబేధం, వారసత్వం జన్మస్థలం, నివాసస్తలం కారణంగాగాని లేక వాటిలో దేని కారణంవల్ల గాని విచక్షణ చూపరాదని కూడా ఈ నిబంధన నిర్దేసిస్తుంది. గిరిజనులతో సహా పౌరులందరికి ప్రభుత్వ ఉద్యోగాలలో సమాన అవకాశాలు ఈ నిబంధన కలిగిస్తుంది.

16వ నిబంధన 4వ క్లాజు ప్రకారం ప్రభుత్వ సర్వీసుల్లో తగినంత ప్రాతినిధ్యంలేదని ఏ వెనకబడిన వర్గ పౌరులకైనా ప్రభుత్వం ఉద్యోగనియామకాల్లో రిజర్వేషన్స్ కల్పించవచ్చు? ఈ రక్షణ వర్తించే వెనుకబడిన తరగతుల ప్రజలలో షెడ్యూల్ కులాలు, తెగల ప్రజలు ముఖ్యస్థానం కలిగివున్నారు.

320 నిబందన 4వ క్లాజు ఇతర విషయాలతోపాటు షెడ్యూల్డు కులాలు, తెగలు ఉద్యోగ నియమకాల రక్షణల అమలు విషయంలో పబ్లిక్‌కేంద్ర సర్వీస్ కమిషన్‌నుగాని, రాష్ట్ర సర్వీస్ కమీషన్‌నుగాని సంప్రదించనవసరం లేదని తెలియ చేస్తుంది.

244వ నిబంధన ప్రకారం 5వ షెడ్యూల్‌లోని నియమాలు అస్సాం మినహా ఇతర రాష్ట్రాలలోని షెడ్యూల్డ్ ప్రాంతాలు, తెగల పరిపాలన అదుపుకు వర్తిస్తాయి. 6వ షెడ్యూల్డులోని నియమాలు అస్సాంలోని గిరిజన ప్రాంతాలు పరిపాలనకు వర్తిస్తాయి. షెడ్యూల్డు ప్రాంతాలు

కల్గిన రాష్ట్ర గవర్నర్ ఆ ప్రాంతాల పరిపాలనపై రాష్ట్రపతికి వార్షిక నివేదిక సమర్పించాలి. ఇటువంటి ప్రతి రాష్ట్రంలో గిరిజన సలహామండలి ఉంటుంది. రాష్ట్రపతి ఉత్తర్వుచేస్తే గిరిజన ప్రజలు మాత్రమే కలిగి షెడ్యూల్ ప్రాంతాలు లేని రాష్ట్రాలలో కూడా ఇటువంటి గిరిజన సలహా మండలాలను ఏర్పాటు చేస్తారు. పార్లమెంటు గాని రాష్ట్ర విధాన సభగాని చేసిన ఏచట్టాన్నయినా ఆ రాష్ట్రంలోని ఒక షెడ్యూల్డ్ ప్రాంతంలోగాని, దాని కొంత భాగంలో కాని, నిర్దేశించిన మార్పులు లేక మినహాయింపులతో వర్తింపచేయాలనిగాని, వర్తింపచేయకూడదని గాని ఆ రాష్ట్రగవర్నర్ బహిరంగ ప్రకటన ద్వారా నిర్దేశింపవచ్చు ఇటువంటి ఉత్తర్వును పూర్వకాలమునుండి అమలు చేయవచ్చును. ఒక షెడ్యూల్డు ప్రాంతంలో శాంతి పరిరక్షణకు, సమర్థపరిపాలనకు ఉద్దేశించిన గవర్నర్ నియమ నిబంధనలు జారిచేయవచ్చు. ఇటువంటి నియమ నిబంధనల ద్వారా

1) ఆ ప్రాంతంలో షెడ్యూల్డ్ తెగల ప్రజల భూములను బదలాయింపును నిషేధించడం, పరిమితం చేయడం జరుగవచ్చు.

2) ఆ ప్రాంతంలో షెడ్యూల్డ్ తెగల ప్రజలకు భూముల కేటాయింపు క్రమబద్ధం చేయవచ్చు.

3) ఆ ప్రాంతంలో షెడ్యూల్ తెగల ప్రజలకు రుణాలనిచ్చే వడ్డీ వ్యాపారస్తుల వ్యాపారాన్ని క్రమబద్ధం చేయవచ్చు.

ఈ నియమ నిబంధనలు చేసేసమయంలో ఆ ప్రాంతంలో అమలువున్నా ఏ శాసనాన్నయినా పార్లమెంటు లేక రాష్ట్ర విధాన సభ చేసిన చట్టాన్నయినా గవర్నర్ రద్దుచేయడం లేక సవరించడం చేయవచ్చు. ఇలాంటి నియమ నిబంధనలు రాష్ట్రపతి అనుమతి పొందిన తర్వాతనే అమలు జరుగుతాయి. ఈ నియమ నియమ నిబంధనలను చేసేముందు గవర్నర్ గిరిజన సలహామండలిని సంప్రదించాలి.

షెడ్యూల్డ్ ప్రాంతాల పరిపాలన

షెడ్యూల్డు ప్రాంతాలు ఏడు రాష్ట్రాలలో మాత్రమే ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్, బీహార్, గుజరాత్, మధ్యప్రదేశ్ మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, ఈ రాష్ట్రాల గవర్నర్లు షెడ్యూల్డ్ ప్రాంతాల పరిపాలనపై రాష్ట్రపతికి వార్షికనివేదికలు సమర్పిస్తారు. షెడ్యూల్డు ప్రాంతంకలిగిన జిల్లాల కలెక్టర్లు గవర్నరుకు ఏజంట్లుగా వ్యవహరిస్తారు. అందువల్లనే షెడ్యూల్డ్ ప్రాంతాలకు ఏజన్సీ ప్రాంతాలని పేరువచ్చింది జిల్లా కలెక్టర్ ఏజెంటు హోదాలో గవర్నరుకు వార్షిక నివేదిక సమర్పిస్తాడు. గవర్నరు రాష్ట్రంలోని అన్ని షెడ్యూల్డు లేక ఏజన్సీ ప్రాంతాల పరిపాలనను గురించిన వార్షిక నివేదికను రాష్ట్రపతికి నివేదిస్తాడు.

*

# కోయ నృత్య ప్రదర్శన విధానాలు

- డా॥ యం.ఓ. రాజ్‌మహ్మద్. M.A., PHD.

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన జాతుల్లో కోయజాతి ప్రముఖమైనది. వీరు తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్ జిల్లాల్లో కొండ కిందమైదాన ప్రాంతంలోనూ, మరికొన్ని చోట్ల దట్టమైన అటవి ప్రాంతాల్లోనూ నివసిస్తున్నారు. కోయలను తెలంగాణా ప్రాంతంలో "దొర్లోళ్ళు, దొరపట్టపోళ్ళు" అనిపిలుస్తున్నారు.

కోయలకు "కోయ" అనే ప్రత్యేకమై భాష ఉంది. తెలుగు భాషను కూడ మాట్లాడువారున్నారు. భాషనుబట్టిరెండు తరగతులుగా విభజింపవచ్చును. వీరిని ఆశ్రయించి బ్రతికే హక్కుదారులు, డోలి, పట్టడోళ్ళు.

కోయలు ఆనందాన్ని ప్రకటించడానికి ప్రధాన ప్రక్రియ నృత్యం, నృత్యమనేది కోయల జీవితంలోనే కాక, వారి అనుష్ఠానాల్లోనూ ఒక భాగం. వీరు సాధారణంగా

1) దేవతలను కొలిచినపుడు
2) ప్రకృతి పండుగను చేయునపుడు
3) వివాహాది శుభకార్యాలు జరిగినపుడు
4) పెద్దల పండుగ చేయునపుడు నృత్యం చేస్తారు.

**నృత్యం చేసే సమయం, సందర్భం :**

కోయ నృత్యానికి ప్రత్యేకమైన సమయం ఏమీలేదు. వివాహ సందర్భంగా వివాహ సమయాన్ని బట్టి, దేవతలను కొలచునపుడు పండుగలను చేయునపుడు సాయంకాలం, పెద్దల పండుగ చేయునపుడు రాత్రింబవళ్ళు మూడురోజుల నృత్యం చేస్తారు.

**కోయల నృత్య ప్రదర్శన - రెండు విధాలు**

1) ప్రకృతిలో భాగమైన దేవరలు భూమి దేవర, అఖాడి దేవర, కొండదేవర మొదలగు దేవరలను ఊరువారంతా ఒక్కటై సామూహికంగా కొలుస్తారు. మరియు ప్రకృతిని బట్టి విత్తనాలు వేయునపుడు ఇత్తుపండుగ, కొత్తగా వచ్చినపంట చిక్కుడు కాయ వస్తే, చిక్కుడుకాయ కొత్త పండుగ, కొత్తగా వచ్చిన పప్పులకు పప్పులపండుగ, ఆకులు కొత్తగా వస్తే పచ్చపండుగ, మామిడి కాయ కొత్తగా వచ్చిన మామిడికాయ కొత్తపండుగ, ఇలాంటివి ఏపంట కొత్తగా వచ్చిన ప్రతి పంటకు కొత్త పండుగ జేస్తారు. దేవతలను, పండుగలను గ్రామంలోని కోయతెగ వారంతా పూజారి ఆదేశంలో అందరూ ఒక చోట కొలుస్తారు. పండుగజేస్తారు. ఆ సంతోషంతో నృత్యం జేస్తారు.

పెండ్లి ఒక కుటుంబానికి సబంధించిందే అయినా గ్రామంలో కోయ తెగవారంతా, పగవారైనా పెండ్లికి రావలసిందే. ఆరోజు అందరూ ఒక చోట కలుస్తారు. అపుడు నృత్యం చేస్తారు. ఆ నృత్యంలో పెండ్లి చేసుకుంటున్న పెండ్లి కూతురు పెండ్లి జరుగుతుందనే బెంగలేకుండా పెండ్లి కొడుకుతో నృత్యంలో పాల్గొంటుంది.

అందరూ ఒక చోట కలిసిన సంతోషంతో ఎవరో ఒకరు పాట పాడుతూ ఉంటే అందరూ వలయాకారంగా ఒకరి నొకరు పట్టుకొని ముందుకూ వెనుకకూ అడుగులు వేస్తూ, వాయిద్యానికి పాటకు అనుగుణంగా నృత్యం చేస్తారు.

2) రెండవది పెద్దల పండుగ. ఒక కుటుంబానికి సంబంధించినది. ఆర్థిక స్థాయిని బట్టి ఒక కుటుంబం చేస్తుంది. లేదా కొన్ని కుటుంబాలు కలిసిగాని చేయవచ్చు.

ఈ పెద్దల పండుగ ఒక అనుష్టానం. డోలి అనే అర్థి (యాచకుడు) కి చాలా ప్రాధాన్యత ఉంటుంది. రాత్రింబవళ్ళు మూడు రోజులు ఈ పండుగ జేస్తారు. పెద్దల పండుగజేసేవారి ఇంటిముందు "డోలి" అతను డోలుకొడుతూ కోయలు మౌఖిక చరిత్ర పాడుతుంటాడు. ఇందులో గ్రామకోయలందరూ పాల్గొంటారు. డోలిమధ్యలో ఉండి డోలికొడుతూ పాట పాడుతుంటే కోయ లందరు ఒకరినొకరు పట్టుకొని స్త్రీ పురుష బేధం లేకుండా వయస్సుతో నిమిత్తం లేకుండా కోయల చరిత్రను వంతలు పాడుతూ వాయిద్యానికి పాటకు అనుగుణంగా పాదంకలుపుతారు.

నృత్యప్రదర్శనలో ఎంతమందైన పాల్గొనవచ్చు. సంఖ్యా నియమంలేదు. స్థలాన్ని బట్టి నృత్యం చేస్తారు.

కోయ నృత్యానికి ప్రత్యేకమైన పుస్తకాలు ఏమీలేవు. అంతా మౌఖిక సాహిత్యమే. తాత తండ్రులనుండి వారస్వంగా సంక్రమించినది. అయితే ఇప్పటి పరిస్థితులను, పరిసరాలను అవగాహన చేసుకొని పాటలను అట్లుకుంటారు.

ప్రత్యేకంగా పెద్దల పండుగలో కోయతెగ ఎలా పుట్టిందో పుట్టు పూర్వోత్తరాలను "డోలి" మౌఖిక చరిత్రను పాట రూపంలో పాడుతారు.

ఓ ...... జలారేలా రేరేలా రేలా
జల రేలా రేరేలా రేలా
అయిదుగూరు అన్నదమ్ములు నాయనో
అయిదుగురు అక్కచెల్లెలు బాబో ॥ రే॥
రేరేల రెలారెలా రేలా ॥ జల ॥
ఓ నాగులమ్మ తర్వాత నాయినా
సడలమ్మ పుట్టింది చొచో ....
సడలమ్మ తర్వాత నాయినా ...
సారలమ్మ పుట్టింది బోబా ...
సారలమ్మ తర్వాత నాయినా ...
పుట్టలమ్మ బుట్టిందీ బాబో ...
పుట్టలమ్మ తర్వాత నాయినా ...
సీడలమ్మ పుట్టిందీ బాబో ...
రేరేల రేలారేల రేల

జలరేల రేరేల రేల - ఇలా మౌఖిక చరిత్ర పాడుతూ 'డోలి' డోలు వాయిస్తూ నృత్యం చేస్తాడు.

కోయల నృత్యానికి రంగస్థలం లేదు. ప్రదర్శకులు ఎంతమందైనా స్థలాన్ని బట్టి ఉంటారు. ఎడమవైపువారిని ఎడమ చేయితో నడుమును, కుడివైపువారిని కుడిచేయిని భుజంపైనా వేసి పట్టుకొని, వాయిద్యానికి, పాటకు అనుగుణంగా ముందుకు వెనుకకూ అడుగులు వేస్తూ నృత్యం చేస్తారు.

**వాయిద్యాలు :-**

రెండు డోల్లు, కొన్ని ప్రాంతాల్లో మూగ, రెండు డోల్లు ఉన్నాయి.

డోలును మెడకు వేసుకొని ఎడమ చేయితో కొడుతూ, కుడివైపు కొయ్యలతో కొడుతారు.

**మూగ :-**

చాలా పెద్దది. డోలు వలెనే ఉంటుంది గాని మీటరున్నర పొడవు ఉంటుంది. ఒక కొయ్యకు తగిలించి రెండువైపుల ఇద్దరు రెండు చిర్రలతో కొడుతారు.

ఈ వాయిద్యాలను జింకతోలు, లేదా మేకతోలుతోగాని స్వయంగా తయారుచేసుకుంటారు.

**రంగస్థలం :-**

కోయ నృత్యానికి ప్రత్యేకంగా రంగస్థలం ఉండదు. దేవతలను కొలిచే చోటు దేవరముందు వివాహం జరిగినచోటు వాకిల్లో పెద్దల పండుగ చేసేవారి వాకిలి రంగస్థలం అలంకరణం లేదు. కేవలం నేల మాత్రమే రంగస్థలం.

**వేషాలు :-**

ఖమ్మంజిల్లాలో కూనవరం, వరరామచంద్రపురం చింతూర్ ప్రాంతల్లో రెండు దున్నపోతు కొమ్ముల మధ్య నెమలి ఈకలు కలుపుతూ ఒక బుట్టని తయారు జేస్తారు. అబుట్టను తలపై పెట్టి చుట్టూ పెద్ద రుమాలు చుడుతారు.

**పైమేళం :-**

పై మేళం ఉంటుంది. డోలి కోయల మౌఖిక చరిత్ర పాడుతూ ఉంటే రేరేల రేరేల రేల అంటూ పై మేళం అందుకుంటారు.

ఈ నేపథ్యంలో కోయ నృత్యం వల్ల నిత్య జీవితంలో ఆనందాన్ని పొందుతారు. నృత్యం అందరినీ ఒక చోట చేర్చి సమత, మమతను మానవతల్ని పంచి ఇచ్చేది. వారసత్వంగా సంక్రమించింది. తర తమ భేధం లేకుండా చేసేది నృత్యం ఐకమత్యానికి చక్కని ప్రేరణ, కాబట్టి కళాపోషకులు, (మహాను భావులు), స్వచ్ఛంధ సంస్థలు ముందుకు ఈ కళారూపాలు అందించక ముందే వారిని పోషించి కళను రక్షించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

*

# గిరిజనాభివృద్ధితో ముడిపడిన అటవీ విధానం

-దేబశీశ్ దేబ్‌నాథ్

గిరిజన సంస్కృతి, వారి ఆర్థిక వ్యవస్థలో అడవులుకీలక పాత్ర వహిస్తాయి. పుట్టుకనుండి మృత్యువు వరకూ గిరిజన జీవన విధానాన్ని అడవులే నిర్దేశిస్తూంటాయి. తిండి వసతి, కట్టుకునేందుకు బట్ట, గృహ నిర్మాణ సామాగ్రి, సాంస్కృతిక సాధనా సామాగ్రి ఇంకా ఆధ్యాత్మిక జీవితానందాలను వారికి అడవులే ప్రసాదిస్తాయి. 1967 హరిసింగ్ కమిటీ నివేదిక ప్రకారం దాదాపుగా అరవైశాతం గిరిజనులు అరణ్యాలలోను మిగిలిన నలభైశాతం అడవుల దరిదాపుల్లోను నివశిస్తుంటారు. అడవులను వీరు అడవితల్లిగా కొలుస్తుంటారు. గ్రామదేవతలను మేల్కొలిపే పవిత్ర నెరవుల భావనలో సాంప్రదాయ బద్ధమైన అటవీ సంరక్షణ విధానం స్పష్టంగా వెల్లడవుతుంది. గిరిజనుల తండాల పేర్లు కూడా అడవి జంతువులు, అరణ్యవృక్షాలతోనే ఎక్కువగా ముడిపడి వుంటాయి. వివాహ తంతులకు పూర్వం అనేకమంది పురాతన గిరిజనులు మామిడి చెట్టును పరిణయమాడే వారు. వారి మతపరమైన ఉత్సవాలలో అనేకరకాల ఆకులు, వేళ్ళు, దుంపలు కావలసివుంటాయి.

అరాణ్యాలతో వారికున్న అనుబంధాన్ని బట్టి భారతీయ గిరిజనులు వన్యజాతులు, వనవాసులు, వనపుత్రులుగా గుర్తింపు పొందారు. వారిని రెండు వర్గాలుగా విభజించవచ్చు.

1. ఎదుగు బొదుగు లేక క్షీణదశలో వుండడం, తక్కువ స్థాయి అక్షరాస్యత రేటు వంటి అంశాల ప్రాతిపదికన ఐదవ ప్రణాళికా కాలంలో సూచించిన ఆదివాసులు లేదా అది గిరిజన జాతులు (Primitive Tribal Groups - PTG) ఇటువంటి జాతులు దాదాపు 70 వరకూ వున్నాయి.

2. పోడు వ్యవసాయదారులు - ఉదాహరణకు భారత ఈశాన్య ప్రాంతం, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, బీహార్ మున్నగు ప్రాంతాల గిరిజనులు.

**శాస్త్రీయ అటవీ నిర్వహణ ప్రారంభం**

బ్రిటిష్ వారి రాకకు పూర్వం 18వ శతాబ్దాంతంలో అడవుల స్థితిగతులు కొంతవరకు బాగానే వున్నాయి. స్థానిక రాజులు జమీందారులు, చిన్న సంస్థానీకుల ఆధీనంలో అడవులున్నప్పుడు అక్కడి ప్రజల అవసరాలు సునాయాసంగానే తీరేవి కాని వాణిజ్య ప్రయోజనాలకోసం అడవుల నిర్వహణ అనే బ్రిటీషు విధానం అడవుల పై గిరిజనుల హక్కులను హరించి వేసింది ఇదంతా 1855 ఆగష్టు 3వ తేదీన అప్పటి గవర్నరు జనరల్ డల్‌హౌసీ చెట్లు నరకడం, దహనం చేసే పద్ధతులు, వ్యవసాయం (పోడు

వ్యవసాయం) ద్వారా అడవుల నాశనం చేయడం పట్ల తమ ఆందోళనను వెల్లడించే ప్రభుత్వ తాఖీదును జారీ చేయడంతో ప్రారంభమయింది. ప్రభుత్వానికి అధిక ఆదాయాన్ని చేకూర్చే టేకు చెట్ల పెంపకం, టేకు కలపను రాయల్‌నేవీలో ఓడల నిర్మాణం కోసం తరలించడంపై డల్‌హౌసీ ప్రత్యేక శ్రద్ధ కనబరిచాడు. అంతేకాదు టేకుచెట్లు రాష్ట్ర ఆస్థులుగా ప్రకటించి కలప వ్యాపారంపై కఠిన నియంత్రణలు వుండాలని సూచించాడు.

1865 అటవీ చట్టంలో అటవీ ఉత్పత్తుల వినియోగం వాటి నిర్వహణ, సంరక్షణలను చట్టబద్ధం చేవారు. మొట్ట మొదటిసారిగా అరణ్యవాసులు చేసే అటవీ ఉత్పత్తుల సేకరణ చట్టబద్ధంచేసే ప్రయత్నం చేశారు. 1894లో అమలులోకి వచ్చిన తొలి అలవీ విధానంలో రెండు ముఖ్యాంశాలు వున్నాయి. మొదటిది అటవీ సంరక్షణకన్న అటవీ ఉత్పత్తులకున్న డిమాండు బలవత్తరమైంది. రెండవది అటవీ నిర్వహణ ఏకైక లక్ష్యం. ప్రజా ప్రయోజనాలకోసం అటవీ ఉత్పత్తుల వినియోగం మొత్తం మీద అడవులను వ్యాపార ప్రయోజనాలకు మాత్రమే వినియోగించుకునేలా ఎన్నో చట్టాలు బ్రిటీషు వారి ఆధ్వర్యంలో రూపొందాయి. ఇందువలన భారతీయులకి ముఖ్యంగా అడవుల్లో నివసించేవారికి అటవీ ఉత్పత్తులపై హక్కు లేకుండా పోయి వారి తీవ్రమైన సమస్యల నెదుర్కొన్నారు. అత్యుత్తమ జాతీయ ప్రయోజనం పేరుతో వనవాసి, ఆదిమవాసులను నిర్వాసింతులను చేసేవరకూ వాణిజ్యసరళిలో అడవుల దోపిడీని ప్రోత్సహించారు. అటవీ భూములు, ఉత్పత్తులపై అరణ్యవాసుల హక్కులను నియంత్రించేందుకు ఇండియా అటవీ చట్టం ద్వారా 1927లో అటవీ శాఖను బలోపేతం చేశారు. అటవీ ప్రాంతాల్లోని విస్తృత సంఖ్యలో కాంట్రాక్టర్లు, వ్యాపారులు, గిరిజనేతర కార్మికులు ప్రవేశించేందుకు ఈ అటవీ విధానం వీలు కల్పించింది. అడవుల వ్యాపారీకరణ అడవుల విస్తీర్ణము క్రమేపీ తగ్గిపోవడం భూసారం కొట్టుకుపోవడం, దిగుబడి తగ్గడం వంటి ఇతర పరిణామాలకు దారితీసింది. ఇది గిరిజనులకు గిరిజనేతరులకు మధ్య నున్న సాంఘిక, ఆర్థిక అంతరాలను మరింత పెంచింది.

**విభజించి పాలించే విధానం**

గిరిజనులను సామాన్య ప్రజావీకం నుండి వేరుచేసి గిరిజన ప్రాంతాలను సాధారణ పరిపాలనా పరిధికి అవల వుంచేందుకు బ్రిటీషు ప్రభుత్వం ఆ ప్రాంతాల్లో విభజించి పాలించే విధానాన్ని అవలంభించింది. భారతదేశంలో బ్రిటిషు పాలన ఆదివాసులకు మేలు కంటే ఎక్కువగా కీడు చేసిందనవచ్చు. గిరిజనులను వేరుగా వుంచే బ్రిటీషు పాలకుల వైఖరి ఫలితంగా భూస్వాములు వడ్డీవ్యాపారులు, కాంట్రాక్టర్లు యథేచ్ఛగా గిరిజనులను దోచుకోవడం సాగించారు. ఏ చిన్న అటవీ సంపద మీద హక్కు లేనంతగా అటవీ సంరక్షణా కార్యక్రమం ఇలా గిరిజనుల హక్కులను హరించేందుకు దారి తీసింది.

బ్రిటీషు ప్రభుత్వానికి భూస్వాములు, ప్రయివేటు అడవుల యాజమాన్యం పై తగినంత నియంత్రణ లేకపోవడంతో గిరిజనులకు ఇతరులపై అవిశ్వాసం ప్రబలింది. 19వ శతాబ్దపు రెండవ అర్ధభాగంలో వివిధ గిరిజన ప్రాంతాలలో తలెత్తిన తిరుగుబాట్ల ఫలితంగా ప్రభుత్వం ఏజెన్సీ ప్రాంతాలలో నెలకొల్పింది ఉదాహరణకి భిల్లు, గంజాం, ఛోటానాగపూరు ఏజెన్సీల వంటివి వలస విధానం వల్ల మొత్తానికి గిరిజన సమాజాలు, ప్రధాన జనజీవన ప్రవంతి మధ్య దూరం తొలగిపోయింది.

బ్రిటిషు ప్రభుత్వం తమ ప్రయోజనాలు సిద్ధించేందుకు గిరిజనులను కొన్ని తెగలు ప్రత్యేక ప్రాంతాలుగా వేరుచేసే విధానాన్ని అవలంభించింది. 1874 చట్టం ద్వారా గిరిజన ప్రాంతాలను షెడ్యూల్డు జిల్లాలుగా గుర్తించింది. 1919 భారత ప్రభుత్వ చట్టం చేసినపుడు ఈ ప్రాంతాలను పునర్వ్యవస్థీకరించారు. భారత ప్రభుత్వ చట్టం 1935 సెక్షన్ 92లోని సబ్‌సెక్షన్ (I)లో ప్రత్యేకించి (Excluded) పాక్షికంగా ప్రత్యేకించిన ప్రాంతాలకు పరిపాలనా యంత్రాంగాన్ని ఏర్పరచడం మరో ముఖ్యమైన మైలురాయి. తత్ఫలితంగా గిరిజనులు అజ్ఞానం, దారిద్ర్యం, హీనపోషణ, వ్యాధులు, దోపిడీలతో బాధలనుభవిస్తూ వెనుకబడిన వారిగానే మిగిలిపోయారు. శాంతి భద్రతలు, ఆదాయ సేకరణే ప్రధాన ధ్యేయమైన వలస పాలకులు గిరిజన జాతుల అభివృద్ధికి ఎటువంటి కృషి చేయలేదు.

ఐరోపా సామ్రాజ్యవాదులు తాము కొత్తగా ఆక్రమించిన భూభాగాలను సుస్థిరం చేసుకోవడానికై ఎదురు తిరిగిన వేలాది మంది గిరిజనులను ఊచకోత కోయడానికి ప్రయత్నించారు. సేవా దృక్పథం పేరిట మారుమూల ప్రాంతాల్లో ఆసుపత్రులను పాఠశాలలను ప్రారంభించిన విదేశీ మిషనరీలు భారతదేశంలోని పేదవారిలోకెల్లా పేదవారైన గిరిజనులను క్రైస్తవ మతంలోనికి మార్చే ప్రయత్నాలు ముమ్మరం చేశారు.

స్వాతంత్ర్యం వచ్చాక మనదేశంలో గిరిజనుల సంక్షేమంపట్ల కలిగిన చైతన్యం స్వతంత్ర భారత రాజ్యాంగంలో పొందుపరచిన అంశాలలో ప్రతిఫలిస్తుంది. క్రమంగా జాతీయ జన జీవనస్రవంతిలో గిరిజనులను మిళితంచేసే విధానాన్ని రాజ్యాంగ నిర్మాతలు ఊహించారు. సాటి భారతీయ సోదరులతో వీరు కూడా సమైక్య జీవనం సాగించేందుకు భారతరాజ్యాంగం గిరిజన జాతులకు కొన్ని రక్షణలను, ఆ ప్రాంతాల్లో పరిపాలనారంగాన్ని అభివృద్ధిచేసేందుకు కొన్ని మార్గదర్శక సూత్రాలను అందించింది.

గిరిజన ప్రాంతాల్లో పరిపాలనా రంగస్థాయిని పెంచేందుకు గిరిజన సంక్షేమాన్ని ప్రోత్సహించే వివిధ పథకాలను అమలు చేసేందుకు వీలుగా రాష్ట్రాలకు ఆర్థిక సహాయాన్నందించే నిమిత్తం బారత రాజ్యాంగం పేర్కొనే అంశాలు 20 ఆర్టికల్స్ లోను ఐదవ, ఆరవ షెడ్యూళ్ళలో చూడవచ్చు.

స్వాతంత్ర్యానికి పూర్వ ఠక్కర్ బాబా వంటి కొందరు గాంధేయులు గిరిజనుల విద్యావ్యాప్తిపైన గిరిజన సహకార సంస్థల ద్వారా వారి ఆర్థికాభివృద్ధి పైన తమ దృష్టి కేంద్రీకరించారు. విద్య విషయానికొస్తే కనీస విద్య నీతిదాయకమైన విద్య గడిపేందుకు ఆదర్శప్రాయమైన ఆశ్రమ పాఠశాలలను వీరు ప్రారంభించారు. కాని స్వాతంత్ర్యం సిద్ధించాక ప్రభుత్వ ఆర్థిక సహాయంపై ఆధారపడవలసి రావడం చేత ఈ సంస్థలు ఆదర్శప్రాయంగా నిలువలేకపోయాయి.

స్వాతంత్ర్య సముపార్జనానంతరం చాలా మంది మానవ శాస్త్రవేత్తలు వివిధ సాంకేతిక, ఆర్థిక, సాస్కృతిక అభివృద్ధి స్థాయిల్లో గిరిజన సమస్యల అధ్యయనానికి పూనుకొన్నారు. ప్రొఫెసర్ ఎస్.కె.బోస్, డాక్టర్ ఎల్.పి.విద్యార్థి, డాక్టర్ పి.కె.భౌమిక్‌లు వీరిలో సుప్రసిద్ధులు.

**గిరిజనాభివృద్ధికి ప్రణాళిక**

స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజుల్లో భావ ప్రకటనా స్వాతంత్ర్యం, ఆస్తి ఆదాయాల సమాన పంపకం మానవశక్తి, సంపూర్ణ వినియోగం కనీస ధ్యేయాలుగా వుండేవి. గిరిజనాభివృద్ధికి సంబంధించి కొన్ని ప్రత్యేకాంశాలను పరిగణనలోనికి తీసుకున్నారు.

1) జాతీయ సమైక్యతా వలయంలో గిరిజనులకు ప్రాంతీయ సమాజానికి మధ్యగల అంతరాన్ని తొలగించడం.

2) సమిష్టిగా జాతీయ సవాళ్ళ నెదుర్కోవడానికి అవసరమైన జాతీయ వనరులు, సాస్కృతిక విధానాల పునాది పరిరక్షణ.

3) గిరిజనుల కనీసావసరాలను త్వరితగతిన తీర్చి అభివృద్ధి కృషిలో భాగస్వామ్యం కల్పించే చర్యల నారంభించడం.

క్లుప్తంగా చెప్పాలంటే గిరిజనాభివృద్ధి (1) దోపిడి నుంచి రక్షణ (2) వారి సంస్కృతీ సాంప్రదాయాల రక్షణ (3) వారి సామాజికాభివృద్ధికి ప్రోత్సాహాలపై ఆధారపడి ఉంది.

1952లో సామాజిక్భాభివృద్ధి కార్యక్రమంలో భాగంగా గిరిజనాభివృద్ధి కృషి ప్రారంభమైంది. కాని గిరిజన ప్రాంతాల విషయంలోనూ గిరిజనాభివృద్ధి ప్రత్యేక దృష్టి సారించడం అవసరమనేది వెల్లడవడంతో 1954లో ప్రత్యేక బహుళార్థ గిరిజనాభివృద్ధి (SMPT) పథకాలు ప్రవేశ పెట్టి ఈ ప్రయత్నాలను ముమ్మరం చేశారు.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో దేశంలో 66-67 శాతం కంటె ఎక్కువ సంఖ్యగల గిరిజనులున్న ప్రాంతాలలో దేశమంతటా SMPT బ్లాకులు ఏర్పడ్డాయి. వీటిలో విద్యాభివృద్ధి కమ్యూనికేషన్‌లు, వ్యవసాయం, పశుసంవర్ధన, వైద్యసదుపాయాలకు అధ్యధిక ప్రాధాన్యత ఇచ్చారు. డాక్టర్ వెరియల్ ఎల్విన్ తన సమీక్ష నివేదిక సమర్పించిన తరువాత తక్కువ విస్తీర్ణంలో (50 నుండి 200 చ.మై) తక్కువ జనాభా గల (25 వేలు) గిరిజన

ప్రాంతాలలో గిరిజనాభివృద్ధి కార్యకలాపాలు ముమ్మరం చేయడానికి అత్యధిక ప్రాధాన్యత నిచ్చారు.

నాల్గవ ప్రణాళికలో - వివిధ ప్రాంతాల్లోను, వివిధ జాతులు తెగల మధ్య పెరుగుతున్న విభేదాల నరికట్టేందుకు సన్నకారు రైతులు వ్యవసాయ కార్మికుల వంటి ప్రత్యేక వర్గాలకు కరువు పీడిత ప్రాంతాలవంటి ప్రత్యేక ప్రాంతాలలో ఎన్నో కార్యక్రమాలు చేపట్టారు.

ఐదవ ప్రణాళిక ఆరంభానికిముందు సమీక్షలో విద్యా విషయకంగా ఆర్థికపరంగా గిరిజన తెగలు మిగిలిన గిరిజనుల కంటె కొన్ని చాలా ముందంజ వేశాయని వెల్లడయింది. కొన్ని గిరిజన ప్రాంతాల్లో పరిశ్రమలు, గనుల త్రవ్వకం వంటి కార్యక్రమాలు అమలు చేయడం మిశ్రమ ఫలితాలనిచ్చింది. ఇతర ప్రాంతాల్లో అతి కొద్దిమంది మాత్రమే నాగలితో వ్యవసాయం చేసే సంస్కృతికి ఎదిగాయి. కొన్ని గిరిజన ప్రాంతాలలో లభించే అపార సంపద, అటవీ వనరులు బయటి వారినెందరినో ఆకర్షించడం ప్రారంభించాయి. మరికొన్ని ప్రాంతాలలో జనాభా పెరుగుదల ఒత్తిడి వలన కొన్ని గిరిజన తెగలు తాత్కాలికంగా గాని, శాశ్వతంగా గాని వేరేచోట్లకు వలస పోవలసి వచ్చింది.

**గిరిజన ఉప ప్రణాళిక**

ఆ విధంగా గిరిజన ప్రాంతాలన్నిటికి ఒకే విధమైన సమస్య పరిష్కారం సాధ్యంకాదని తేలింది. వనరులు, సామాజిక పరిస్థితులు మౌలిక సదుపాయాల అభివృద్ధి మొదలైన విషయాలలో ప్రతి గిరిజన ప్రాంతం ఒక్కొక్క ప్రత్యేకత కలిగి వుంది. ఇది రాష్ట్రాల, కేంద్ర ప్రణాళికల విస్తృత పరిధితో ఒక కొత్త గిరిజనుల ఉప ప్రణాళిక రూపకల్పనకు దారి తీసింది. గిరిజన జాతుల జీవన విధానాన్ని మెరుగుపరుస్తూనే గిరిజన ప్రాంతాలకు ఇతర ప్రాంతాలకు మధ్యగల అంతరాన్ని తగ్గించాలనేది గిరిజన ఉప ప్రణాళిక దీర్ఘకాలిక ఆశయం. దీనిలో గిరిజన సమస్యలను మూడు వర్గాలుగా విభజించారు.

(a) గిరిజన సాంద్రత ఎక్కువగా వున్న ప్రాంతాలలో అక్కడి గిరిజనుల సంఖ్య, వారి సమస్యలతో ఆ ప్రాంతపు అభివృద్ధి ముడిపెట్టవలసి వుంది.

(b) చెల్లాచెదురుగా గిరిజనులున్న చిన్నచిన్న ప్రాంతాల్లో అంటే సామాన్య ప్రజానీకంతో కలిసి గిరిజన తెగలు జీవిస్తున్న ప్రాంతాలలో ఆ తెగల అభివృద్ధికి సవరించిన ప్రత్యేక ప్రాంత విధానం అవలంబించాలి.

(c) సేద్యం నేర్వని ముందునాటి జీవన విధానాలతో కొని నిర్దిష్ట ప్రాంతాల్లో వుంటూ మనుగడే సమస్యగా వున్న అత్యల్ప సంఖ్యాకులైన గిరిజన తెగల విషయంలో గిరిజన సాంద్రతగల ప్రదేశాలలోను, బయటా వారిని ప్రత్యేక వర్గంగా భావించి వారి కోసం ప్రత్యేక బృందాల కుద్దేశించిన కార్యక్రమాలను రూపొందించాలి.

ఈ మూడు తరగతులను సమీకృత గిరిజనాభివృద్ధి ప్రణాళికలు (ITDP) సపరించిన ప్రాంతీయాభివృద్ధి పథకాలు, (MADA), Modified Area Development Approach పురాతన గిరిజన ప్రణాళిక క్రిందికి చేర్చారు.

**అభివృద్ధి, సమస్యా పరిష్కారాలనే జంటలక్ష్యాలు**

కొత్త గిరిజన ఉప ప్రణాళికా విధానం

1) అన్ని విధాలైన దోపిడీని తొలగించడానికి,

2) సాంఘిక, ఆర్థిక అభివృద్ధిని వేగవంతం చేయడానికి

3) గిరిజనుల్లో ఆత్మబలాన్ని పెంపొందించడానికి,

4) వారి సంస్థాగత వ్యవస్థలను మెరుగుపరచడానికి ఉద్దేసించినది.

**అటవీ విధానం × గిరిజన విధానం**

1952 నాటి జాతీయ అటవీవిధానం గిరిజనుల కేవోకొన్ని పరిమిత రాయితీల నిచ్చినప్పటికీ గిరిజనుల కెటువంటి ఓదార్పు కలిగించలేక పోయింది. తరతరాలనుండి వారసత్వంగా వస్తున్న అటవీ భూములపై హక్కులను పూర్తిగా వదులుకోవలసి రావడం అనేది గిరిజనులు అభిజాత్యాన్ని దెబ్బతీసింది. అటవీ అధికారులతో లాలూచీపడి గిరిజనేతరులు అడవులకు నష్టం కలిగిస్తే ఆ నేరాన్ని అధికారులు గిరిజనులపై మోపుతుండడంవల్ల అధికార్లు గిరిజనుల మధ్య సయోధ్య లేకపోయింది. తమపట్ల చూపించే నిరాదరణ, అన్యాయాలు వారిని తరచు ప్రభుత్వానికి హింసాత్మకంగా ఎదురు తిరిగేలా చేశాయి. అటవీ విధానం భారతదేశం లోని గిరిజనులను మిగిలిన ప్రజానీకంలో మిళితం కాకుండా చేసింది. గిరిజనేతరులు వారి దృష్టిలో దోపిడీదారులుగా మిగిలిపోయారు. 1976లో జాతీయ వ్యవసాయ కమీషన్ (NCA) కూడా అడవులను నాశనం చేస్తున్నారని గిరిజనులను నిందించడమే గాక అడవులపై ప్రజలకుండే హక్కులను భారీ ఎత్తున కుదించి వారికి ఉచితంగా అటవీ వనరుల పంపిణీని కూడా నిలుపు చేయాలని సిఫార్సు చేసింది.

స్వాతంత్ర్యానంతరం వారి విధానాలను రెండు పరస్పర విరుద్ధ ఆలోచనా ధోరణులు ప్రభావితం చేశాయి. వారిని మిగిలిన వారినుంచి వేరుచేసిన వలస ప్రభుత్వ విధానాన్ని నిరసిస్తూ వేగవంతమైన ఆధునీకరణ, త్వరితగతిన సాంస్కృతిక మార్పుల ద్వారా వారిని జాతీయ జనజీవన ప్రవంతిలో ఏకం చేయాలని A.V. టక్కర్, ఇతర గాంధేయవాదులు వాదించేవారు. గిరిజనులను అడవులనుండి వేరుచేసే అన్ని విధాలైన పద్ధతులను వ్యతిరేకించి వారిక్కూడా ప్రత్యేకంగా జాతీయవనాల విధానాన్ని తయారుచేసి వారు స్వేచ్ఛగా గిరిజన సంస్కృతిపై హిందూ సంస్కృతి ప్రభావం పడనంత దూరంగా జీవించాలని వెరియర్ ఎల్విన్

వంటి మానవ శాస్త్రజ్ఞులు వాదించారు.

**ఐదు దశాబ్దాలుగా దోపిడి**

స్వాతంత్ర్యానంతరం భారతదేశంలోని గిరిజన విధానం ముఖ్యంగా పరిరక్షణకే పరిమితమైనది తప్ప జాతీయ జీవనంలో గిరిజనులు కలిసిపోయేందుకు అనువైన అవకాశాలను కల్పించలేక పోయింది. గిరిజనాభ్యుదయం పేరుతో భారత ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాలు కోట్ల రూపాయలను వెచ్చించాయి. కాని విద్య, ఆర్థిక, వైద్యస్థాయిలు, సంపద, నైపుణ్యం మొదలైన కొలబద్దలతో పరిశీలిస్తే ఫలితాలు అంత ఆశాజనకంగా లేవు. పైపెచ్చు గత యాభైఏళ్ళుగా గిరిజనులలో దారిద్ర్యం, రుణభారం, హీనపోషణ, నిరక్షరాస్యత అధికమయ్యాయి. నిరంతర దోపిడీకి గురైన వారి సామాజిక, ఆర్థిక స్థాయి పడిపోయి స్వంత నెలవుల్లోనే పరవాళ్ళైపోయారు.

**సంయుక్త నిర్వహణ అభివృద్ధి**

ప్రముఖ మానవ శాస్త్రవేత్త ప్రొఫెసర్ రాయ్‌బర్మన్ 1982లో దేశీయ వ్యవహారాల శాఖకు సమర్పించిన నివేదికలో గిరిజన/ప్రాంతీయ/దేశీయ ఆర్థికాబివృద్ధికై అటవీ విధానాన్ని గిరిజన ఉప ప్రణాళికలను సమీకృతం చేయాలని సూచించారు.

గిరిజన సమాజాలు అడవీ నివాసులే కాదు శతాబ్దాలుగా వారనుసరిస్తున్న జీవన విధానం అటవీ భూభౌతిక స్థితి, అటవీ వనరుల చుట్టూ అల్లుకుపోయి మరోవంక మానవ-ప్రకృతి వైపరీత్యాల నుండి అడవులను సంరక్షిస్తున్నవి.

**1988 అటవీ విధానం**

అడవుల పరిరక్షణ, అబివృద్ధిలో ప్రజల భాగస్వామ్యం వుండాలన్న రాయ్ బర్మన్ కమిటి సూచనలు ఎన్నిటినో 1988 అటవీ విధానంలో పొందుపరిచారు. దీనినే పర్యావరణ జనాభా విధానమని కూడా అనవచ్చు. ఈ అటవీ విధానం స్పష్టమైన గిరిజన అనుకూల అంశాలను ప్రతిబింబిస్తుంది. గిరిజనులకు సంప్రదాయకంగా వున్న హక్కులు, రాయితీలకు పూర్తి రక్షణ వుంటుందనే హామీ నివ్వడమే గాక నిత్యావసరాలన పంట చెరకు, పశువుల దాణా, చిరు అటవీ ఉత్పత్తులు మొదలైనవి అటవి ఉత్పత్తులు ద్వారా లభిస్తాయని పేర్కొంది అడవుల రక్షణ పునరుత్పత్తి అభివృద్ధికోసం అడవులు, గిరిజనులనడుమ పూర్వపు సత్సంబంధాల పునరుద్ధరణ గురించి 4,6 సెక్షనులు పేర్కొంటున్నాయి.

పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ ఒక సర్క్యులర్ ద్వారా (నెం 6.21/89-FP) రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాల్లోని అటవీ కార్యదర్శులకు నాశనమవుతున్న అడవుల పునరుత్పత్తి కృషిలో గ్రామీణులు, స్వచ్ఛంద సంస్థలకు భాగస్వామ్యం కల్పించడానికి సంబంధించిన మార్గదర్శకసూత్రాలు ప్రకటించింది 1996 మే మాసానికల్లా 16 రాష్ట్రాలు

సంయుక్త అటవీ నిర్వహణ ఆ సంబంధమైన చర్యలు చేపట్టడం ప్రారంభించాయి.

**అటవీ పరిరక్షక బృందాలు**

దేశంలో దాదాపు 15వేల వరకు నియత, కొన్నివేల అనియత అటవీ పరిరక్షక బృందాలున్నాయని అంచనా ఈబృందాలు సమిష్టి అటవీ రక్షణ ప్రయత్నాలద్వారా కొన్ని అటవీ ప్రాంతాలను విజయవంతంగా పునరుద్ధరించడమే గాక ఆ అడవులలోను పరిసర ప్రాంతాల్లోను నివసించే గిరిజనుల మనుగడ జీవికకు సంబంధించిన అవసరాలను తీర్చగలిగాయి. శాస్త్రీయ అటవీ ఉత్పత్తుల విధానం నుంచి భాగస్వామ్య విధానానికి మారాక పలు రకాలుగా గిరిజనులు సముపార్జిస్తున్న ఆదాయం గ్రామీణార్థికాభివృద్ధికి తోడ్పడుతుంది.

వివిధ సమితులు ఏర్పడడంతో గ్రామీణులు తమ అత్యవసర ఆర్థిక ఇబ్బందులను పరిష్కరించే సామాజిక బ్యాంకింగ్ వైపు దృష్టి మరల్చారు. వ్యాపారస్తుల దోపిడీని తగ్గించేందుకు ఎన్నో అటవీ సంరక్షణా సంఘాలు సామాజిక మార్కెటింగ్ నిర్వహణా విధానాన్ని అవలంభించాయి. అటవీశాఖ ఈచర్య ద్వారా ఆదా అయిన సొమ్మును సామాజిక నిధికి బదిలీ చేసి కమ్యూనిటీ హాలు, డ్యాములు, వంతెనల నిర్మాణం వంటివి చేపట్టారు. ప్రస్తుతం చాలా అటవీ సంరక్షణా సంఘాలు పాఠశాలలు కూడా నడుపుతూ స్వయంగా ఖర్చులు భరించి ఉపాధ్యాయులను కూడా నియమిస్తున్నాయి. చాల గిరిజన ప్రాంతాల్లో తిరిగి సామాజిక అటవీ విధానం నెలకొన్నది అందువలన పరిశోధకులు కూడా వనరుల నిర్వహణలో స్థానికమైన మార్పు చేర్పుల పట్ల ఆసక్తి కనబరుస్తున్నాయి.

స్వాతంత్ర్యానంతరపు గిరిజన విధానం మానవ అభివృద్ధి కారణంగా దేశంలోని వివిధప్రాంతాల్లో వేలాది గిరిజనులు తమ గూళ్ళను విడిచి పర ప్రాంతాలకు వలసలు పోయారు. పరాయి ప్రాంతాల్లో స్థిరపడినపుడు సాంఘిక, ఆర్థికపరమైన ఎన్నో కొత్త సమస్యలు వారు ఎదుర్కోవలసి వచ్చింది. గిరిజనులలో కాస్త తెలివైనవారు పట్టణ ప్రాంతాల్లో స్థిరపడి ఉన్నతోద్యోగాలు చేస్తున్నారు. ఇది వారిలో వారికి విభేధాలు సృష్టించింది.

అసంఖ్యాకంగా వచ్చిన కర్మాగారాలు, భారీ పారిశ్రామిక యూనిట్ల పవర్‌స్టేషన్లు, నిర్మాణ కార్యక్రమాలు ఇతర భారతీయులకు వరప్రసాదాలు కాగా గిరిజనులలో మాత్రం కష్టాలు తెచ్చి పెట్టాయి. ప్రభుత్వం వారి సంక్షేమం కోసం ఎన్నో ప్రణాళికలు రూపొందించి అమలు చేస్తున్నా అవన్నీ గిరిజనులకు చేరడంలేదు.

*

# గిరిజనుల గీత మార్చిన హెమెన్‌డార్ఫ్

డా. కె.మోహనరావు M.A.,Ph.D

నైజాం సంస్థానంలో అప్పటి ఆదిలాబాద్ జిల్లా అత్యంత వెనుకబడిన ప్రాంతంగా గుర్తించబడి పరిపాలనా పరంగా నిరాదరణకు గురైంది. దీని ఫలితంగా సువిశాలమైన గిరిజన ప్రాంతాలు దిగువశ్రేణి గ్రామస్థాయి అధికారుల దోపిడిలో మగ్గాయి. అప్పటి ఆదిలాబాద్ జిల్లాను నైజాం ప్రభుత్వం "శిక్షా ప్రదేశం(కాలాపాని)గా పరిగణించి అక్రమాలు చేసిన అధికారులను శిక్షించడానికి అక్కడికి బదిలీ చేసేది. అటువంటి శిక్షపడిన ఆ అధికారులు కక్షకొద్దీ వారి అజమాయిషీలోని గిరిజనులను దిగువ అధికారుల దోపిడీకి వదిలి పట్టణాలలో తలదాచుకొనేవారు. దీని ఫలితంగా గిరిజనులు రెవిన్యూశాఖలోని గిరిదాపర్ల (రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లు) అటవీశాఖలోని చౌకీదార్లు (వాచ్‌మెన్) క్రూర అక్రమాలకు, దోపిడీకి గురై నిస్సహాయస్థితిలో ఉన్న గరిజనులను అప్పటి నైజాంప్రభుత్వం పట్టించుకోలేదు. పైగా ఇతర ప్రాంతాల నుండి ఇతర రాష్ట్రాల నుండి గిరిజనేతరులను ఈ ప్రాంతంలోని స్థానిక గిరిజనుల శ్రేయస్సుకు విరుద్ధంగ స్థిరపరిచారు. వీరు స్థానిక అధికారులతో కుమ్మక్కై ఉమ్మడిగా గిరిజనులను పీడించసాగారు. ఈ దుర్భర పరిస్థితులలో నిస్సహాయులైన గిరిజనులు 1940 సంవత్సరంలో కొమరం భీమ్ నాయకత్వంలో అప్పటి నిరంకుశ పరిపాలనపై తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటును నిజాం ప్రభుత్వం అణచివేసినప్పటికీ, ఈదాబిఘొర తిరుగుబాటు అప్పటి ప్రభుత్వ ఉన్నతాధికారుల దృష్టికి గిరిజనుల దీనావస్థను తీసుకొని రాగలిగింది.

నైజాం ప్రభుత్వం ఈ కల్లోలిత ప్రాంతంలో గిరిజనుల స్తితిగతులను అధ్యయనంచేసి వారిసమస్యలను తీర్చడానికి ఆస్ట్రియా దేశస్థుడైన "క్రిస్టోఫ్ వోన్ ఫురేర్ హెమెన్‌డార్ఫ్" అనే ప్రఖ్యాత మానవ శాస్త్రజ్ఞుడ్ని ముఖ్యసలహాదారుగానియమించింది. హెమన్‌డార్ఫ్ ఆస్ట్రియాలోని వియన్నా నగరంలోని ప్రముఖ సంపన్న కుటుంబంలో 1909 సంవత్సరంలో జన్మించి, మానవ శాస్త్రాన్ని అధ్యయనం చేయడానికి లండన్ మహానగరంలోని లండన్ స్కూల్ ఆఫ్ ఎకానామిక్స్‌లో ఉన్నత విద్యను అభ్యసించి భారతదేశంలోని ఈశాన్య ప్రాంతంలోని నాగాజాతిపై తన పరిశోధనా కార్యక్రమాన్ని ముగించుకొని ఇంగ్లండ్ వెళ్ళారు. ఆ సమయంలోనే బట్టి బెర్నాండ్ అనే ఇంగ్లీషు వనితను వివాహమాడారు. శ్రీమతి హెమెన్ డార్ఫ్ఆయన జీవిత భాగస్వామియేకాక ఆయన పరిశోధన కార్యక్రమాలలో స్వయంగా పాలుపంచుకొని ఆయనను అనేక విధాలుగా ప్రభావితంచేసి అన్ని విధాలుగా తన అండదండలు అందించిన వ్యక్తి. ఆమెతో కలిసి హెమన్ డార్ఫ్ ప్రపంచ మానవశాస్త్ర

సదస్సులో పాల్గొనడానికి డెన్మార్క్ వెళ్ళిన సందర్భంగా అప్పటి నిజాం ప్రభుత్వ రెవిన్యూ హోమ్ శాఖలను నిర్వహిస్తున్న సర్‌థియోడోర్ టాస్కర్ కాకతాళీయంగా ఆయనను కలిశాడు. హైమన్‌డార్ఫ్ దంపతులను అప్పటి నిజాం సంస్థానంలోని ఆదివాసుల గురించి అధ్యయనం చేయడానికి ఆహ్వానించారు. ఆ ఆహ్వానాన్ని పురస్కరించుకొని హెమెన్ డార్ఫ్ దంపతులు హైదారాబాద్ చేరుకోగానే రెండవ ప్రపంచ యుద్ధం ప్రకటన వెలువడింది. వారు జర్మనీ ఆక్రమణలోని ఆస్ట్రియా దేశస్థులు కావడంవల్ల వారిని నిర్బంధంలోకి తీసుకొన్నారు. ఆ తరువాత వారి పూచీపై నిజాం పరిపాలనలో ఉన్న గిరిజనులపై పరిశోధన చేయడానికి అనుమతించారు. దీని పర్యవసానం చెంచు, కొండరెడ్డి, గోండు జాతులపై సమగ్ర పరిశోధన గ్రంథాలు లభించాయి. సర్ థియోడార్ టాస్కర్ తదుపరి వచ్చిన గ్రిగ్సన్ కూడా హెమెన్ డార్ఫ్‌కు తన సహాయ సహకారాలను పూర్తిగాఅందించారు. తన పరిశోధన ద్వారా ప్రసిద్ధి కెక్కిన హైమన్‌డార్ఫ్ నిజాం ప్రభుత్వ గిరిజనుల వెనుకబడిన జాతులకు సంబంధించిన సలహాదారునిగా నియమితులయ్యారు. తత్ఫలితంగా హెమెన్‌డార్ఫ్ బాబీఘోరి సంఘటనను అధ్యయనం చేసి, దానికి దారితీసిన కారణాలను, అసమస్యలకు పరిష్కారాలను సూచిస్తూ సమగ్ర నివేదిక ఇచ్చారు.

తన నివేదికలో గిరిజనుల సమస్యల సమగ్రంగా గుర్తించి వాటికి పరిష్కారాలను సూచించడంలో తన ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించారు. అప్పటి నిజాం ప్రభుత్వం హెమెన్ డార్ఫ్ సలహా మేరకు గిరిజనుల అభివృద్ధికి అనేక కార్యక్రమాలను చేపట్టింది. తత్ఫలితంగా సమీకృత గిరిజనాభివృద్ధికి ప్రణాళికలను 1945వ సంవత్సరంలోనే హెమెన్‌డార్ఫ్ తయారు చేయించి ప్రజ్ఞాపాటవాలను రుజువు చేసుకొన్నారు గిరిజనుల అభివృద్ధికి వ్యవసాయంపై ఆధారపడే గోండు కులాలు నాయక్‌పోడ్లు ప్రవాసజాతుల సమస్యలను భూమి పంపిణీ తగిన పరిష్కారంగా గుర్తించి ప్రత్యేక భూమి పంపిణీ కార్యక్రమాన్ని రూపొందించారు. ఈ భూమి పంపిణీ కార్యక్రమం కింద ఒక లక్షా అరవై వేల ఎకరాలను సాగు యోగ్యమైన భూమిని గిరిజనులకు పంపిణీచేయించారు. అంతేకాక గిరిజనుల ఆక్రమణలో ఉన్న ప్రభుత్వ భూములకు పట్టాలు ఇప్పించారు. ఈ పథకం క్రింద సుమారు 80 శాతం గిరిజనులకు ఒక్క ఆదిలాబాద్ జిల్లాలో ఒక్కొక్క కుటుంబానికి స్వయం సమృద్ధి కలిగిన 15 ఎకరాల కమతం లభించింది. ఇంతేకాక గిరిజన రైతుకు మెరుగైన వ్యవసాయ పద్ధతులను లాభదాయకమైన పంటలను మెరుగైన విత్తనాలను ఉపయోగించడంలో శిక్షణకూడా ఇచ్చారు. గిరిజన రైతులకు కావలసిన రుణాలను సమకూర్చడానికి సహకార సంస్థలను రూపొందించటమేకాక వారిలో సొదుపు అలవాట్లు పెంపొందించి ధాన్యపు చోళాలను (గ్రేయిన్ బ్యాంక్స్) స్థాపించి వడ్డీ వ్యాపారస్తుల బారినుండి వారిని కాపాడారు. గిరిజనుల చైతన్యానికి అభివృద్ధికి అత్యంత అవసరమైన విద్యాప్రణాళిక పునాదులు కూడా రూపొందించటం జరిగింది. గిరిజనుల మాతృభాషలో బోధన చేయడానికి మొదటిసారిగా

ప్రయత్నం జరిగింది ఇందుకోసం తగిన ప్రత్యేక ఉపాధ్యాయ శిక్షణ కేంద్రాలను అదిలాబాద్ జిల్లాలోని మార్గవాయి, గిన్నెధరి గ్రామాలలో స్థాపించారు. మార్గవాయిలోని ఉపాధ్యాయ శిక్షణ కేంద్రంలో దేవనాగరి లిపిలో గోండు భాషలో చదువు చెప్పడానికి గిన్నెధరి లోని కేంద్రంలో తెలుగులిపిలో గోండు భాషలో బోధించడానికి ఉపాధ్యాయులకు తగిన శిక్షణనిచ్చారు.

అదే విధంగా కోయ విద్యాపథకం రూపొందించి ఖమ్మం జిల్లాలోని సుడిమళ్ళ గ్రామంలో కోయ ఉపాధ్యా శిక్షణ కేంద్రం స్థాపించారు. ఈ కార్యక్రమాలు ఒక్క ఆదిలాబాద్ జిల్లాకు మాత్రమే పరిమితం కాలేదు. ప్రతి గిరిజన జాతి సంక్షేమానికి ప్రత్యేక పథకం రూపొందించి అమలు చేశారు. ముఖ్యంగా వాటిలో చెప్పుకోతగ్గది అమ్రాబాద్ గ్రామీణ సంక్షేమ పథకం (ది అమ్రాబాద్ వెల్ఫేరు స్కీమ్) 1942 ఈ పథకం చెంచువారి అభివృద్ధికోసం అమలు చేశారు. అదే విధంగా సుగాలీ జాతివారి కోసం లంబాడా సంక్షేమ పథకం, కోయజాతి వారి కోసం కోయక్షేమ పథకం రూపొందించి అమలుపరచారు. ఇందులో భాగంగా గోదావరి లోయ సహకార గ్రామీణ అభివృద్ధి సంఘాన్ని ఖమ్మం జిల్లాలోని కోయగూడెంలో స్థాపించారు. దీని ద్వారా కోయ కొండరెడ్ల ఆర్థికాభివృద్ధికి తోడ్పడ్డారు. అప్పటి నిజాం సంస్థానంలోని గిరిజనులు ముఖ్యంగా ఆదిలాబాద్ జిల్లాలోని గోండ్లు కొలముల నాయక్‌పోడ్‌లు మొదలైన జాతుల సమగ్రాభివృద్ధి కార్యక్రమాలను యుద్ధ ప్రాతిపదికన అమలుచేసి అప్పటివరకు నిరాదరణలో ఉన్న గిరిజనులకు నూతనోత్తేజాన్ని ప్రసాదించటమేగాక వారి జీవన స్థాయిని మెరుగు పరచి వారికి కొత్తవెలుగును ఉత్సాహాన్ని ప్రసాదించిన ఘనత ఈ మహనీయునికే చెందుతుంది. హెమెన్‌డార్ఫ్ గిరిజనుల సమస్యలను ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలద్వారా పూర్తిగా నివారించలేమని గుర్తించి అప్పటి బ్రిటిష్ పాలనలోవున్న మద్రాసు రాష్ట్రంలో అమలు జరుగుతున్న చట్టాలను అధ్యయనంచేసి నిజాంరాష్ట్రంలో గిరిజనుల హక్కుల రక్షణ కోసం కొన్ని మార్పులు చేసి గిరిజన ప్రాంతాలకు ప్రత్యేక చట్టం చేశారు. 1936వ సంవత్సరంలో ది హైదరాబాద్ ట్రైబల్ ఏరియాస్ దస్తూర్‌ఫూల్ అమాల్ 1356 ఎఫ్ చట్టాన్ని రూపొందించి నిజాం ప్రభుత్వం ద్వారా అమలు చేయించారు. 1949వ సవత్సరంలో ఈ చట్టాన్ని సవరిస్తూ ట్రైబల్ ఏరియాస్ రెగ్యులేషన్ (ట్రైబల్ ఏరియాస్ రిజస్ట్రేషన్) 1359 ఎఫ్ అమలు జరిపారు. ఈ చట్టం ద్వారా గిరిజనుల హక్కులను ముఖ్యంగా వారి సాగు భూములను, ఇళ్ళను, ఇళ్ళస్థలాలను గిరిజనేతరుల బారినుండి పరిరక్షించి వారికి ఉన్న ఇతర హక్కులను కాపాడి, వడ్డీ వ్యాపారం స్వైర విహారాన్ని తద్వారా గిరిజనుల ఆర్థికవ్యవస్థకు కలిగే నష్టాన్ని అరికట్టడానికి చట్టపరమైన గట్టి ఏర్పాటు జరిగింది. ప్రప్రథమంగా రెవిన్యూ అధికారుల, అటవీశాఖ అధికారుల అధికారాలను గిరిజన ప్రాంతాలలో సాంఘిక సేవాశాఖ (సోషల్ సర్వీసెస్ డిపార్ట్‌మెంట్) అధికారులకు అప్పగించారు. తత్ఫలితంగా గిరిజనులు అప్పటి వరకు గ్రామస్థాయి

రెవిన్యూ అధికారులు అటవీశాఖ అధికారులు పెట్టే కష్టాలనుండి విముక్తి పొందారు. ఈ విప్లవాత్మకమైన ఏర్పాటు ఇప్పటివరకు మరి ఎక్కడాలేదు. గిరిజనుల సమగ్రార్థికాభివృద్ధి, విద్యాభివృద్ధి గిరిజన ప్రాంతంలోని ఈ ప్రత్యేక చట్టంలోని అంశాలు అమలు జరపడానికి ప్రత్యేకించి ఒక శాఖను స్థాపించారు. అదే సాంఘిక సేవాశాఖ (సోషల్ సర్వీసెస్ డిపార్ట్‌మెంట్) ఈ శాఖను నిర్వహించడానికి ప్రతిభావంతులు, పరిపాలనా దక్షులు, గిరిజనులమీద సానుభూతి కలిగినవారిని మాత్రమే ఎన్నుకొని వారి ద్వారా ఈ కార్యక్రమాలను అమలు జరిపి హెమెన్ డార్ఫ్ ఆశించిన ఫలితాలకు ఆయన ఉద్యోగ కాలంలోనే స్థాపించారు. ఒక సందర్భంలో తాను అదిలాబాద్‌లో గోండులతో గడిపిన రోజులను గుర్తుచేసుకొంటూ తన జీవితంలో మరెక్కడా అంతసంతోషకరమైన, సంతృప్తికరమైన అనుభూతిని పొందలేదని హెమెన్‌డార్ఫ్ మహాశయుడన్నారు.

గిరిజనులమీద ముఖ్యంగా గోండ్లు మీద ఆయనకు అపారమైన ప్రేమాభిమానాలుండేవి. అనేక కష్టనష్టాలను భరిస్తూ తన ఆరోగ్యాన్ని, క్రూరమృగాలను, ఇతర అసౌకర్యాలను సైతం లెక్క చెయ్యకుండా స్థానికంగా లభించే గిరిజన ఆహార పదార్థాలు, దుంపలు, అడవిపండ్లు ఆకుకూరలు తింటూ గిరిజనుల సమస్యలను ప్రప్రథమంగా అధ్యనం చేసిన ఘనత ఆయనకు దక్కుతుంది. 1976వ సంవత్సరంలో ప్రారంభమైన ఆయన పరిశోధన కార్యక్రమం ఆయన అవసాన దశవరకు నిర్విఘ్నంగా సాగింది. ఆయన అకుంఠిత అర్ధశతాబ్ద పరిశోధన ఫలితంగా 19 గ్రంధాలు అనేక పరిశోధన వ్యాసాలు వెలువడ్డాయి. హెమెన్ డార్ఫ్ భార్య ఎక్కువ కాలం ఆంధ్రప్రదేశ్ గిరిజనుల సమస్యలను అధ్యయనం చేయడానికి వినియోగించారు. వారికి ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజనుల మీద అపారమైన ప్రేమ, వాత్సల్యం, వారి సమస్యల గురిచి తన ఆవేదనను వ్యక్తంచేసేవారు. వారికి గోండ్లు అత్యంత ప్రీతిపాత్రులు . తన ఏకైక కుమారుడు అదిలాబాద్ జిల్లా ఉట్నూరు తాలూకాలో మార్లవాయి గ్రామంలో జన్మించాడు.

శ్రీమతి హెమెన్‌డార్ఫ్ 1987 సంవత్సరంలో హైదరాబాద్‌లో ఆకస్మిక మరణం తరువాత ఆమె ఆఖరి కోరిక మేరకు అదిలాబాద్ జిల్లాలోని మార్లవాయి గ్రామంలో ఆమెకుసంస్కారం జరిగింది. ఆ కార్యక్రమంలో పాల్గొన్న హెమెన్ డార్ఫ్ తననుకూడా మార్లవాయి గ్రామంలో దహనం చేయవలసిందిగా తన కోరికను వెల్లడించారు. కానీ ఆయన అభీష్టం నెరవేరలేదు కానీ ఆయన ఆదిలాబాద్ గిరిజనుల ముఖ్యంగా గోండ్ల హృదయాలోల శాశ్వతంగా ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్నారు. కొందరికి ఆయన ఇలవేల్పు. అయితే మరికొందరికి గౌరవనీయుడు; అందరికీ ఆయన చిరస్మరణీయుడు.

*

# ఆంధ్రప్రదేశ్‌లోని చెంచులు

- భూక్యా చిన వెంకటేశ్వర్లు

ఆంధ్రప్రదేశ్‌లో నివసించే షెడ్యూల్ జాతులకు చెందిన చెంచులను మూడు భాగాలుగా విభజించవచ్చు. 1) తెలంగాణా జిల్లాల్లో ప్రత్యేకంగా మహబూబ్ నగర్‌జిల్లాలోను మరియు కృష్ణానదికి ఎడమవైపుగావున్న అమరాబాదు అడవులు దాని పరిసర ప్రాంతాల్లోను 2) కృష్ణా, గుంటూరు జిల్లాలో కృష్ణానదికి కుడిప్రక్కనున్న నల్లమల అడవుల్లోనూ 3) సర్కార్ జిల్లాలోని పట్టణాల్లోనూ, విశాఖపట్టణంలోని సింహాచలం (నరసింహస్వామి దేవాలయం) చుట్టుప్రక్కల ప్రాంతాల్లో నివసించే గిరిజనులే చెంచులు.

గిరిజనులైన చెంచులు వివిధ ప్రాంతాలలో వుండటంచేత మాట్లాడే భాషలో తేడా స్పష్టంగా కన్పడుతుంది. కోస్తా జిల్లాల్లో నివసించే చెంచులు ఒరియా భాష మాట్లాడుతుంటే, తెలంగాణా లోని చెంచులు ఉర్దూ, తెలుగు కూడా మాట్లాడుతారు. నల్లమల అడవుల్లోని గుంటూరు కర్నూలు జిల్లాలోని చెంచులు తెలుగు భాషనే మాట్లాడుతారు. అయితే వీరు వివిధ ప్రాంతాలలో నివసిస్తున్నప్పటికి మాట్లాడే భాషలో తేడాలున్నప్పటికీ ఏకతా భావమైన ఆరాధన భావం ఒక్కటే. వీరంతా ఆరాధించే ఆరాధ్య దైవం శ్రీ నరసింహస్వామి మరియు చెంచులక్ష్మి. రాష్ట్రం మొత్తంమీదా సుమారు 40 వేల మంది చెంచులున్నారు. చాలామంది చెంచులు సంచారులు (నామాందులు), కాగా వీరిలో కొంత బిలముకొండ చెంచులని, కృష్ణ చెంచులని, దేవ చెంచులని ఊర చెంచులని పిలుస్తారు.

చెంచుల గురించి ఒక కథకూడా ప్రచారంలో వుంది నేటి గుంటూరుజిల్లాలోని, "అమరావతిరాజ్యాన్ని" శ్రీ రాజావెంకటాద్రి నాయుడు పాలిస్తూవుండేవారు. ఆయన తన బంధువులను చింతపల్లికి పంపాడని. మార్గం మధ్యనున్న నట్టడవిలో కొంతమంది చెంచులు వారిని దోచుకున్నారు. అందుకు కోపించిన శ్రీ నాయుడు, చెంచులను తుదముట్టించడానికి నిర్ణయించుకొని నరకుళ్లపాడు గ్రామంలోని ఒక భవనంలో విందు ఏర్పాటుచేసి చెంచుల నందరిని ఆహ్వానించారు. ఆ భవనానికి ఒకవైపు మాత్రమే ద్వారాన్ని తెరచివుంచి, అన్నివైపుల ద్వారాలు మూసి వేశారు. లోపలకు ప్రవేశించిన చెంచులు ప్రాణాలు కోల్పోవటమే గాని, తిరిగివచ్చే ప్రసక్తిలేకుండా కట్టుదిట్టం చేశాడు. కొంత సేపటి తర్వాత భవనం లోపల ఏం జరుగబోతుందో తెల్పుకొన్న చెంచులు అక్కడనుంచి శ్రీహరికోట ద్వీపం మీదుగా, చిత్తూరు జిల్లాలోని సదాశివకోనకు, కొంతమంది జయపూరు

అడవులలోకి పారిపోయారని, శ్రీహరికోట ప్రాంతంలోకి వెళ్ళిన వారే యానాదులు లేదా చెంచులని ఈ కథ తెలుపుతుంది.

**1. తెలంగాణా జిల్లాలోని అమరాబాద్ అడవుల్లోని చెంచులు :**

వరంగల్ జిల్లాలోని రామప్ప చెరువు దగ్గరలోను, కృష్ణానది ఎడమకాలువ దగ్గరలోవున్న అమరాబాదు అడవుల్లోనూ చాలా మంది చెంచులు మనకు కనబడతారు. వీరు సుమారు 15,000 ల మందిదాకా వుంటారు. మత, సాంస్కృతిక వ్యవహారాలలో వీరి మధ్య ఏ విధమైన తేడాలులేవు. అయితే ఇంటిపేర్లలో మాత్రం తేడా స్పష్టంగా కనబడుతుంది. "దాసరి" "ఉండి" "అవుల" వంటి ఇంటిపేర్లను ఉదాహరణగా పేర్కొనవచ్చు. కాగా వీరి మధ్య వచ్చే చిన్న చిన్న వివాదాలను కులపెద్దల సహాయంతో పరిష్కరించుకుంటారు.

**2. కర్నూలు, గుంటూరు జిల్లాలలో, నల్లమల అడవుల్లోని చెంచులు :**

ఈ ప్రాంతంలో నివసించే చెంచులలో సాంఘిక, మత, సాంస్కృతిక జీవన విధానం అన్నిప్రాంతాల్లోని చెంచుల మాదిరిగానే వుంటుంది. అయితే ఇక్కడి చెంచులు ఇంటిపేర్లను "పిట్ట" "పులి" "ఈగ" వంటి పక్షుల, జంతువుల పేర్లు పెట్టుకొంటారు. అన్ని ప్రాంతాల్లోని చెంచుల లాగానే వీరు శ్రీ నరసింహస్వామి చెంచులక్ష్మిని ఆరాధించుటయేగాక శివుడ్ని కూడా ఆరాధిస్తారు. వీరి మధ్య వచ్చు చిన్న చిన్న వివాదాల్ని, కుల పెద్దల సాయంతో పరిష్కరించు కొనేవారు. చాలాకాలం క్రింద అడవులగుండా శ్రీశైలం దేవాలయానికి వెళ్ళే యాత్రికులకు చెంచులు ఉపయోగపడేవారు. కొంతమంది శ్రీశైలం దేవస్థానమునకు కావలాదార్లుగా వుండేవారు. కొంతమంది చెంచులు సంచారులయ్యారు. గుంటూరు, కృష్ణా, కర్నూలు జిల్లాల్లో నివసించే వీరికి కృష్ణ చెంచులని, బిలమకొండ చెంచులని పిలుస్తున్నారు. ప్రతియేటా గుంటూరు జిల్లాలోని కోటప్పకొండ వద్దనున్న అరవపల్లిలో చెంచులంతా సమైక్యమై కులపెద్దల సాయంతో వివాహ సంబంధాలు కుదుర్చుకోవడం, చేసుకోవడం, వివాదాలు పరిష్కరించు కోవటం చేస్తూవుంటారు.

**3. సర్కార్ జిల్లాలలోని జయపూర్ అడవుల్లోని చెంచులు :**

సర్కార్ జిల్లాలోని పట్టణాలలో మనకు చాలా మంది చెంచులు కనబడతారు. వీరు సుమారు 5,000 మందిదాకా వుంటారు. విశాఖపట్నం సిహాచలంలో ప్రసిద్ధి కెక్కిన శ్రీ నరసింహస్వామి పేరుతో "సింహాద్రి" అని వీరి ఇంటిపేరు వుంటుంది. వీరు నరసింహస్వామిని, మరియు చెంచులక్ష్మిని ఆరాధిస్తారు. వీరు వెదురుతో అనేక వస్తువుల్ని, బొమ్మల్ని చేసి అమ్ముతూ, జీవనాన్ని సాగిస్తూ వుంటారు. వీరు సంచార జీవులు.

సంవత్సరంలో సగం పైగా కాలాన్ని చుట్టుప్రక్కల జిల్లాలన్నీ సంచరిస్తూ వుంటారు. ఆ తరువాత గుంటూరు జిల్లాలోని సాతులూరులో అందరూ కల్సుకొని, అక్కడే కుల పెద్దల సాయంతో వివాహ సంబంధాల్ని కుదుర్చుకోవటం వివాహాల్ని జరుపుకోవటం చేస్తారు. అయితే వీరు ఇతరజాతుల వారితో విందు ఆరగించటానికి మాత్రం అంగీకరించరు.

**చెంచులలో విద్య :**

విద్యా విధానంలో వీరు వెనుకబడివున్నారు. పూర్తిగా నిరక్షరాస్యులనే చెప్పవచ్చు. వీరిలో ఎవరో ఒకరు హైస్కూల్ దాకా చదువుకుంటే, కొంతమంది పిల్లలు గిరిజన సంక్షేమశాఖ నెలకొల్పిన ఎలిమెంటరీ స్కూళ్ళలో ప్రాథమిక విద్యతోనే మానేస్తున్నారు. వీరిలో చాలామంది పిల్లలు అటవీ బాల కార్మికులుగా వున్నారు. తర్వాత కొన్ని స్వచ్ఛంద సేవా సంస్థలు మాచవరం, మన్నూర్, జంగారెడ్డిపల్లి, గుంటూరులోను పాఠశాలలను, హాస్టల్స్‌ను, ఆశ్రమ పాఠశాలల్ని నెలకొల్పారు. అయితే అభ్యున్నతిని పెంచేందుకు చాలినంత పాఠశాలలు సౌకర్యాల, హాస్టళ్ళు విస్తృతంగా యుద్ధ ప్రాతిపదికపై ఏర్పాటు చెయ్యాలి. నుగాలి, యానాది, ఎరుకల, మొదలైన గిరిజన కులములతోపాటు చెంచులకుకూడా విద్యాసౌకర్యాన్ని ప్రభుత్వం కల్పించాలి.

ఏమైనప్పటికి ప్రభుత్వం చెంచుల అభ్యున్నతికై, వారి జీవన గతిని ప్రగతిపథంలో ముందుకు సాగేందుకు మరికొన్ని పథకాల్ని, సదుపాయాల్ని కల్పించాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

*

# గిరిజనాభివృద్ధి కార్యక్రమాల అమలులో క్రొత్తపంథాలు

డా॥ వి.ఎస్.వి.కె. శాస్త్రి

మనదేశానికి స్వాతంత్ర్యము వచ్చిన దగ్గరనుండి వెనుకబడిన ప్రాంతాల జాతుల అభివృద్ధికి కృషి మొదలైంది. మనరాజ్యాంగం అమలులోకి వచ్చిన దగ్గరనుండి, అనుసూచిత తెగల అభివృద్ధికై కృషి మొదలైంది. అంతకు ముందు బ్రిటీష్, నిజామ్ పాలనలో "చూసిచూడని" విధానం అమలులో ఉండేది. ఇప్పుడు రాజ్యాంగ పరంగా అనుసూచిత తెగలు అనిపిలువబడేవారు. ఆదిమవాసులు, గిరిజనులు అనే వివిధమైన పేర్లతో పిలువబడుతూండేవారు. అయితే యీ పేర్లు ఇప్పటికి వాడుకలోనే ఉన్నాయి. అందుకే యీ వ్యాసంలో గిరిజనులు అనే మాట చాలా చోట్ల దొర్లుతుంది. వీరు నివశించే ప్రాంతాలు అనుసూచిత ప్రాంతాలుగా బ్రిటీష్ ప్రభుత్వం పేర్కొని, ఆ నిర్దేశిత ప్రాంతాల పాలనకు జిల్లాకలెక్టరుకు "ఏజెంటు" (ప్రతినిధి) గా నియమించింది. అందుకే యీ ప్రాంతాలను ఏజెన్సీ ప్రాంతాలుగా పిలవటం జరిగింది. ఇప్పటికీ యీ పేరు వాడుకలో ఉన్నా, రాజ్యాంగపరంగా వీటిని అనుసూచిత ప్రాంతాలు (షెడ్యూల్డు ప్రాంతాలలో, గిరిజనుల ప్రాంతాలు)గా పరిగణిస్తారు. బ్రిటీష్ పాలనలో మాత్రం యీ ప్రాంతాలలో గిరిజనుల అసంతృప్తి చల్లపరిచే విధానం తప్ప, అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడంలేదు. అయితే, నైజాము ప్రాంతం గిరిజన ప్రాంతాలలో మాత్రం 1940లో జరిగిన భాబిజురి ఉద్యమం తరువాత కొన్ని అభివృద్ధి పథకాలు చేపట్టడం జరిగింది. ఆదివాసి సేవక్ సంఘం. శ్రామిక ధర్మ రాజ్య సభ మొదలైన స్వచ్ఛంధ సంస్థలు విద్యా కార్యక్రమాలు చేపట్టాయి. మొత్తంమీద, ఒక ప్రణాళిక రూపంలో రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాతే జరిగిందని చెప్పవచ్చు.

బ్రిటీష్/నైజామ్ పాలనలో మరొక విశేషం ఏమంటే, గిరిజన జాతుల పట్టిక తయారు చేయటంలో ప్రత్యేక శ్రద్ధ చూపించినట్లు మనకు కనిపించదు. గిరిజనులు, వారి జీవన విధానం మీద అవగాహన లేకపోవటం వల్ల గిరిజనులపై గౌరవం చూపించలేక పోయారని అనిపిస్తుంది. అసలు వాటికి వారి పేర్లతోనే పిలవలేదు. ఉదాహరణకు, ఆదిలాబాదు జిల్లాలో గోండు గిరిజనులు ఉన్నారు. వారి అసలు పేరు కోయతూర్. వారి భాషలో వాళ్ళలో వాళ్ళు అలాగే చెప్పుకుంటారు. కోలాములు అని పిలువబడేవాడు. కోల వార్ అని చెప్పుకుంటారు. విశాఖ ప్రాంతంలో కోందులు, సామంతరాజులు గొప్పగా పిలుచుకుంటారు. అయితే వారి అసలు పేరు విడిచిపెట్టి, మైదాన ప్రాంతం వాళ్ళు పెట్టిన

పేరుతోనే లిష్టు తయారు చేసేరు. అలాగే ఖమ్మం జిల్లా 'కొండరెడ్లు' ఇంగ్లీషు పేరు "హిల్‌రెడ్డి" గానే చలామణి అయ్యారు. కోయల అసలు పేరు దొరల మట్టం. అప్పటి బ్రిటీష్‌వారి "చూచిచూడని" విధానంనుండి పథక నిర్వహణలో గిరిజనుల భాగస్వాములుగా చేస్తున్న ప్రస్తుత ప్రభుత్వ విధానం వరకు వచ్చిన మార్పులే ఈ వ్యాసంలో ముఖ్యాంశాలు.

మొదటి పంచవర్ష ప్రణాళికలో గిరిజనాభివృద్ధి కార్యక్రమాలు పెద్దగా చేపట్టినట్లు మనకు ఆధారాలు కనిపించవు. కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకుల ద్వారా కొన్ని కార్యక్రమాలు మాత్రం చేపట్టబడినాయి. రెండవ పంచవర్ష ప్రణాళికలలో మాత్రం, జాతీయ విధానం ప్రకారం మనరాష్ట్రంలో నాలుగు బహుళార్థక గిరిజనాభివృద్ధి మండలాలు స్థాపించబడ్డాయి. విశాఖలో అరకు, పాడేరు, వరంగల్లు జిల్లాలో నర్సంపేట, ఆదిలాబాదు జిల్లాలోని ఉట్నూరు వీటిద్వారా అమలు జరుపబడిన ముఖ్యమైన కార్యక్రమాల్లో రోడ్ల అభివృద్ధి, త్రాగే నీటి సౌకర్యం, మలేరియా వంటి వ్యాధులనివారణ మొదలైనవా. ఆ తరువాత, ఎల్విన్ మహాశయుని ఆధ్వర్యంలో ఒక అధ్యయనం జరిగింది. వీరిసూచనల ప్రకారం మూడవ పంచవర్ష ప్రణాళికలో మనరాష్ట్రంలో, గిరిజన సాంద్రత ఎక్కువగా ఉండే 24 బ్లాకులను గిరిజనాభివృద్ధి బ్లాకులుగా గుర్తించటం జరిగింది. వీటికి కేంద్ర ప్రభుత్వం నుండి ప్రత్యేక సహాయం అందేది. నాల్గవ పంచవర్ష ప్రణాళికలో, యీ కార్యక్రమాలు అమలు జరపటమే కాక, ప్రత్యేక పోషకాహారపథకం, బలహీనవర్గాలకు ఇండ్లు కట్టే కార్యక్రమంకూడా చేపట్టబడింది. ఈ కార్యక్రమాలు ఈలాగే అమలు జరుగుతూండగానే, కొన్ని గిరిజన ప్రాంతాలలో అసంతృప్తిపొకడలు కనిపించాయి. మనరాష్ట్రంలో ముఖ్యంగా అప్పటి శ్రీకాకుళం జిల్లాలో అసంతృప్తి ప్రబలింది. ఇలాగే దేశంలో మరికొన్ని గిరిజన ప్రాంతాలలో కూడా కనిపించింది. దీనికి ప్రతిస్పందించి కేంద్రప్రభుత్వం నాల్గవ పంచవర్ష ప్రణాళికలలో గిరిజనాభివృద్ధి ఏజెన్సీలు ప్రారంభించింది. మనరాష్ట్రంలో కూడా శ్రీకాకుళం జిల్లాలో ఒకటి స్థాపించడం జరిగింది. దీనిని వ్యవసాయాభివృద్ధి ప్రాతిపదికమీద నడపడం జరిగింది.

నాల్గవ పంచవర్ష ప్రణాళికాంతంలో గిరిజన ప్రాంతాలలో అభివృద్ధిపై ఒక పెద్ద సమీక్ష కేంద్ర ప్రణాళికాసంఘం ఆధ్వర్యంలో జరిగింది. సుదీర్ఘమైన చర్చలు తరువాత, గిరిజన ప్రాంతాలు చాలా వెనుకబడి ఉండటానికి కారణాలు కొన్ని ఈ క్రింది విపులీకరించారు.

1. సామాన్య అభివృద్ధి డిపార్టుమెంటులు, ప్రాంతాల అభివృద్ధికి తీవ్ర శ్రద్ధ తీసుకోలేదు.

2. కేంద్ర ప్రభుత్వ ప్రత్యేక సహాయం చాలినంత అందటం లేదు.

3. కేంద్ర ప్రభుత్వ శాఖలు గిరిజన ప్రాంతాలలో ప్రత్యేకమైన కార్యక్రమాలు అంతగా చేపట్టలేదు.

4. బ్యాంకులు రుణాలు అంతగా ఇవ్వటం లేదు.

5. గిరిజన ప్రాంతాల అభివృద్ధి, మిగిలిన ప్రాంతాలతో పోల్చి చూస్తే, చాలా వెనుకబడిఉంది.

ఈ విషయాలు చర్చించిన తరువాత, గిరిజనులు ఎక్కువగా నివశించే ప్రాంతాలకు అయిదవ పంచవర్ష ప్రణాళిక నుండి ఒక ఉపప్రణాళిక తయారుచేయాలని కేంద్ర ప్రణాళికా సంఘం నిర్ణయించింది. ఈ ప్రణాళిక ముఖ్య ఉద్దేశాలు రెండు. 1. గిరిజనులను బయటివారి దోపిడినుండి రక్షించడం. 2. గిరిజన ప్రాంతాలు, మైదాన ప్రాంతాల మధ్య అభివృద్ధిలో ఉండే వ్యత్యాసాల్ని తగ్గించటం.

గిరిజనులను బయటి వారినుండి రక్షించే కార్యక్రమాలు ముఖ్యముగా 1. అటవి 2. అబ్‌కారి 3. మార్కెట్లు 4. భూమి సంబంధిత విషయాలలో చేపట్టబడతాయి. మనరాష్ట్రంవరకు, ఈ విషయాలను క్లుప్తంగా తెలుసుకుందాం. అడవిలో నివసించే గిరిజనులు తమ సొంత వాడకానికి వంటచెరకు తెచ్చుకోవచ్చును. వారి పశువులను మేపుకుందుకు అడ్డంకులు ఉండవు. గిరిజనులుగాని, వారి పశువులుగాని క్రూరమృగముల వలన దెబ్బలు తినుటకాని, విడిపోవుటగాని సంభవించినచో తగు ఆర్థిక సహాయం చేయబడును. యీ మధ్యనే వచ్చిన ఉమ్మడి అటవీ యాజమాన్యం అనబడే క్రొత్త విధానం ప్రకారం, గిరిజనులు వారి గ్రామాల చుట్టుప్రక్కల ఉన్న అడవులను సంరక్షించి పెంపొందించే కార్యక్రమం కూడా ప్రారంభించ బడింది. ప్రపంచబ్యాంకు సహాయంతో "ఆంధ్రప్రదేశ్ అటవీ అభివృద్ధి" వచ్చే సంవత్సరంనుండి ప్రారంభం అవుతుంది. దానిలో ఈ క్రొత్త విధానాలకు ప్రముఖ స్థానం ఇవ్వబడింది.

అబ్‌కారి విధానం ప్రకారం, గిరిజన ప్రాంతాలతో సహా రాష్ట్రం అంతటా సారానిషేధం అమలు జరుపబడుతుంది. గిరిజనులను మార్కెట్టులో దళారీలనుండి రక్షణ కల్పించుటకు కొన్ని ప్రత్యేకమైన కార్యక్రమాలు చేపట్టబడుతున్నాయి. రాష్ట్ర ప్రభుత్వ గిరిజన సహకార సంస్థకు ఏజెన్సీ ప్రాంతంలో గిరిజనులు సేకరించే చిన్న తరహా అటవీ ఫలసాయం కొనుగోలు పై ఒక రెగ్యులేషన్ ద్వారా సర్వాధికారాలు ఇవ్వబడ్డాయి. దీనివల్ల బయటి షావుకారులు గిరిజనులవద్ద నిర్ణయించిన యీ అటవీ ఫలసాయాన్ని కొనకూడదు. అయితే గిరిజనులకు సరియైన ధర యిచ్చేందుకు, బయటి మార్కెట్టుకు గిరాకీ పెంచుటకు యీ మధ్యనుంచే పరిశోధన, శిక్షణ కార్యక్రమాలు చేపట్టబడుతున్నాయి. నాణ్యమైన జిగురును సేకరించే విధానాలలో శిక్షణ ఇచ్చుట, జిగురు ఉపయోగాలలో క్రొత్త పద్ధతులు కనిపెట్టుట, బిళ్ళగింజలనుండి క్రొత్త ఉత్పత్తులు కనిపెట్టుట మొదలగునవి యీ మధ్య జరిగిన ముఖ్యమైన శిక్షణ పరిశోధన కార్యక్రమాలు, వీటివలన గిరిజనుల నుండి ఉత్పత్తి సేకరణ ధరను పెంచేందుకు అవకాశాలు బాగా పెరుగుతాయి. జబ్బులు వచ్చినప్పుడు పెండ్లి, చావు, ఖర్చులకు షావుకారు నుండి అప్పుతీసుకుని, ఆ విషవలయంలో గిరిజనులు

చిక్కుకు పోకుండా, గిరిజన కార్పోరేషన్ ద్వారా చిన్నతరహా అప్పులు ఇవ్వడంజరుగుతోంది.

గిరిజన రైతులకు వడ్డీ వ్యాపారస్తులనుండి, షావుకార్లనుండి కాపాడేందుకు, ఒక సమగ్ర ఋణ విధానం కూడా అమలు జరుపబడుతోంది. గ్రామ గిరిజన పెద్దల కమిటీ ద్వారా అప్పుకావలసినవారి పట్టిక తయారు చేస్తారు. ఎవరికి ఎంత అప్పు ఇవ్వాలో వారే నిర్ణయించడమే కాక, సక్రమగా ఉపయోగించేలా చేయటం అప్పుతీర్చడం, బాధ్యతలు ఆగ్రామ పెద్దలే స్వీకరిస్తారు. విత్తనాలు ఎరువుల, పురుగుమందులు మొదలగునవి గ్రామ పెద్దల నుండే ఆయా గ్రామాలలోనే సరఫరా చేయటమే కాక, ఉత్పత్తి కొనుగోలు కూడా గ్రామంలోనే చేయటం మరోవిశేషం. గిరిజనులు వారి కార్యక్రమం వారే ప్రణాళిక చేసుకోవటం, అమలు పరచుకోవటం అవసరానికి కావలసినంతవరకే అప్పుతీసుకోవటం సరిగ్గా వాడుకోవటం, ఎన్ని కష్టాలున్నా అప్పు తీర్చటం జరుగుతుంది అనే పద్ధతి అలవడుతోంది.

షెడ్యూలు ప్రాంతాలలో గిరిజనుల భూమి అన్యాక్రాంతం కాకుండా ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు ప్రాంతాల భూమి బదలాయింపు చట్టం అమలు జరుపబడుతూంది. అది కాకుండా అప్పుల బారి నుండి రక్షించేందుకు, ఋణవిముక్తి చట్టం, వడ్డీ వ్యాపారం క్రమబద్ధం చేసే చట్టాలు కూడా అమలులో ఉన్నాయి.

ఇక గిరిజన ప్రణాళిక రెండవ లక్ష్యం. మైదాన ప్రాంతాలతో సమానస్థాయికి జరిగిన ప్రాంతాలను తీసుకురావటం ప్రణాళికా సంఘం ఐదవ ప్రణాళికలో నిర్ణయించిన ప్రకారం, గిరిజన ప్రాంతాలు, మైదాన ప్రాంతాల స్థాయికి ఏడవ ప్రణాళికాంతానికైనా రావాలని దీనికై ప్రత్యేక కృషి చెయ్యాలి అని ఆదేశించటం జరిగింది. ప్రణాళికా రచనలోను, అమలులోను కొన్ని క్రొత్త గ్రంథాలు రచించటం జరిగింది. గిరిజన ఉప ప్రణాళికా ప్రాంతాలను గుర్తించటానికి ఏజెన్సీ (షెడ్యూలు) ప్రాంతాలే కాక వాటిని అనుకున్న ఉన్న గిరిజన సాంద్రత కలిగిన గ్రామాలను కూడా కలపడం జరిగింది. ప్రతి జిల్లాలోను ఇటువంటి ప్రాంతాలకు ఒక సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ స్థాపించడం జరిగింది. సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ ప్రాంతాభివృద్ధికి ప్రతిఏటా ఒక సమగ్ర ప్రణాళికను రూపొందించటం కూడా జరుగుతోంది. గిరిజనాభివృద్ధి సంస్థకు ఒక సీనియర్ ఐ.ఏ.ఎస్. అధికారిని కాని, అదే హోదాలో ఉండే రాష్ట్రప్రభుత్వ అధికారిని కాని నియమించడం జరుగుతుంది. వారికి సహాయ అధికారులుగా, వ్యవసాయం, పండ్లతోటలు, పశుగణాభివృద్ధి, పట్టుపరిశ్రమ, చేపల పెంపకం, విద్య, ఇంజనీరింగ్ మొదలయిన శాఖాధికారులు పనిచేస్తారు. గిరిజనుల భూమి అన్యాక్రాంతం కాకుండా కాపాడేందుకు, ఒక ప్రత్యేక డిప్యూటీ కలక్టరు ఉంటారు. వారి ద్వారా వీరి ఆధ్వర్యంలో ఆంధ్రప్రదేశ్ (అనుసూచిత ప్రాంతాల) భూమి బదలాయింపు చట్టం అమలు పరచడం జరుగుతోంది. గిరిజనాభివృద్ధి కార్యక్రమాలలో సమన్వయం సాధించటానికి ఆ ప్రాంతంలోనే ఉండే అధికారులందరిని ప్రాజెక్టు అధికారి క్రిందకు

తీసుకురావటమే కాక, గవర్నింగ్‌బాడీ ద్వారా పరిశీలన చేయబడుతోంది. ప్రాజెక్టు అధికారికి ఒక లక్షరూపాయల వరకు కార్యక్రమాలు మంజూరు చేసేందుకు అధికారం ఉంది. అదే విధంగా జిల్లా కలక్టరుకు రెండులక్షల రూపాయల వరకు మంజూరు చేసే అధికారం ఉంది. రాష్ట్రస్థాయిలో గిరిజన ఉపప్రణాళికకోసం ఒక ప్రత్యేక బడ్జెట్టు డిమాండును ప్రవేశపెట్టడంకూడా జరిగింది.

ఏజెన్సీ ప్రాంతాలలో పనిచేసే ఉద్యోగులకు ఇంటిఅద్దె ఎలవెన్సు ఎక్కువగా ఇవ్వటమేకాక, ప్రత్యేక నష్టపరిహార ఎలవెన్సు అనారోగ్య ప్రాంతాల ఎలవెన్సుకూడా ఇవ్వటం జరుగుతోంది.

ఐదవ పంచవర్ష ప్రణాళికారంభంలో నిర్ణయించిన లక్ష్యాలు సాధించలేక పోయిననూ ఉపప్రణాళికవలన కొన్ని ప్రయోజనాలు కలిగాయి ఇంచుమించు అన్ని పెద్ద గ్రామాలలో ఏకోపాధ్యాయ పాఠశాలలు వచ్చాయి. ఆశ్రమ పాఠశాలలు, గురుకుల పాఠశాలల, గురుకుల పారిశ్రామిక శిక్షణాసంస్థలు, గురుకుల పాలిటెక్నిక్‌లు, పరీక్ష పూర్వశిక్షణా కేంద్రాలు స్థాపించబడ్డాయి. సుమారు నలభై శాతం వరకు గ్రామాలకు విద్యుద్ధీకరణ జరిగింది. ముప్పై శాతం వరకు భూములకు నీటిపారుదల సౌకర్యం కలిగింది. చాలామంది గిరిజనులు ఉపాధ్యాయులుగాను, ఫారెస్టు గార్డులుగాను నియమించబడ్డారు డాక్టర్లు, ఇంజనీర్లు తయారవుతున్నారు. వేల ఎకరాలలో పండ్లతోటలు, కాఫితోటలు వచ్చాయి. మారుతున్న గిరిజన ప్రాంతాలలో ఇదివరకటి స్థబ్దత లేదు. చైతన్యం వస్తోంది. ఈ చైతన్యానికి స్పందనే మధ్యన ప్రవేశపెట్టిన "గిరిజనుల్ని పథకయాజమాన్యంలో భాగస్వాములుగా చేసే విధానం".యీ పథకం వివరాలు కొన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

ఉత్తర కోస్తా ఆంధ్ర ప్రాంతంలో నివశించే కొంతమంది గిరిజనులు పోడు వ్యవసాయం చేస్తారు. ఆ పోడు వ్యవసాయ దారులను, ఆయాప్రాంతాలను అభివృద్ధి నిధి సహాయముతో ఒక క్రొత్త కార్యక్రమం యీ మధ్యనే చేవట్టబడింది. దీనిలో ముఖ్యమైన అంశం గిరిజనుల్ని "పథక యాజమాన్యంలో భాగస్వాముల్ని చేయటం". ఆయా ప్రాంతాలకు కావలసిన పథక రూపకల్పనలోను, నిర్వహణలోను వారిదే పైచెయ్యి. ఏయే కార్యక్రమాలు చేపట్టాలి. అన్నది గ్రామ పెద్దలు, గ్రామస్థులే నిర్ణయించాలి. ఆ కార్యక్రమం వారే చేపట్టాలి. దానకి కావలసిన ఆర్థిక వనరులు, శిక్షణ సలహాలు మొదలగునవి సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ అధికారులు ఇస్తారు. పథకం అమలు అయిన తర్వాత నిర్వహణ కూడా వారే చేస్తారు. యీ కార్యక్రమం చాలా చురుకుగా సాగుతోంది. గిరిజనుల్లో, ముఖ్యంగా స్త్రీలలో స్పందన, చైతన్యం బాగా కనిపిస్తోంది. గిరిజన మహిళలు పొదుపు సంఘాలుగా ఏర్పడి వారు పొదుపు చేసుకున్న ధనాన్ని వారే అప్పులుగా ఇచ్చుకొంటూ బయటి షావుకారుల బెడద తగ్గించుకున్నారు.

చాలా ప్రాంతాలలో సారా వ్యతిరేక ఉద్యమంచేపట్టటంవల్ల గ్రామాలలో ప్రశాంతత నెలకొనటమేకాక, ఆరోగ్యపరంగా, ఆర్థికపరంగా లాభాలు వచ్చాయి. కొన్ని మహిళా సంఘాలు చెక్కు డ్యామ్‌లు కట్టడం, అంగన్‌వాడి భవనాలు కట్టడం, రోడ్లు వేయడంలాంటివి చేయటం వలన కంట్రాక్టర్ల దోపిడీ ఆగడమేకాక, గిరిజనుల ఆత్మస్థైర్యం పెరిగింది. నిర్వహణ బాధ్యత కూడా పెరిగింది. గిరిజనులు వారి స్థితిగతులను పెంపొందించుకునేందుకు వారే పూనుకోవటం ఒక విశేషం. అన్ని ప్రాంతాలలోను, అన్ని కార్యక్రమాలలోను ఇది ఒక ఉద్యమంలాగే సాగితే, గిరిజన ప్రాంతాలలో దోపిడీ తగ్గిపోతుంది. అసంతృప్తి ఉండదు. అమాయకత్వాన్ని అసంతృప్తిని ఆధారంగా తీసుకుని కల్లోలం సృష్టించేవారికి అవకాశాలు సన్నగిల్లుతాయి, గిరిజనాభివృద్ధి నిరాటంకంగా కొనసాగుతుంది.

*

# ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన తెగలు - విస్తృత రూపం

- భూక్యా చిన వెంకటేశ్వర్లు

దక్షిణ భారతదేశంలో అత్యధిక సంఖ్యలో గిరిజన తెగలు నివసించే ప్రాంతం ఆంధ్రప్రదేశ్, 1981 జనాభా లెక్కలు ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డు తెగల సంఖ్య 3.18 మిలియన్లు అంటే ఆంధ్రప్రదేశ్ మొత్తం జనాభాలో ఇది 5.95 శాతం భారతదేశ జనాభాలో 0.47 శాతం

ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు 31 రకాల గిరిజన తెగలు నివశిస్తున్నాయి. అందులో చాలా కొద్ది సంఖ్య నుంచి కొన్నివందల వేల సంఖ్య వరకూ జనాభా వున్న వివిధ గిరిజన తెగలు మనకు కనిపిస్తాయి. రోనా తెగవారు 289, భిల్ తెగవారు 560 సంఖ్యలో వున్నారు. కోయ 2 లక్షలు, యానాది 2 లక్షలకు పైగా వున్నారు 1971 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డు తెగల నివాస ప్రాంతాల్లో మొత్తం జనాభా సంఖ్య 16,57,650గా చెప్పబడుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన తెగలు మైదాన ప్రాంతాల్లోనూ, కొన్ని ప్రత్యేకించిన ప్రాంతాలుగా పరిగణింపబడే ఏజన్సీ ప్రాంతాలలోను నివసిస్తున్నారు. ఏజెన్సీ ప్రాంతాలు కొండలతో, అడవులలోను నివసిస్తున్నారు. ఏజెన్సీ ప్రాంతాలు కొండలతో, అడవులతో నిండిన ప్రదేశాలు మైదానాలు సమతల ప్రదేశాలు భౌగోళికంగా ఈ ఏజన్సీ ప్రాంతాలని పునరావాస ప్రదేశాలుగా పేర్కొనవచ్చు. ఇవి చారిత్రకంగా హిందూ సంస్కృతి పరిరక్షకుల బారినుండి తప్పించుకొన్న గిరిజన తెగల వుదంతాన్ని గుర్తుకు తెస్తాయి.

గిరిజన తెగలను వారి నివాసప్రాంతాలనుబట్టి రెండువర్గాలుగా విభజింపవచ్చు. 1) ఏజెన్సీ ప్రాంతాల్లో వున్నవారు, 2) మైదాన ప్రాంతాల్లో వున్నవారు, ఏజెన్సీ ప్రాంతం అడవులతో, కొండలతో నిండిన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, ఖమ్మం, వరంగల్, ఆదిలాబాద్. మహబూబ్‌నగర్ జిల్లాలకు విస్తరించివుంది. ఈ ప్రాంతం మొత్త 11,595 చ.మై విస్తీర్ణం కలిగివున్నట్లుగా లెక్కలు చెబుతున్నాయి షుమారు 8,00,000 గిరిజనులు ఈ ప్రాంతాలలో నివసిస్తున్నారు ఏజెన్సీ ప్రాంతంలో నివసిస్తున్న గిరిజన తెగలు, అంధ, భగత్, చెంచు, భిల్, గదం, గోండ్, గౌడ్, కమ్మర, ఖోండ్, కొలమ్ కొండదొర, కొండరెడ్డి, కొటియా, కోయ, కలియా, కలియామాలి, మన్నెదొర, మూకదొర, నాయపోడ్, పోరాజ, ప్రధాన్, రెడ్డిదొర, సవర, తోటి, వాల్మీకి మొదలైనవారు మైదాన

ప్రాంతాలలో నివసిస్తున్న వారు కట్టునాయకన్, రోన, సుగాలి, యానాది యెరుకల మొదలైనవారు.

ఏజెన్సీ ప్రాంతాలు అత్యధికశాతం గిరిజనులకు నివాస స్థానాలే అయినా గిరిజనేతర జనాభాకూడా అక్కడ చోటు చేసుకొని వుంది. గత వంద సంవత్సరాలలో కొంత మంది గిరిజనేతరుల గిరిజన తెగల మధ్య స్థిరపడి పోవటం జరిగింది. అందుకు విరుద్ధంగా కొన్ని గిరిజన తెగలు మైదాన ప్రాంతాల్లో వున్న గిరిజనేతర నివాసాలమధ్య చోటుచేసుకొని ఉండటం గమనించతగిన విషయం.

సంస్కృతంలో వున్న చాలా పవిత్ర గ్రంధాలు ఆంధ్రప్రదేశ్‌తో వున్న గిరిజన తెగల గురించి తెలుపుతున్నాయి. ఋగ్వేదంలో భాగమైన ఐతరేయ బ్రాహ్మణంలో భారతద్వీప కల్పంలోని అంధగిరిజన తెగలగురించి ప్రస్తావనవుంది. ఆదిలాబాద్ జిల్లాలోని అంధగిరిజన తెగ ప్రాచీన గిరిజన తెగ అయిన ఆంధ్రనుచి ఉత్పన్నమైందని ప్రస్తుతం నమ్ముతున్నాయి.

రామాయణంలో పేర్కొన్న జనస్థాన, కిష్కింధలు గిరిజన తెగల ప్రాంతాలు, వాటిని ప్రస్తుత ఆంధ్రప్రదేశ్‌లో ఉత్తర పశ్చిమ ప్రాంతాలుగా నివసిస్తున్నారు రామాయణంలో కొండలతో అడవులతో నిండిన గిరిజన తెగల నివాస ప్రాంతాన్ని దండకారణ్యంగా ప్రస్తావించబడింది. ప్రస్తుత ఆంధ్రప్రదేశ్‌లో ఉత్తర ప్రాంతాలు ఈ దండకారణ్యమే కావచ్చని నమ్మవచ్చు. రామాయణ, మహాభారతంలో శబరలుగా పేర్కొనబడిన గిరిజన తెగలనుండి శ్రీకాకుళం జిల్లాలోని సవరలచే గిరిజన తెగ ఉత్పన్నమైనట్లు చెప్పబడుతుంది. శ్రీకాకుళం విజయనగరం విశాఖపట్టణం జిల్లాలో వున్న ఏజన్సీ ప్రాంతాలలో వున్న వాల్మీకి తెగవారు కిరాతకుడిగా ఉండి, జ్ఞానిగా మారి రామాయణం రచించిన వాల్మీకి తమ తెగకు మూలపురుషుడేనని చెబుతారు. ఎరుకల తెగకు సంబంధించిన ప్రచార గాథలు తన గురువైన ద్రోణాచార్యుడు గురు దక్షిణగా కుడిచేతి బొటనవ్రేలిని అర్పించిన ఏకలవ్యుడు ఎరుకల తెగకు మూలపురుషుడని ఎరుకలవారి నమ్మకం మహాభారతంనాటి పాలకులు హిందూనాగరికతలోకి గిరిజన తెగలను కూడా తీసుకురావడానికి కృషిచేసినట్లు తెలుస్తుంది.

పరిపాలకుల, సన్యాసులు, ఋషులు, కొన్ని శతాబ్దాలుగా చేస్తూవచ్చిన ప్రయత్నాలవల్ల గిరిజన తెగలు గిరిజనేతరుల మధ్య సంబంధాలు కొనసాగుతూ వచ్చాయి. తత్ఫలితంగా గిరిజనతెగలు గిరిజనేతరులు సాంస్కృతిక అంశాలెన్నింటినో గ్రహించటం జరిగింది. చెంచులు, సవరలు, గోండులు, కొండరెడ్లు, బగతలు మొదలైన వారు గిరిజనేతరుల శైవ, వైష్ణవ తత్వాలనుంచి ఎన్నో అంశాలను తీసుకోవడం జరిగింది. వాళ్ళలో కొంతమంది గోండ్లు, కొండరెడ్లు మొదలైన వారు బలవంతులైన పరిపాలకులుగా తయారయ్యారు. ఆ విధంగా రాజగోండులని కొండరెడ్లు, రాజరెడ్లని పేర్నొనటం జరిగింది.

బగతలు కొండ దొరలు, మూక దొరలు క్షత్రీయ చిహ్నామైన రాజు అనే పదాన్ని తమ పేర్లముందు చేర్చుకోవడం జరిగింది.

రాజగోండ్లు చాలాకాలంవరకు మహారాష్ట్రలోని చంద్ జిల్లా మధ్యప్రదేశ్‌లోని మండ్ల, బింద్‌వాడా జిల్లాలు; ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిలాబాద్ వరంగల్ జిల్లాలవరకు వ్యాపించిన ప్రాంతాన్ని పరిపాలించారు. మరాఠులు వారిని సింహాసనంనుండి తొలగించేవరకు మొగల్ పరిపాలనా కాలంలో వారు స్వతంత్ర పరిపాలకులుగా నున్నారు. వారు నీటి పారుదలకోసం చెరువులు త్రవ్వించారు. వ్యవసాయాన్ని ప్రోత్సహించారు. గిరిజన తెగల గిరిజనేతరుల మధ్య పరస్పర చర్యల్ని వృద్ధి చేసారు.

సవరలు కూడా చాలా శతాబ్దాలు పరిపాలకులుగానే వున్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాకుళం జిల్లా మొత్తం విస్తరించిన ప్రాంతమంతా వారి పరిపాలనలో వుండేది.

మూకదొరలు, కొండదొరలు చాలా పెద్దప్రాంతాల్ని అంటే పాత గిరిజనతెగల ఎస్టేట్లయిన కురుపురం, చినమేరంగి, అంధ పాచిపెంట (శ్రీకాకుళం జిల్లా) మొదలైన ప్రదేశాలను పరిపాలించారు. తెలుగు, ఒరియా భాషలోని పండితులను వారు ఆదరించి పోషించారు.

కొండరెడ్లు, రాచరెడ్లు ప్రస్తుతం పశ్చిమగోదావరి జిల్లాలో వున్న కొవ్వూరు, పోలవరం, చింతలపూడి మొదలైన ప్రాంతాలను పరిపాలిస్తూ వుండేవారు. వారి పరిపాలన తరువాత ఇప్పటికికూడా ఈ ప్రాంతం రెడ్డిసీమగా పిలవబడుతుంది. వారు కూడా వారి ప్రాంతంలో గిరిజన తెగలు, గిరిజనేతరుల మధ్య పరస్పర చర్యలను ప్రోత్సహించారు.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానంగా ఆస్ట్రిక భాషా కుటుంబం, ద్రావిడ భాషా కుటుంబం, ఇండో - యూరోపియన్ భాషా కుటుంబానికి చెందిన గిరిజన తెగల భాషలు కనిపిస్తాయి. వీటిలో రెండు గిరిజన తెగల బాషలు ఆస్ట్రిక్ భాష కుటుంబానికి చెందినవి వున్నాయి. 19 గిరిజన తెగల భాషలు ద్రావిడ భాషా కుటుంబానికి చెంది వున్నాయి. ఇండో - యూరోపియన్ భాషా కుటుంబానికి చెందినదేమరి రెండు గిరిజన తెగల భాషలున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న గిరిజన తెగల భాషల్లో చాలా వైవిధ్యమూ, ప్రత్యేకతలు వున్నాయి. గదబలాంటి గిరిజన తెగల్లో భాషకు సంబంధించిన తెగలవారు ద్విభాషీయులు బహుభాషీయులుగాను వుంటారు. ఎందుకంటే వారు తమ మాతృ భాషనే కాకుండా పరిసరాల్లో నివసించేవారి భాషను కూడా నేర్చుకొని మాట్లాడుతుంటారు. గోండు సవర భాషలు ఆ పరిసర ప్రాంతాల్లో నివసించే మరికొన్ని తెగలుకూడా మాట్లాడటం చేత ఆ భాషలకు ఏజన్సీ ప్రాంతాల్లో ప్రాంతీయ బాషా ప్రతిపత్తి కూడా చేకూరింది. తూర్పుగోదావరి జిల్లాలో రంపచోడవరంలో నివసించే కోయ తెగవారు వారి మాతృభాషను మరచిపోయి

పరిసర ప్రజలు మాట్లాడే తెలుగునే మాట్లాడటం గమనార్హం, అంధ భగత్ చెంచు, గోండు, కొండరెడ్డి, మన్నెదొర, రెడ్డిదొర, యానాది వాల్మీకి మొదలైన తెగలవారు, తెలుగుతప్ప తమ మాతృభాషలను మాట్లాడటం లేదు ఆ విధంగానే కమ్మర, కోటియా, కులియా, దూలి మొదలైన తెగలవాళ్ళు తమతమ మాతృభాషను పూర్తిగా మరచిపోయారు. వాళ్ళు ఒరియా భాషనే మాట్లాడుతున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన తెగల అక్షరాస్యత స్థాయిలో తేడాలున్నాయి. అంధ, కమ్మర, ఖోండ్, కొండదొర, కొలమ్, కొటయా, కులియ, గదబ, గౌడు, తోటి, మన్నెదొర, మాలి, మూకదొర మొదలైన తెగల్లో నూటికి ఒకరు చొప్పున అక్షరాస్యులు వున్నారు. కోయ, గొండ్ తెగల్లో సుమారు మూడు శాతం అక్షరాస్యులు వున్నారు. చెంచుతెగలో సుమారు 1.5 శాతం అక్షరాస్యులు వున్నారు. కొండరెడ్డి తెగలో రెండు శాతం అక్షరాస్యులు వున్నారు. ప్రధాన్ తెగలో ఐదుశాతం, బగత్‌తెగలో అరు శాతం,సవర్లలో ఏడుశాతం, వాల్మీకి తెగలో సుమారు 11 శాతం అక్షరాస్యులు వున్నారు. ఆ విధంగా ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన తెగల్లో అక్షరాస్యుల శాతం చాలా క్షీణప్రమాణంలో వుంది.

*

# పరిచయము



శ్రీ భూక్యాచిన వెంకటేశ్వర్లు ఆంధ్రప్రదేశ్ గిరిజన జాతుల సంక్షేమ సంఘాధ్యక్షులుగా గిరిజన జాతుల సంక్షేమానికి పాటుపడే వ్యక్తి.

ది. 1-6-1953 సం॥లో గుంటూరుజిల్లా దుర్గిగ్రామములో మధ్య తరగతి సుగాలి కుటుంబంలో జన్మించారు.

ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి (గుంటూరు)లో బి.ఏ. వరకు చదివారు. విద్యార్థి దశలో కాంగ్రెస్ రాజకీయాల్లో చురుకుగా పాల్గొని 1976లో జిల్లా యువజన కాంగ్రెసు పార్టీ కార్యదర్శిగా పనిచేసారు.

1977 - 1985 నాగార్జున విశ్వవిద్యాలయం సెనెట్ సభ్యులుగా పనిచేసారు.

1987 నుండి నేటిదాక పూజా పబ్లికేషన్ మరియు యోజిత్ బుక్‌లింక్స్ స్థాపించి, (1) భారతదేశ గిరిజనులు, (2) ది డాన్ ఆఫ్ న్యూ ఎరా, (3) కన్యాకుమారి, (4) ఉషోదయం (5) గిరిజన ప్రవంతి (6) ఏక పాత్రలు (7) ప్రేమా నీ స్థానమెక్కడ ? (8) చీకటి కడుపు చీల్చుకువచ్చిన దళితజ్యోతి-భారతరత్న బాబా సాహెబ్ డా॥ బి.ఆర్.అంబేద్కర్ (9) ట్రైబల్ లైఫ్ (10) నవసమాజ నిర్మాతలు (11) రాయలసీమ వైతాళికులు (12) జాతీయ నాయకులు వీరనారీమణులు (13) బుద్ధబగవానుడు (14) మనిషి మొదలైన అనేకరచనలు చేసారు.

1979 - 1983 శ్రామిక విద్యాపీఠం (గుంటూరు) డైరెక్టరుగా పనిచేసారు.

1980 - 1982 ఎ.పి.యస్.ఆర్.టి.సి. ఐ.యన్.టి.యు.సి. విభాగానికి గుంటూరు జిల్లా కార్యదర్శిగా పనిచేసారు.

1981 - 1985 గుంటూరు జిల్లా గ్రంథాలయ సంస్థ డైరెక్టరుగా, పర్సన్ ఇన్‌ఛార్జి ఛైర్‌పర్సన్‌గా ఉన్నారు.

1981 - 1986 గుంటూరు మున్సిపాల్టీ 12వ వార్డ్ కౌన్సిలర్‌గా వున్నారు.

1987 - 1992 బెల్లంకొండ మండల ప్రజాపరిషత్ అధ్యక్షులుగా వుండి ఆ మండలాభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు. 1992లో మళ్ళీ తిరిగి ఎన్నికయ్యారు.

1978 లో బలహీన వర్గాల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని "నడక" దినపత్రికను స్థాపించి, సంపాదకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

1993 లో గిరిజనుల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని "గిరిజన ప్రవంతి" మాసపత్రికను స్థాపించి, రాష్ట్రంలో వారి అభివృద్ధికి కృషిసల్పుతున్నారు.

1980 లో గుంటూరు ప్రెస్‌క్లబ్ కార్యదర్శిగా రెండుసార్లు ఎన్నికై జర్నలిస్టుల సంక్షేమానికి కృషి చేసారు.

1996 లో ప్రెస్‌క్లబ్ అధ్యక్షులుగా ఎన్నికైనారు.

1993 నుండి జిల్లా చిన్న పత్రికా సంపాదకుల సంఘాధ్యక్షులుగా వుండి చిన్న పత్రికా సంపాదకుల సంక్షేమానికి కృషి చేస్తున్నారు.

1994 నుండి 96 వరకు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో మేనేజ్‌మెంట్ బోర్డు సభ్యులుగా వున్నారు.

చిరునామా : **శ్రీ భూక్యా చినవెంకటేశ్వర్లు**

డి.నెం 7-16-68/1, వల్లూరివారితోట, గుంటూరు - 522 002.

ఫోన్ : 235692 ప్రెస్‌క్లబ్ : 241368